

## జిల్లా నీటి యాజమాన్య సంస్థ
### మెదక్
### అభివృద్ధి పథకముల వివరములు



శ్రీ బి. వెంకటేశం
కలెక్టర్

శ్రీ ఎం. జగన్నాథం
DWMA.PD

వాటర్ షెడ్ అభివృద్ధి పథకము : గ్రామాలలోని భూమి, నీటి వనరులను, చెట్లను సమగ్రంగా అభివృద్ధిపరచుచు, రైతు కూలీల ఆర్థిక వనరులను పెంపొందించడానికిగాను, ప్రభుత్వం 1995-96 సంవత్సరంలో మెదక్ జిల్లాలో వాటర్ షెడ్ అభివృద్ధి పథకము ప్రవేశపెట్టింది. ఈ జిల్లాలో మొత్తము 550 వాటర్ షెడ్లు మంజూరి కాగా అందులో 300 వాటర్‌షెడ్‌లలో పని పూర్తి కాబడినది. మరియు మిగతా 250 వాటర్‌షెడ్‌లలో పనులు జరుగుచున్నవి. ఇంతవరకు ఇట్టి స్కీంలో రూ.5942.51లక్షలు ఖర్చు చేసి 99,041.83 హెక్టార్ల భూమిని ఇట్టి వాటర్ షెడ్ల ద్వారా అభివృద్ధి చేయడం జరిగినది.

ఆంధ్రప్రదేశ్ గ్రామీణఉపాధి హామీ పథకము : గ్రామాలలో పని దొరకనందున వలసలు నివారించుటకై మరియు వారి కనీసం 100 రోజుల నైపుణ్యము లేని పని కల్పించుట ఆంధ్రప్రదేశ్ గ్రామీణఉపాధి హామీ పథకము ముఖ్య ఉద్దేశము. ఈ పథకమును ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఫిబ్రవరి 2006 న ప్రారంభించినది.

ఈ పథకము క్రింద ఇంతవరకు 29,183 పనులను రూ.31,108.88లోల అంచనా వ్యయంతో జిల్లాలోని అన్ని 46 మండలములలో చేపట్టుటకు ఆమోదించనైనది. అందులో 2442 పనులు రూ.1955.23 లక్షల వ్యయంతో పూర్తి కాగా, 14568 పనులు రూ.18496.18 లక్షల అంచనా వ్యయంతో ప్రస్తుతము జరుగుచున్నవి. ఇంతవరకు ఈ పథకము క్రింద రూ.7893.26లక్షలు మొత్తం ఖర్చు జరిగినది. మొత్తం 3,18,355 కుటుంబాలు 6,90,268 వ్యక్తులు తమ పేర్లు నమోదు చేసుకున్నారు. ఇప్పటి వరకు 2,51,344 కుటుంబాలలోని 3,55,358 వ్యక్తులకు ఉపాధి కల్పించబడెను.

ఇందిరమ్మ చెరువులు : ఓ ప్రభుత్వము ఉత్తర్వులు మెమో నెం.19958/ఆర్.డి.-॥/2006 పంచాయితీ రాజ్ మరియు గ్రామీణాభివృద్ధిశాఖ తేది :06-11-06లో ప్రతి గ్రామపంచాయితీలో ఒక్క చెరువు అభివృద్ధి పని చొప్పున అం.ప్ర.ఉ.హా. పథకము క్రింద చేపట్టుటకు ఆదేశించినారు. ఓజిల్లాలోని 1061 గ్రామ పంచాయితీలకు గాను 952 చిన్న నీటి పారుదల చెరువుల పనులను చేపట్టబడును. ఓ చెరువులు లేని గ్రామ పంచాయితీలలో ఇతర నీటి సంరక్షణపనులను అనగా పర్కులేషన్ ట్యాంకుల వంటివి ఉపాధి హామీ పథకము క్రింద చేపట్టబడును. ఓ 952 గుర్తించిన చెరువు పనులలో 100 ఎకరాల కంటే తక్కువ ఆయకట్టు విస్తీర్ణం కలవి 802 చెఱువులు మరియు 100 ఎకరాల కంటే ఎక్కువ ఆయుకట్టు కలవి 150 చెఱువులు గలవు. ఓ పై పనుల అంచనా వ్యయము రూ.4442.168 లక్షలు కలదు. ఓ ఇంత వరకు కూలీలకు చెల్లించిన మొత్తము రూ.1014.26 లక్షలు. ఓ ఇంత వరకు రూ.1226.58 లక్షలు మొత్తం ఖర్చు జరిగినది. ఓ ఇప్పటి వరకు కూలీలకు కల్పించిన పని దినములు 11,62,320.

పేదల భూముల్లో పండ్ల తోటల పెంపకము : ఈ పథకము క్రింద 6963 మంది లబ్దిదారులకు 13706.77 ఎకరములలో మామిడి, బత్తాయి పండ్ల మొక్కలు నాటుటకు మరియు సూక్ష్మ నీటి సాగు మొత్తం రూ.19.83కోట్ల అంచనా వ్యయంతో 38 మండలములలో జిల్లా నీటి యాజమాన్య సంస్థ మరియు ఉద్యాన శాఖల సమన్వయంతో పేదల భూముల్లో చేపట్టుటకు జిల్లాకు కలెక్టర్ గారు పరిపాలనా ఆమోదము ఇచ్చినారు.

ఇందిర ప్రభ సమగ్ర భూమి అభివృద్ధి పథకము : (ప్రభుత్వము గ్రామీణఅభివృద్ధి తన ఉత్తర్వులు జి.వో.ఎం.ఎస్.నెం.212, తేది : 11.8.04). గతములో పేద ప్రజలకు ఇచ్చిన అసైన్డ్ భూములు చాలా వరకు బీడు భూములుగా ఉండిపోయినవి. ఈ బడుగుజీవులు జీవన ప్రమాణములను మెరుగుపరుచుటకు వారి భూములను వారి చేతనే అభివృద్ధి చేయించి, పంటలు పండించి వారికి నికరాదాయమును కలిగించి రైతు కూలీలను రైతులకు మార్చుటకు ఈ పథకము ప్రవేశపెట్టబడినది.

ఈ పథకము ఆర్.ఐ.డి.ఎఫ్ RIDF-IX & RI ఈఓ-ఒ లలో చేపట్టబడుచున్న పనుల వివరములు దిగువ చూపబడినవి.

| No. | Item | | | | |
|---|---|---|---|---|---|
| 1. | Project Cost (Rs. in Lakhs) | | 1400 | 1275.15 | 2675.15 |
| 2. | No.of Mandals 46 | 43 | 46 | | |
| 3. | No. of Villages 156 | 181 | 337 | | |
| 4. | No. of Blocks sanctioned (Villages) | | 159 | 215 | 374 |
| 5. | Area Covering (in Ac.) | 13505 | 9974 | 23479.00 | |
| 6. | Area Grounded12264.31 | 8600.06 | 20864.37 | | |
| 7. | No.of families covering | 10610 | 9495 | 20105 | |
| 8. | No. of SC families | 4731 | 4141 | 8872 | |
| 9. | Funds released (Rs.in Lakhs) | | 1006.00 | 290.00 1296.00 | |
| 10. | Expenditure (in Lakhs) | 943.262 | 356.431 | 1299.69 | |



# మెతుకుసీమ
# చరిత్ర - సంస్కృతి









మంజీరా రచయితల సంఘం

# మెతుకుసీమ చరిత్ర - సంస్కృతి



రచయితలు

కె. అంజయ్య

నందిని సిధారెడ్డి

వై. అశోక్ కుమార్

పప్పుల రాజిరెడ్డి

ఎన్.భగవాన్‌రెడ్డి

తోట అశోక్

విరాహత్ అలీ

దేశపతి శ్రీనివాస్



మంజీరా రచయితల సంఘం



మెతుకుసీమ చరిత్ర - సంస్కృతి

**Metuku Seema Charithra - Samskruthi**

*Published by*
Manjeera Rachayithala Sanghm

**Authours :** Nandini Sidhareddy, K.Anjaiah, T.Ashok, N.Bhagavan Reddy, Virahat Ali, Deshapathi Srinivas, Y.Ashok Kumar, Pappula Raji Reddy

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 2008

ముఖ చిత్రం : మెదక్ జిల్లా కొండాపూర్ పురావస్తు చిహ్నాలు

డిజైన్, బుక్‌మేకింగ్ : జుగాష్‌విలి

డి.టి.పి. : సౌమ్య గ్రాఫిక్స్

ముద్రణ : చరిత ఇంప్రెషన్స్, అజామాబాద్, హైదరాబాద్

ప్రతులకు :

**మంజీరా రచయితల సంఘం**

17-112, శ్రీనగర్ కాలనీ, సిద్దిపేట - 501 103.

**సహచర బుక్ హౌస్,** బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్.

**దిశ పుస్తక కేంద్రం,** చిక్కడపల్లి, హైదరాబాద్.

వెల : **50/-**

# ముందుమాట

'చరిత్ర అంటేనే తవ్వకం పని' అన్నారు రొమిల్లా థాపర్. ఎప్పటికప్పుడు చరిత్ర రికార్డు చేసుకొనే అవకాశం లేకపోవటం వల్ల గత చరిత్ర చాలా శిథిలమైపోయింది. మట్టి కుప్పల మధ్యనుంచి పురావస్తువుల రూపంలో పలకరిస్తుంది. దొరికినంతవరకు తవ్వవలసిందే. తవ్వుదాం. కానీ, ఇటీవలి మన కండ్ల ముందటి చరిత్ర సంగతి. చూసి, తెలిసి రికార్డు చేసుకునే అలవాటు లేకపోవటం వల్ల ఇదీ అడుగునబడుతున్నది. అంతరిస్తున్నది. మెతుకు సీమ చరిత్ర అందుబాటులో లేదు. పాతదీ, కొత్తదీ అందినంత, తెలిసినంత ఒక దగ్గర చేర్చే చిన్న ప్రయత్నమిది. ఇది సమగ్రంకాదని మాకెరుకే. సమగ్రత కోసం పడే ఆరాటంతో ఉన్నది కోల్పోతామేమోనని భయం.

అనుకున్నప్పటికీ వ్యాపారం, పత్రికలు, ఉద్యోగ, విద్యారంగాల చరిత్ర కనీసంగానైనా చేర్చలేకపోవటం లోపమే. దృష్టి, కృషి, సమయం, సహకారం కొన్ని అనుకూలించలేదు. లోపాల్ని వినయంగా అంగీకరిస్తూనే, మెదక్ చరిత్ర రచనలో ముందడుగుగా ఈ పుస్తకం మీ ముందుంచుతున్నాం.

ప్రచురణకు సహృదయ సహకారమందించిన మెదక్ జిల్లా కలెక్టర్ శ్రీ బి.వేంకటేశం, ఐ.ఏ.ఎస్. గారికి

జిల్లా నీటి యాజమాన్య సంస్థ ప్రాజెక్ట్ డైరెక్టర్ శ్రీ యం.జగన్నాథం గారికి

మెదక్ జిల్లా టిఎన్జీవో సంఘం అధ్యక్షుడు మా దేవీ ప్రసాద్‌కు

ఫోటోలనందించిన శివనంది నారాయణకు

ముద్రణ పనుల్లో సహకారమందించిన మిత్రులు పర్‌స్పెక్టివ్స్ ఆర్.కె.కు, జుగాష్‌విలికి, సౌమ్యగ్రాఫిక్స్‌కు, చరితకు,. వ్యాస రచయితలకు, ప్రోత్సహిస్తున్న మిత్రులకు, ఆదరిస్తున్న ప్రజలకు కృతజ్ఞతలు.

**మంజీరా రచయితల సంఘం**

విషయ సూచిక



# మెదక్ జిల్లా భౌగోళిక స్వరూపం - వనరులు

కె. అంజయ్య

ఉద్యమాలకు, కళలకు పుట్టినిల్లుగా భాసిస్తున్న మెదక్ జిల్లా రాష్ట్రంలోనే ప్రత్యేకతను సంతరించుకున్నది. నైసర్గికంగా రాష్ట్ర రాజధాని సమీపంలోనే ఉండటంతో వనరుల దోపిడీకి గురవుతున్నది. జిల్లాకు ప్రాణాధారంగా మారాల్సిన 'మంజీర' ఒక పార్శ్వానికే పరిమితమైంది. నైసర్గికంగా దక్కన్ పీఠభూమిలో ఉన్న మెదక్ జిల్లా $17^0$-28', $18^0$-19' ఉత్తర అక్షాంశం మీద $77^0$-28', $79^0$-10' తూర్పు రేఖాంశం మీద విస్తరించి ఉన్నది. దీనికి ఉత్తర దిశలో నిజామాబాద్, కరీంనగర్ జిల్లాలు, తూర్పు దిశలో నల్గొండ, వరంగల్ జిల్లాలు, దక్షిణాన హైదరాబాద్, రంగారెడ్డి, పడమర కర్నాటక రాష్ట్ర బీదర్ జిల్లాలున్నాయి. ప్రస్తుతం మెదక్‌గా వ్యవహరించే ఈ ప్రాంతాన్ని ఒకప్పుడు "మెతుకుసీమ"గా పిలిచేవారు. జిల్లా విస్తీర్ణం 9,699 చదరపు కిలోమీటర్లు. ఇది రాష్ట్ర వైశాల్యంలో 3.53 శాతం. జిల్లాలో వివిధ పర్వత శ్రేణులు చిన్నచిన్న కొండలతో నిండి ఉన్నాయి. ఒక వరుస ఉత్తరంగా రామాయంపేట నుంచి నిజామాబాద్ జిల్లా దక్షిణ ప్రాంతం వరకు విస్తరించి, మళ్లీ దక్షిణానికి తిరిగి మెదక్ జిల్లాలో ప్రవేశిస్తుంది. మరో పర్వత పంక్తి వాయువ్య దిశ నుంచి తూర్పు వైపుకు విస్తరించి ఉన్నది. మెదక్ జిల్లా ఈ పర్వత శ్రేణిలో గల ఒక పర్వతం పై భాగాన ఉన్నది. అన్ని మతాలకు, జాతులకు, భాషలకు, జాతీయతకు ప్రతీక అయిన మెదక్ జిల్లాలో బాలాఘాట్ పర్వత శ్రేణికి చెందిన గుట్టల వరుసలు, మరికొన్ని కొండల ప్రాంతం మినహా తక్కిన భూభాగమంతా పీఠభూమి వలె ఉంటుంది. జిల్లాలో ఇసుకతో కూడిన చెలక నేలలు, ఎర్ర నేలలు, నల్లరేగడి నేలలున్నాయి. జహీరాబాద్ ప్రాంతం ఎర్రమట్టికి ప్రసిద్ధి. నర్సాపూర్ ప్రాంతంలో అధికంగా నల్ల

రేగడి నేలలున్నాయి. సిద్దిపేట ప్రాంతం వాణిజ్య పంటలు, వర్తక రంగం ప్రాధాన్యత సంతరించుకున్నాయి. జిల్లా భౌగోళిక విస్తీర్ణం 9,69,000 హెక్టార్లు, అటవీ విస్తీర్ణం 96,000 హెక్టార్లు, సాగులో ఉన్న, బీడు భూముల విస్తీర్ణం 5,05,257 హెక్టార్లు, సాగుకు పనికిరాని భూముల విస్తీర్ణం 20,168 హెక్టార్లు. జిల్లాలో 55 శాతం దుబ్బ భూములు, 44 శాతం నల్లరేగడి నేలలు, ఒక శాతం ఎర్ర చెల్క నేలలున్నాయి. పరిసరాలలో ఉన్న కరీంనగర్, వరంగల్, నిజామాబాద్, నల్లగొండ, బీదర్ జిల్లాల ప్రభావం సరిహద్దు ప్రాంతాల ప్రజలలో కనిపిస్తుంది. ప్రజానీకంలో అధిక శాతం పేద, మధ్యతరగతికి చెందినవారున్నారు.

విభిన్న సంస్కృతులు, నాగరికతలకు నిలయమైన మెదక్ జిల్లాను శాతవాహనులు, బాదామి చాళుక్యులు, కళ్యాణి చాళుక్యులు, రాష్ట్ర కూటులు, కాకతీయులు, బహుమనీలు, కుతుబ్ షాహీలు, అసఫ్ జాహి వంశస్తులు వేర్వేరు కాలాలలో జిల్లాలోని వివిధ భాగాలను పరిపాలించారు. ఆ తర్వాత అల్లాఉద్దీన్ ఖిల్జీ నాయకుడు మాలిక్ కాఫర్ 1309లో దక్షిణ దండయాత్ర విజయ పరంపరలో భాగంగా మెదక్ ఖిల్లాను స్వాధీనపరుచుకున్నాడు. తర్వాత కాలంలో ఈ జిల్లా బహుమనీ రాజ్యంలో భాగంగా ఉన్నది. గోల్కొండ కుతుబ్‌షాహీల ఆధీనంలోకి వెళ్ళిన తర్వాత మెదక్‌ను గుల్షనాబాద్ అని పేరుపెట్టారు. నిజాం రాజు దాన్ని మెదక్‌గా మార్చారు.

**జిల్లా అవతరణ**

ప్రస్తుత మెదక్ జిల్లా ఆకృతి వెనుక ఎన్నో మలుపులు మనకు కనిపిస్తాయి. 1901లో జిల్లాలో రామాయంపేట, మెదక్, భగత్, కల్పగూరు, ఆందోల్, టేక్మాల్ తాలూకాలుండేవి. 1905లో టేక్మాల్‌ను ఆందోలు తాలూకాలో చేర్చారు. రామాయం పేట తాలూకాలోని కొంత భాగం మెదక్ తాలూకాలో, మరికొంత నిజామాబాద్ జిల్లాలోని కామారెడ్డి తాలూకాలో చేర్చారు. మహబూబ్‌నగర్ జిల్లా నుంచి ఇబ్రహీంపట్నాన్ని, కరీంనగర్ జిల్లా నుంచి సిద్దిపేట తాలూకాను మెదక్ జిల్లాలోకి మార్చారు. ఇబ్రహీంపట్నం తాలూకాను భగత్ తాలూకాలో విలీనం చేశారు. ఫలితంగా 1905లో ఈ జిల్లాలో మెదక్, సిద్దిపేట, కల్పగూరు, ఆందోల్ తాలూకాలుండేవి. 1920లో హత్నూర, దౌల్తాబాద్ జాగీర్లు కలిసి వికారాబాద్ తాలూకా ఏర్పాటైంది. 1931 సంవత్సరంలో భగత్ ప్రత్యేక జిల్లా ఏర్పాటైంది. 1941-50 మధ్య భగత్, మరోరెండు జిల్లాలు రద్దయి నర్సాపూర్, గజ్వేల్ తాలూకాలేర్పడ్డాయి. 1950లో రద్దయిన జాగీర్దారీ వ్యవస్థ దీనికి మూలకారణం.

1954లో వరంగల్ జిల్లా జనగామ తాలూకాకు చెందిన తీగుల్ నర్సాపూర్‌ను గజ్వేల్ తాలూకాలో చేర్చారు. 1956లో భాషా ప్రయుక్త రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ



సందర్భంగా బీదర్ జిల్లాలోని ఒకటి, రెండు ఫిర్కాలు తప్ప మిగిలిన నారాయణఖేడ్, జహీరాబాద్ తాలూకాలు ఈ జిల్లాలో చేరాయి. ఈ జిల్లాలోని వికారాబాద్ తాలూకాను హైద్రాబాద్ జిల్లాకు, సవర్‌గాంవ్ అనే గ్రామాన్ని నారాయణఖేడ్ తాలూకా నుంచి నిజామాబాద్ జిల్లాకు మార్చారు. 1958 సంవత్సరంలో సంగారెడ్డి తాలూకాలోని 11 గ్రామాలు, హైద్రాబాద్ జిల్లాలోని చేవెళ్ళ తాలూకాలోకి చేర్చారు. 1980 సంవత్సరంలో జిల్లాలో జరిగిన మార్పుల ఫలితంగా సదాశివపేట, రామాయంపేట, దుబ్బాక తాలూకాలేర్పడ్డాయి. మొత్తం పదకొండు తాలూకాలు ఏర్పాటైనాయి. 1987లో తెలుగు దేశం ప్రభుత్వం తాలూకాలను రద్దు చేసి 45 మండలాలను ఏర్పాటు చేసింది. 2003లో కొత్తగా తొగుట మండలం ఏర్పాటు జరిగింది. దాంతో ప్రస్తుతం జిల్లాలో 46 మండలాల వ్యవస్థ రూపుదిద్దుకున్నది. తాలూకాలున్నపుడు తాలూకాకొకటి చొప్పున జిల్లాలో 11 పంచాయితీ సమితిలుండేవి. మండల వ్యవస్థలో భాగంగా ప్రతి మండలంలో మండల రెవిన్యూ, మండల పరిషత్‌లు ఏర్పాటైనాయి.

ప్రస్తుతం జిల్లాలో మూడు రెవిన్యూ డివిజన్లు, 46 మండలాలు, పది పట్టణాలు, 1265 రెవెన్యూ గ్రామాలున్నాయి. సంగారెడ్డి, సిద్దిపేట, సదాశివపేట, మెదక్, జహీరాబాద్ మున్సిపాలిటీలున్నాయి. పటంచెరు, రామచంద్రాపూర్‌లకు మున్సిపాలిటీలుగా గుర్తించినా గ్రేటర్ హైద్రాబాద్‌లో చేర్చడంతో వాటికా గుర్తింపు కరువైంది. జిల్లాలో 40 మేజర్ గ్రామ పంచాయితీలు, 1059 గ్రామ పంచాయతీ లున్నాయి. మెదక్, సిద్దిపేట లోక్‌సభ నియోజకవర్గాలుగా, సంగారెడ్డి, సిద్దిపేట, మెదక్, గజ్వేల్, దొమ్మాట, రామాయంపేట, ఆందోల్, జహీరాబాద్, నారాయణఖేడ్, నర్సాపూర్ శాసనసభ నియోజక వర్గాలున్నాయి. 2001 జనాభా గణన ప్రకారం జిల్లా జనాభా 26,70,097 ఉన్నది. గ్రామీణ జనాభా 22,86,573, పట్టణ జనాభా 3,83,524 ఉన్నది. పురుషులు 13,17,651, స్త్రీలు 13,52,446.

మంజీరానది, హల్దీ, కుడ్లేరు, పెద్దవాగు మొదలైన యేరులు జిల్లాలో ప్రవహిస్తున్నాయి. హల్దీ వాగునే పసుపులేరుగా వ్యవహరిస్తారు. ఘనపురం ఆనకట్ట, నల్లవాగు జలాశయం, రాయినపల్లి ప్రాజెక్టు, గంగకత్వ ప్రాజెక్టు, పెద్దవాగు ప్రాజెక్టు, నారింజ బ్యారేజి, మొగిలిపేట వాగు ప్రాజెక్టు మొదలైనవి సాగునీటి ప్రాజెక్టులు. సింగూరు జలాశయం రాష్ట్ర రాజధాని వాసుల తాగునీటి కోసం, జిల్లాలోని కొన్ని ప్రాంతాల దాహార్తి తీర్చేందుకు వినియోగిస్తున్నారు. నీటి పారుదల శాఖ కింద వంద ఎకరాలకుపైగా ఆయకట్టు గల చెరువులు 565, చిన్న నీటి వనరులు 6207 ఉన్నాయి.

జిల్లాలో క్వార్ట్జ్, తెల్లబంకమన్ను విస్తారంగా లభిస్తుంది. ఇవి గాజు పరిశ్రమకు ఉపయోగపడ్తాయి. జిల్లాలో ప్రధాన పంటలు వరి, మొక్కజొన్న, జొన్న, చెరుకు, ప్రత్తి, మిర్చి మొదలైనవి. జిల్లాలో 26 శాతం భూమి సాగవుతోంది.



# చీకటి నీడల నడుమ మెదక్ జిల్లా చరిత్ర

డా. నందిని సిధారెడ్డి

ప్రతి ప్రాంతానికి ఒక చరిత్ర ఉంటుంది. అది కాలగతిలో అనేక మార్పులకు లోనవుతూ నిర్మాణమవుతుంది. చరిత్ర అధ్యయనం అవసరం లేదనే ఏలికల వల్ల, పరిశోధనకు ప్రోత్సాహం లభించకపోవటం వల్ల, ఉపాధి వేటలోనే ఉన్న ఆసక్తులన్ని ఇగిరిపోతున్న స్థితిగతుల వల్ల చాలాసార్లు ఉన్న చరిత్ర కూడా మరుగునపడి విస్మరింప బడుతున్నది. అయినప్పటికీ దాని ప్రాధాన్యతాసందర్భాల దృష్ట్యా మళ్లా మళ్లా సేకరించు కుంటూ రూపురేఖలు అల్లుకుంటూ సాగిపోతుంది.

చరిత్ర పుటల్లో ఎంతో ప్రాధాన్యత సంతరించుకోవాల్సిన మెదక్ జిల్లా చరిత్ర చీకటి నీడలు పడి కానరాకుండా అయింది. సాక్షాత్తు జిల్లా ప్రధానాధికారి ఒకరు ప్రత్యేకాసక్తితో పరిశీలించినా తునకలు తునకలుగా తప్ప వివరాలు దొరకక పోవడం విషాదమే. లభిస్తున్న కొద్ది ఆధారాలనైనా ఒకచోట కూర్చితే ఒక ఆకృతి ఏర్పడవచ్చు.

కన్నడ, మరాఠీ ఇతర భాషల ప్రాంతాలు సరిహద్దులుగా ఉండడం వల్ల జిల్లా ప్రజల సంస్కృతి ఎంతో వైవిధ్యంతో కూడి ఉన్నది.

గోదావరి ఉపనది అయిన మంజీర అధికభాగం ఈ జిల్లాలో ప్రవహిస్తుంది. కర్నాటకలోని బీదర్ జిల్లా వటొడి తాలూకా బాలాఘాట్ కొండల్లో పుట్టి మహారాష్ట్రలోని ఉస్మానాబాద్ జిల్లా మీదుగా మనూరు మండలం ద్వారా మెదక్ జిల్లాలోకి ప్రవేశిస్తుంది. జిల్లా వ్యాప్తంగా 96 కి.మీ. పొడవుతో ప్రవహించే మంజీరానది నిజామాబాద్‌జిల్లా బోధన్ సమీపంలో గోదావరిలో కలుస్తుంది. మంజీరానది ఉపనది అయిన 'పసుపులేరు', మానేరు ఉపనది అయిన 'కడలేరు' (కూడేరు) జిల్లాలోనే పుట్టి ప్రవహిస్తాయి.



ప్రాచీన కాలం నుండి ఇక్కడ ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయం. అనేక శతాబ్దాలుగా వరి పుష్కలంగా పండించటం వల్ల ఈ ప్రాంతం 'మెతుకు సీమ'గా వ్యవహరించబడుతూ వచ్చింది. ఈ జిల్లా 'మంజీరకాదేశం', 'కాసలనాడు', 'సదాపూర్ వేదక్', (ఈ వేదక్ అనే మాట క్రమంగా 'మెదక్' అయిందని వివరిస్తారు), రాచవీడు, 'గుల్షనాబాద్' మొదలైన పేర్లతో ఆయాకాలాల్లో వ్యవహరించబడింది.

బౌద్ధవాఙ్మయంలో 'మంజీరకా దేశమ'నే వ్యవహారముండగా, తెలుగుకావ్యాల్లో 'కాసలనాడు'గా పిలవబడింది. 'కాసలనాటి స్త్రీ' వర్ణన ఉన్నది. పొన్నగంటి తెలగన తన కావ్యంలో పొట్ల చెరువు 'కాసలనాటి'లోనిదని పేర్కొన్నాడు.

శాతవాహనులు, రాష్ట్రకూటులు, విష్ణుకుండినులు, దేవగిరి యాదవులు, కాకతీయులు, గోనెరాజులు, గోల్కొండ నవాబులు, ఆసఫ్ జాహీలైన నిజాంనవాబులు ఈ జిల్లాను పరిపాలించినారు. మెదక్ దుర్గం, అల్లాదుర్గం స్థానిక చరిత్రలో ముఖ్యమైనవి. పాపన్నపేట, పొట్ల చెరువు, అందోలు, టేకుమాలు, గజ్వేలు, దొంతి, దుబ్బాక మున్నగునవి ప్రసిద్ధికెక్కిన సంస్థానాలు. అల్లాదుర్గం, నందికంది, టేక్‌మాల్, తెల్లాపూర్, దుద్దెడ, కొండపాక, డాకూర్, కోహీర్, కొండాపూర్, ముదిమాణిక్యం తదితర గ్రామాల్లో తెలుగు, కన్నడ, సంస్కృత భాషల్లో ఉన్న క్రీ.శ 9-14 శతాబ్దాల నాటి శాసనాలు ఉన్నాయి.

మంజీరానది పరీవాహక ప్రాంతం కావటం వల్ల మెదక్ జిల్లాకు విశేషమైన ప్రాచీన చరిత్ర ఉన్నది. పూనాకు చెందిన ఆర్.వి.జోషి అనే పురాతత్వ పరిశోధకుని నిర్వహణలో అనేక పరిశోధనలు జరిగినాయి. ఈ పరిశోధనల్లో పాతరాతియుగపు తొలి, మధ్య చివరి దశల్లో వాడిన రాతి గొడ్డళ్లు, ఇతర పనిముట్లు దొరికినట్లు చరిత్ర పరిశోధకులు శివనాగిరెడ్డి, బ్రహ్మచారిలు వివరించారు. సంగారెడ్డి సమీపంలోని ఎడితానూరు వద్ద గంగిగోవుల బండ, చౌడమ్మగుట్ట, సిద్దులగుట్ట, గద్దగుండు మొ॥ కొండ చరియల్లో శిలాయుగపు చిత్రకళ బయల్పడింది. ఈ పరిశోధనలలో మధ్యరాతి యుగపు పనిముట్లతోపాటు చేతితో చేసిన మట్టిపాత్రల అవశేషాలు కూడా లభించాయి. అక్కడున్న శిలాయుగపు చిత్రాల్లోని ఒక ఏనుగు, కొంతమంది వేటాడుతున్న దృశ్యం మధ్యరాతి యుగపు ప్రజల జీవన విధానాన్ని తెలియజేస్తుంది.

ప్రజ్ఞాపూర్ సమీపంలోని రిమ్మనగూడ వద్ద టెలిఫోన్ శాఖ తవ్వకాల్లో తామ్ర శిలాయుగపు రాగికత్తులు నాలుగు దొరికాయి. ఇవి క్రీ.పూ. 1750-1500 సం॥ల మధ్య కాలానికి చెందినవిగా నిర్ధారించారు. కొండాపూర్ శాతవాహనులు పరిపాలించిన చారిత్రక స్థలాల్లో కరీంనగర్ జిల్లా తర్వాత మెదక్‌జిల్లా పేర్కొన దగినది. చారిత్రకంగా

'కొండాపూర్' చాలా ప్రాధాన్యత ఉన్న ప్రాంతం. శాతవాహన రాజైన గుణాఢ్యుడు కొండాపూర్ రాజధానిగా పరిపాలించడమే గాక తాను స్వయంగా 'బృహత్కథ' రచించినదీ ప్రాంతమే. రుక్మిణి జన్మించిన 'కుందినీ నగరం' కొండాపూరేనని ప్రతీతి వున్నది. దీన్ని "దక్షిణ తక్షశిల"గా పిలుస్తారు. క్రీ.పూ. 78 సం॥రం నుండి ఈ ప్రాంతాన్ని శాతవాహనులు పాలించినట్లు ఇక్కడ దొరికిన సాక్ష్యాధారాలు తెలుపు తున్నాయి. క్రీ.శ. 2వ శతాబ్దిలో కొండాపూర్ మహానగరంగా రాజిల్లినట్లు చరిత్రకారులు భావిస్తున్నారు. శాతవాహన రాజుల 'టంకశాల' నగరమిది. వీరి కాలంలో వ్యవసాయం, వర్తకం అభివృద్ధి చెందింది. శిల్పకళకు ప్రోత్సాహం దొరికింది. విస్తరిల్లిన బౌద్ధ సంస్కృతి వివిధ తెగల మధ్య విభేదాలను తొలగించేందుకు ప్రయత్నించింది. జానపద, నాగరక కళలు వికసించినట్లు ఆధారాలున్నాయి.

కొండాపూర్ స్థల ప్రాధాన్యతను 1900 సం॥లో హెన్రీ కౌజన్స్ అనే పాశ్చాత్య పురావస్తు శాస్త్రవేత్త గుర్తించాడు. 1942లో ఖ్వాజా మహమ్మద్ అనే పురాతత్వ నిపుణుని ఆధ్వర్యంలో తవ్వకాలు జరిగాయి. కొత్త రాతియుగం మానవుడు ఉపయోగించిన రాతి పనిముట్లు లభ్యం కావడం వల్ల ఈ ప్రాంతం అనాది మానవునికి ఆవాస యోగ్యమైనట్లు తెలుస్తున్నది. ఇక్కడి జనజీవితం 5000-3000 సంవత్సరాల పూర్వం నాటిదని గుర్తిస్తున్నారు. ఆధునిక జీవితంలో నగర జీవనానికి అవసరమైన అన్ని సదుపాయాలు కొండాపూర్ శిధిలాల్లో దొరికినాయి. ఇక్కడ దొరికిన క్రీ.పూ. 37 - క్రీ. శ. 14 నాటి రోమ్ రాజు ఆగస్టీన్ కాలం నాటి బంగారు, వెండి నాణాలను బట్టి ఇది గొప్ప వర్తక కేంద్రంగా ఉండేదని భావిస్తున్నారు. తవ్వకాల్లో లోహపు వస్తువులు, మట్టి వస్తువులు, ఆభరణాలు, గృహోపకరణాలు, నాణాలు ఆనాటి చరిత్రకు సాక్ష్యాలు ఎన్నో లభించాయి. శాతవాహన కాలం నాటి ప్రజలు నివసించిన గృహసముదాయాలు, రాజకుటుంబీకుల అంతఃపుర ప్రాంగణాల అవశేషాలు, విభిన్న వస్తుసముదాయాలు వెలుగులోకి వచ్చాయి. రాజులు ముద్రించిన రాగినాణాలు, వాడిన కవచాలు, దంతపు వస్తువులు, గాజు, మట్టిపాత్రలు లభించాయి. పూసల తయారీకి పేరుగాంచిన ప్రదేశమని ఇక్కడ లభించిన పూసల ద్వారా తెలుస్తుంది. కొండాపూర్ సమీపంలోని బూరుగుపల్లి కూడా శాతవాహనుల కాలం నాటి పల్లెగా భావించవచ్చు.

జహీరాబాద్ పరిసరాల్లో దొరికిన పురావస్తు ఆధారాలు ఈ ప్రాంతం శాతవాహనుల కాలంలో ప్రాముఖ్యత వహించినట్లు నిరూపిస్తున్నాయి. ఇక్కడ దొరికిన నాణాలు రాగితో తయారయినవి. ఒకవైపు చైత్యము, మూడు ఆర్చీలు. ఒక చంద్రవంక ఇంకో వైపు 'సరిస' అనే బ్రహ్మీ అక్షరాలు ఉన్నాయి. క్రీ.శ. 7, 8 శతాబ్దాల్లో జైన, బౌద్ధమత ప్రభావాలు విరాజిల్లినట్లు తెలిపే ఎన్నో చారిత్రకాధారాలు పొట్ల చెరువు, కంది, సంగారెడ్డి ప్రాంతాల్లో లభిస్తున్నాయి. జోగిపేట బౌద్ధుల, జైనుల పవిత్ర క్షేత్రంగా ఉండేదని భావిస్తున్నారు. కోలాచలంలో లభించిన జైన పార్శ్వనాథ విగ్రహం నాటి జైనమత వికాసానికి దర్పణం పడుతున్నది.

కంది గ్రామంలోజరిపిన తవ్వకాల్లో క్రీ.శ. 273 శతాబ్ది నాటి శివాలయం ఒకటి వెలుగు చూసింది. బౌద్ధజైన మతాసక్తులను దాటి శైవమతం వ్యాప్తి చెందిన స్థితిని ఇది చాటుతున్నది. ఇక్కడ దొరికిన మట్టి బొమ్మల్లో తల్లిబిడ్డల బొమ్మ, ఒక స్త్రీబొమ్మ, గుర్రం, మూపురం ఉన్న ఎద్దులు ఆకాలపు ప్రజల జీవనాన్ని తెలుపుతున్నాయి. శాతవాహనుల తర్వాత కొంతకాలం ఈ ప్రాంతం విష్ణుకుండినుల ఏలుబడిలో ఉన్నట్లు కంది తవ్వకాలు తెలియ జేస్తున్నాయి. కీసరగుట్ట రాజధానిగా విష్ణుకుండినులు పాలించిన రాజ్యంలో మెదక్ ప్రధాన భాగంగా ఉండింది. తర్వాత పశ్చిమ చాళుక్యులు, ఆ తర్వాత రాష్ట్రకూటులు పాలించినట్లు అల్లాదుర్గం పటాంచెర్వు మొదలైన చోట్ల ఉన్న శిల్పాలు, మల్లికార్జునపల్లిలోని శాసనం ధృవీకరిస్తున్నాయి. కళ్యాణి చాళుక్యరాజైన త్రిభువన మల్లదేవర వేయించిన శాసనమొకటి కన్నడ భాషలో ఉన్నది. ఇతనికి ఆరవ విక్రమాదిత్యుడని పేరు ఉంది. ఇతని సామంతరాజైన పరమనంది రాజు ఒక జైన ఆలయాన్ని నడపటానికి కొంత భూమిని దానం చేసినట్లు శాసనంలో ఉంది. ఈ శాసనం 10-11 కాలం నాటిది.

### మెదక్ దుర్గం

కాకతీయుల కాలంలో మెదక్ కాసలనాడుగా వెలుగొందింది. మెదక్ దుర్గం కింద పాలిత ప్రాంతం సువిశాలంగా ఉండేది. అనేక సంస్థానాలు ఇందులో భాగంగా ఉండేవి. నిజామాబాద్ జిల్లా బిక్కనవోలు సంస్థానం నల్లగొండ జిల్లా రాచకొండ సంస్థానం దాకా మెదక్ దుర్గం అధీనంలో ఉండేది. కాకతీయచక్రవర్తులు నిర్మించిన సామ్రాజ్యాలలో ఇది భాగం. మెదక్ పట్టణానికి పశ్చిమాన మూడువందల అడుగుల ఎత్తున కోటను నిర్మించారు. పైన "ముబారక్ మహల్" అనే రాజమందిరం ఉన్నది. సింహద్వారంపై రెండు శిరసులు గల గద్ద రెండు ఏనుగులను నోట కరిచినట్లు చెక్కిన చిహ్నం ఒకటి ఉంది. రెండు శిరసుల గద్ద కాకతీయుల రాజ్యచిహ్నం అయినందువల్ల ఈ కోట కాకతీయులే నిర్మించారని భావించుటకు వీలు కలుగుతున్నది. కాకతీయ రాజ్యపతనానంతరం దాని ప్రాభవం తగ్గుతూ వచ్చింది.

క్రీ.శ. 1309 అల్లావుద్దీన్ ఖిల్జీ సేనా నాయకుడు మాలిక్ కాఫిర్ దక్షిణాపథంపై దండయాత్ర చేసి మెదక్ కోటను స్వాధీనం చేసుకొన్నాడు. అప్పుడది సదాపూర్‌వేదక్.

తర్వాత అది కుతుబ్ షాహీల వశమైంది. వారు ఈ దుర్గాన్ని పునర్నిర్మించి ఈ ప్రాంతాన్ని 'గుల్షానా బాద్'గా వ్యవహరించారు.

**అల్లమదుర్గం**

అప్పటికి ప్రఖ్యాతమైన మరొక దుర్గం అల్లమ దుర్గం. సంస్థానాధీశుడైన అల్లమరెడ్డి పేరు మీద అది వెలిసింది. వీరశైవ మతస్థాపకుడైన బసవేశ్వరుడికి ఇతను సమకాలికు డని చెబుతారు. ఈయన జోగినాథేశ్వరుని పేరు మీద జోగిపేటను తీర్చిదిద్దాడని భావిస్తారు. ఇబ్రహీమ్ కుతుబ్ షాహి రాజ్యంలోని సంస్థానాల్లో అల్లమ దుర్గం ముఖ్యమైనది.

**అందోలు**

13వ శతాబ్దం నుండి రెడ్డిరాజుల పాలనలో చిన్న చిన్న సంస్థానాలు అనేకం ఏర్పడినాయి. గోనరాజుల మూలపురుషుడు రామినేయుడు. ఇతను క్రీ.శ. 1485 కల్పగూరు రాజధానిగా ఈ ప్రాంతం పరిపాలించాడు. వ్యవసాయ భూముల కోసం అన్వేషణ చేస్తున్నప్పుడు మంజీర తీరాన గల 'లంద'లు గల ప్రాంతాన్ని చర్మకార వృత్తి చేసుకుంటున్న వారి దగ్గర్నుంచి ప్రతిఫలం చెల్లించి గ్రహించి అక్కడ ఒక తటాకాన్ని, కోటను నిర్మించినట్లు భావిస్తారు. 'లందవోలు'-'అందవోలు' - 'అందోలు' అయిందని భావిస్తారు. అందోలు కోటకు చుట్టుపక్కల 36 బురుజులు, 8000 అడుగుల పొడవు ప్రహరీగోడలు కట్టించాడు. గ్రామ మధ్య భాగాన సుందరమైన రాజ భవనం 'సిద్ధిమహల్' ఉంది. పై భాగాన సేనా నాయకుని భవనం ఉంది. 'అందోలు' రాజ్యం కరీంనగర్, వరంగల్ సరిహద్దుల వరకు విస్తరించి ఉండేది.

ఈయన తర్వాత రాజు 'ముసలారెడ్డి'. రాజధానిని 'కల్పగూరు' నుంచి అందోలుకు మార్చాడు. తర్వాత పాలించిన రాజానరసింహారెడ్డి దాదాపు క్రీ.శ. 1610 సం॥రంలో పాలనాకేంద్రం సంస్థానం మధ్యలో ఉండాలన్న ఉద్దేశ్యంతో రాజధానిని 'రాచవీడు' (మెదక్)కు మార్చాడు. రాచవీడు పాలనాకేంద్రంగా.నూ, అందోలు సైనిక కేంద్రంగానూ కొనసాగింది. నార్సింహారెడ్డి పట్టమహిషి అయిన 'లింగాంబ' పేరు మీద 1680-1692 మధ్య కాలంలో లింగమ్మపల్లె (లింగంపల్లి) నిర్మించటం జరిగింది. లింగమ్మ, నార్సింహారెడ్డిల దత్తపుత్రుడైన కృష్ణారెడ్డి తన పట్టమహిషి రామాయమ్మ పేరుతో 1700-1705ల మధ్య రామాయమ్మపేట నిర్మించాడు. రామాయమ్మ లింగారెడ్డిని దత్తు తీసుకొన్నది. లింగారెడ్డి శివాయమ్మ పుత్రుడైన వెంకట నార్సింహారెడ్డి పాపన్నపేట సంస్థానాన్ని నిర్మించి అది కేంద్రంగా పరిపాలన సాగించాడు. నర్సింహారెడ్డి కాపు



యువతి అయిన 'శంకరమ్మ'ను ప్రేమించి పరిణయం చేసుకొన్నాడు. శంకరమ్మ వ్యవసాయ కుటుంబీకురాలు గనక ధీరురాలు. స్వయంగా రాజ్యపాలన చేసింది. నిజాం కాలంలో తరచుగా ఆ రాజ్యం మీదికి దండెత్తి వస్తూ పీడిస్తున్న పీష్వాలను ఓడించి నిజాంను మెప్పించిన వీరవనిత. ప్రతిఫలంగా నిజాం నుండి కానుకలు పొందటంతో పాటు 'రాయ్ బాగిన్' అనే బిరుదు పొందింది. కప్పం విషయంలో నిజాంనే ఎదిరించిన సాహసికురాలు శంకరమ్మ అనే కథనం ఉంది. ఆమె తన పేరు మీద శంకరంపేట నిర్మించింది. శంకరమ్మ బిక్కనవోలు నుండి సదాశివ రెడ్డిని దత్తత తీసుకున్నది. సదాశివరెడ్డి తన పేరిట సదాశివపేట, సోదరుని పేరిట 'సంగారెడ్డి' నిర్మించాడు. సదాశివరెడ్డి మీద ఆయన ప్రదర్శించిన ధైర్యసాహసాల మీద జానపదులు పాడుకునే వీరగాథ ప్రచారంలో వుంది.

కాకతీయ రాజులది అచ్చమైన తెలుగు సంస్కృతి, కర్ణాటకులది వీరశైవం. కాకతీయులది ఆరాధ్య శైవం. గోలకొండ రాజులది దక్కనీ సంస్కృతి. చాలా చోట్ల దర్గాలు నిర్మించారు. ఇవి రెండూ కలిసిపోయిన స్థితి సాహిత్యంలో, సంస్కృతిలో గోచరిస్తుంది. పొన్నగంటి తెలగన, వెన్నెలకంటె సూరన రచనల్లో, వాడిన భాషలో, వర్ణనల్లో ఇది పరిశీలించవచ్చు.

17వ శతాబ్దిలో మొదట ఫ్రెంచి వారు - తర్వాత ఆంగ్లేయులు ఈ ప్రాంతం మీద దండయాత్రలు చేశారు. ఆసఫ్‌జాహీల రాజ్యం స్థిరపడిన తర్వాత దాడులు అంతరించి నిజాం రాజ్యంలో భాగంగా సంస్థానాధీశుల పరిపాలన కొనసాగింది. నిజాం కాలంలో ప్రజల జీవనావసరాల మేరకు మహబూబ్‌నగర్, ఘనపూర్ ఆనకట్ట, నిజాంసాగర్ నిర్మాణం జరిగింది. పాలనాసౌలభ్యం కోసం రాజ్యభాగాన్ని సుభాలుగా విభజించారు. దక్షిణ తెలంగాణ జిల్లాలు 'మెదక్ సుభా' కింద పరిగణించారు. అయినప్పటికి నిజాం రాజ్యంలో ప్రజల సంస్కృతులు, హక్కులు హరించబడినాయి. ప్రజలకు కలిగిన అసౌకర్యాల వల్ల, ఇబ్బందుల వల్ల ప్రజా ఉద్యమాలు పెల్లుబికినాయి. ఆర్యసమాజం అల్లుకున్నది. స్థానిక ప్రజల హక్కుల కోసం ఆవిర్భవించి ఏడవ నిజాంను గడగడలాడించిన ఆంధ్ర మహాసభ తొలి సమావేశం 1930లో మెదక్ జిల్లా జోగిపేటలోనే జరిగింది. సామ్రాజ్యాల నుంచి, సంస్థానాల నుంచి ప్రజలు స్వతంత్ర భావనల వైపు నడిచారు.



# మెదక్ జిల్లా వ్యవసాయక రంగం

వై. అశోక్ కుమార్

మెదక్ జిల్లా 969.9 చ.కి.మీ. విస్తీర్ణం కలిగి సముద్రమట్టము నుండి సుమారు 450 మీ. నుండి 600 మీ. ఎత్తున కలదు. జిల్లాలో సాగుకు యోగ్యమైన భూమి సుమారు 4,47,490 హెక్టార్లలో వ్యవసాయ సాగు భూమి 3,95,604 హె. మాత్రమే. సాగుకు యోగ్యమై, వినియోగంలో లేక వృధాగా వున్న భూమి 51,886 హె. "భవనములు – నీటిపారుదల' శాఖ లెక్కల ప్రకారము జిల్లాలో 552 చెరువుల కింద 1,22,861.22 ఎకరాల భూమి కలదు.

జిల్లాలో మంజీరానది, పెద్దవాగు, నారింజవాగు, నందివాగు, దబ్బవాగు, గంగకత్వ వాగు, నల్లవాగు, హల్దీవాగు, నక్కవాగు, కూడవెల్లివాగు, గుండువాగు మొదలగు వాగులు వంకలు ప్రవహిస్తుండగా మంజీరానదిపై సింగూరు, మంజీరా, ఘణపురం ఆనకట్టలు, హల్దీవాగుపై హల్దీ ప్రాజెక్టు, నల్లవాగుపై ప్రాజెక్టు మరియు నారింజవాగు ప్రాజెక్టులను ప్రభుత్వం నిర్మించింది.

మంజీరాపై నిర్మించిన మంజీరా, సింగూరు ప్రాజెక్టులు హైద్రాబాద్ నగర వాసుల దాహార్తికే పరిమితమైనాయి. నీరు హైద్రాబాద్ వాసులకు, కన్నీరు జిల్లా వాసులకు అన్నట్లుగా ఈ డ్యాం క్రింద 57 గ్రామాలు పూర్తిగా, 37 గ్రామాలు పాక్షికంగా ముంపుకు గురైనాయి. దీనివలన 11,633 కుటుంబాలు వీధుల పాలైనాయి. ఇప్పటికి నష్టపరిహారం కోసం కోర్టుల చుట్టూ తిరుగుతున్నవారే అధికం. మంజీరా, సింగూర్, నిజాంసాగర్ వల్ల అందోల్ తాలూకాలోని వ్యవసాయ భూములే ఎక్కువ మొత్తంలో ముంపుకు గురైనాయి. ఈ ప్రాజెక్టుల వల్ల సుమారు ఒక లక్ష ఎకరాల భూమిని కోల్పోయారు. ఆ ప్రాంత ప్రజల ఆందోళనల వలన 40వేల ఎకరాలకు సాగునీరు అందిస్తామన్న హామీ నీటిమూటే అయ్యింది. ఈ ప్రాజెక్టుల ద్వారా అదనపు సాగునీరు లభించక పోగా ఘణపూర్, నిజాంసాగర్ ఆయకట్టుకు ఒక పంటకు నీరు లభించని పరిస్థితి ఏర్పడింది. సింగూరు, మంజీరా డ్యాంల ద్వారా హైద్రాబాద్ వాసులకు తాగునీరును అందించడం నదీజలాల పరివాహక ప్రాంత ప్రజల హక్కుల ఉల్లంఘనే. గోదావరికి మంజీరా ఉపనది కావడం ద్వారా జిల్లా గోదావరినది పరివాహక ప్రాంతములోనికి వస్తుంది. ఈ నీటిని వాడుకునే హక్కు జిల్లావాసులకు మాత్రమే కలదు. రాష్ట్ర ప్రభుత్వం స్థానికప్రజల హక్కులను కాలరాచి కృష్ణానది పరివాహక ప్రాంతమైన హైద్రాబాద్‌కు తరలించి జిల్లాకు తీవ్రమైన ద్రోహం చేసింది. ఘణపురం, నిజాంసాగర్ ఆనకట్టలు పూడిక మట్టితో నిండి నీటి నిల్వ సామర్థ్యం పూర్తిగా తగ్గిపోవడం వల్ల మొదటి పంటకే రాష్ట్ర ప్రభుత్వ దయాదాక్షిణ్యాలపై ఆధారపడవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి.

సింగూర్ వద్ద నిర్మించిన ప్రాజెక్టును మొదట దేవునూర్ వద్ద నిర్మించ తలపెట్టినారు. దేవునూర్ వద్ద నిర్మించి వుంటే జిల్లాలోనే అతి తక్కువ వర్షపాత ప్రాంతమైన నారాయణఖేడ్ ప్రాంతానికి సాగునీరు లభించేది. ఈ ప్రాంత ప్రజలు వ్యవసాయ పనులు జరగకపోవడం వలన కూలీలుగా హైద్రాబాద్, బీదర్ పట్టణాలకు వలసపోతున్నారు. నారాయణఖేడ్ – హైద్రాబాద్ బస్సుల్లో నిత్యం అగుపించే దృశ్యం "వలస కూలీలు ముల్లే మూట చంకన పెట్టుకున్న బ్రతుకు చిత్రమే".

**ఘణపూర్ ఆనకట్ట :** 1905లో అప్పటి నిజాం నవాబు చేత నిర్మింపబడ్డది. కొల్చారం, మెదక్, పాపన్నపేట మండలాలలోని 18,000 ఎకరాలకు నీరు అందించబడినది. మంజీరాపై సింగూర్ ఆనకట్ట పూర్తికాగానే కుడికాలువ కింద వున్న మొదటి గ్రామాలైన కిష్టాపూర్, రాంపూర్ రైతులు మరియు ఎడమ కాలువ కింద వున్న మొదటి గ్రామాలైన నాగసాన్‌పల్లి, అబ్లాపూర్ రైతులు సైతం మొదటి పంట పండించడం గగనకుసుమమే. కాలువ చివరి రైతులకు నీరు అందక బ్రతుకు భారం వల్ల ఆత్మహత్యలకు పాలుపడు తున్నారు.

**నల్లవాగు :** చిన్న తరహాకు చెందిన నల్లవాగు ప్రాజెక్టు కల్హేర్ మండలములో నిర్మించబడింది. ఈ ప్రాజెక్టు ద్వారా 11 గ్రామాలలో 4,451.23 ఎకరాల భూములకు నీరు అందుతుంది. ఇటీవల కాలంలో ఈ ప్రాంత రైతులకు కూడా మొదటి పంటకు నీరు అందలేని పరిస్థితే.

**నక్కవాగు :** నక్కవాగు పటాన్‌చెర్వు మండలములోని కర్దనూర్ గ్రామము నుండి మొదలై హత్నూర మండలములో పలుపనూర్ గ్రామము వద్ద మంజీరా నదిలో

కలుస్తుంది. పటాన్‌చెర్వు పారిశ్రామిక ప్రాంతంగా అభివృద్ధి చెందక పూర్వం ఈ వాగు వెంటగల గ్రామాలు నీటిని వ్యవసాయానికి వినియోగించుకొన్నాయి. ఈ ప్రాంతమంతా సస్య శ్యామలంగా కనిపించేది. పారిశ్రామిక భూతం వల్ల ఈ గ్రామాల ప్రజలు పూర్తిగా వ్యవసాయానికి దూరమైపోయారు. నక్కవాగు కాలుష్యం యథావిధిగా కొనసాగినట్లైతే మంజీరానది కూడా కాలుష్యపు కోరల్లో చిక్కక తప్పదు.

**హల్దీ ప్రాజెక్టు :** మంజీరా నదికి ఉపనదిగా వున్న పసుపులేరుపై వెల్దుర్తి మండలం లోని హకీంపేట గ్రామముపై 1979లో రాష్ట్ర ప్రభుత్వం ప్రాజెక్టు కోసం శంఖు స్థాపన చేసింది. దీని ద్వారా 2900 ఎకరాలకు నీరందించాలన్న సదుద్దేశం 23 సం॥ వరకు కూడా పూర్తికాకపోవడానికి రాష్ట్ర ప్రభుత్వపు నిర్లక్ష్యం, వివక్షతలే కారణం. నిర్మించిన మేరకు ప్రాజెక్ట్‌లో నిల్వ ఉన్న నీటిని ఎత్తిపోతల ద్వారా ఆంధ్ర వలస వాసులు 900 ఎకరాలను సాగు చేసుకొనుచున్నారు. ప్రాజెక్టును పూర్తి చేస్తే సాగునీటిని వినియోగించుకోవడానికి వీలుగా ఆంధ్ర వలసవాసుల భూములు లేవు కనుకనే నిర్మాణాన్ని అడ్డుకుంటున్నారు. హల్దీ ప్రాజెక్టు నీరు ఈ ప్రాంతవాసులకు అందని ద్రాక్షలాగే మారింది.

**నారింజవాగు :** జహీరాబాద్ మండలంలో కొత్తూర్ (బి) గ్రామము వద్ద 1965 సం॥లో శంఖుస్థాపన చేసి 1971 సం॥లో ప్రారంభించినారు. దీని ద్వారా 3 వేల ఎకరాలకు నీరందించాలనేది లక్ష్యంకాగా ప్రారంభ సంవత్సరము మినహా 31 సం॥గా ప్రాజెక్టు నిర్లక్ష్యానికిగురయ్యింది. ఆ ప్రాంత ప్రజలకు ప్రభుత్వం సాగునీరు అందించలేకపోయింది. మన ప్రభుత్వ నిర్లక్ష్యం కర్ణాటక రాష్ట్రానికి వరంగా పరిణమించింది. మన రాష్ట్ర ప్రభుత్వం ఉన్న జలవనరులను పూర్తి స్థాయిలో వాడుకోక, పూర్తి నీటిని వాడుకుంటున్న కర్ణాటక రాష్ట్రాన్ని తప్పు పట్టడం వింతగానే ఉంది.

**ఎత్తిపోతల పథకాలు :** జిల్లాలో ఎనిమిది ఎత్తిపోతల పథకాలు ఉన్నాయి. అన్ని మంజీరా నదిపై ఉన్నవే. కారముంగి ఎత్తిపోతల పథకము ద్వారా 1983లో 1100 ఎకరాలకు నీరు అందించాలనుకున్న మొదటి దశలో 550 ఎకరాల భూమికే నీరందక ఆ భూములు పడావుగా వున్నాయి. మంజీరానది పరివాహక ప్రాంత ప్రజలను ఈ ఎత్తిపోతల పథకాలను వినియోగించుకోలేని స్థితిలోనికి రాష్ట్ర ప్రభుత్వం నెట్టివేసింది. కాగా గోదావరి నదిపై "దేవాదుల" వద్ద ఆనకట్ట నిర్మించి ఎత్తిపోతల పథకం ద్వారా సుదూర ప్రాంతమైన సిద్దిపేటకు నీరందిస్తామన్న ప్రభుత్వపు ప్రకటన ఆచరణకు దూరంగా ఉన్నది.



ప్రభుత్వాల నిర్లక్ష్యం, వివక్షతల వల్ల జిల్లాలోని ప్రాజెక్టుల ద్వారా నిర్దేశించిన మేరకు నీరు అందడంలేదు. వాగులన్నీ సద్వినియోగంలోనికి రాకపోవడం, చెరువులు, కుంటలను పట్టించుకోకపోవడం వల్ల సాగుచేస్తున్న భూమి ప్రతి ఏటా క్రమక్రమంగా తగ్గిపోతున్నది. పడావు భూముల సంఖ్య దినదినం ప్రవర్ధమానమైపోతున్నది.

1956లో చెరువుల కింద సాగుచేయబడిన భూమి 1,46,244 హెక్టారులు కాగా 1998-99 లెక్కల ప్రకారం 19,036 హెక్టార్ల భూమి మాత్రమే సాగైంది.

హైద్రాబాద్ రాష్ట్రంలో ఉన్నప్పుడు సాగుకు నోచుకున్న భూమి కన్నా విశాలాంధ్రలో కల్సిన తర్వాత సాగుభూములు ఇంకా విశాలంకాక బాధలు, గాధలు, దారిద్ర్యం విశాలమైనాయి.

వ్యవసాయాన్ని వదులుకోలేని పరిస్థితుల్లో భూగర్భ జలాలను వినియోగించుకొనే క్రమంలో బోరుబావుల సంఖ్య క్రమంగా పెరుగుతుంది. బోరుబావుల ద్వారా వ్యవసాయం చేయడం అధిక వ్యయాన్ని ఒనగూర్చుకోవడమేగాక పూర్తి స్థాయిలో విద్యుత్తుపైననే ఆధారపడడం వలన రైతాంగం పలు ఇక్కట్లను ఎదుర్కొంటూ వ్యవసాయ వృత్తి నుండి నెట్టివేయబడుతున్నారు.

1998-1999 లెక్కల ప్రకారం మెదక్ జిల్లాలో కాలువల కింద 1,917 హెక్టార్లు, మాములు బావుల ద్వారా 31,800 హెక్టార్లు, ఇతర వనరుల ద్వారా 1,416 హెక్టార్లు కాగా మొత్తం సాగుభూమి 55,169 హెక్టార్లు. బోర్‌బావుల ద్వారా సాగుచేసిన భూమి 86,343 హెక్టార్లు. బోరుబావుల కింద సాగు చేస్తున్న భూమి అన్ని వనరులతో సాగవుతున్న భూమి కన్నా 1 1/2 రెట్లు అధికంగా వుంది.

మంజీరా పరివాహక ప్రాంత ప్రజల ప్రయోజనాలను జంటనగరాల ప్రజలకు ఫణంగా పెట్టడం వలన మెదక్ జిల్లాలోని సింగూర్, ఘణాపూర్ ఆయకట్టలకు నీరు రాక భూములన్నీ బీడువారి పోయాయి.

జిల్లాలోని ప్రాజెక్టుల కింది భూములను, చెరువుల ద్వారా పంటలకు ఉపయుక్తమయ్యే భూమి, వాగుల ద్వారా వినియోగమయ్యే భూమి, ఎత్తిపోతల పథకాల ద్వారా వినియోగమయ్యే భూములను ప్రభుత్వం వినియోగంలోకి తీసుకువచ్చినట్లైతే రైతాంగానికి కొంత ఊరట కలుగుతుంది.



# మెదక్ జిల్లా పారిశ్రామిక రంగం

వై. అశోక్ కుమార్

ఆసియా ఖండంలోనే అతిపెద్ద పారిశ్రామిక వాడగా పేరుగాంచిన పటాన్‌చేరు ప్రాంతం మెదక్ జిల్లాలోని భాగమే. పారిశ్రామికంగా చూసినప్పుడు కోస్తాంధ్ర, రాయలసీమ ప్రాంతాలకన్నా తెలంగాణ ప్రాంతం చాలా అభివృద్ధి చెందినట్లు అగుపిస్తుంది. ఈ పారిశ్రామిక అభివృద్ధి ఫలాలను రాష్ట్రేతర పారిశ్రామిక అధిపతులు, కోస్తాంధ్ర పారిశ్రామిక అధిపతులు అందుకోగా అభివృద్ధి నీడలు మాత్రమే మెదక్ జిల్లా వాసులకు దక్కాయి. ఆకస్మికంగా ప్రారంభమైన ఈ పారిశ్రామిక అభివృద్ధి తమకు నిష్ప్రయోజనమనే విషయాన్ని మెదక్ జిల్లా వాసులు గుర్తించారు. మెదక్ జిల్లాలో పరిశ్రమల ఆవిర్భావం 1965 నుండి మొదలైంది. 1972 నుండి 1980 వరకు కేంద్ర ప్రభుత్వమిచ్చిన వరాల సబ్సిడి రాష్ట్ర ప్రభుత్వమిచ్చిన సబ్సిడీల వలన పరిశ్రమలు ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోయి, రాయితీలను నిలుపుదల చేసిన వెంటనే పరిశ్రమలు మూతపడ్డాయనే విషయాన్ని గుర్తించాలి. జిల్లాలో సుమారు 372 భారీ పరిశ్రమలు, 4,503 మధ్య, చిన్న తరహా పరిశ్రమలు ఉన్నాయి. పరిశ్రమలు అధికంగా పటాన్‌చేరు, రామచంద్రాపురం, జిన్నారం మండలాల్లో ఉన్నాయి. పాక్షికంగా నర్సాపూర్, హత్నూర, సదాశివపేట, కోహీర్, జహీరాబాద్, శివ్వంపేట, తూప్రాన్, సంగారెడ్డి మండల్లాలో ఉన్నాయి. పబ్లిక్ రంగ సంస్థలు బి.హెచ్.ఇ.ఎల్., ఆల్విన్‌వాచ్, ఏ.పి. స్కూటర్స్, బి.డి.ఎల్., ఓ.డి.ఎఫ్., ఎన్.ఎస్.ఎల్. జహీరాబాద్ మరియు మెదక్. ప్రైవేట్ రంగములోని ప్రముఖ సంస్థలు అల్‌కబీర్, అల్లాన, (రుద్రారం, జహీరాబాద్) గణపతి షుగర్స్ సంగారెడ్డి, చార్మినార్ బ్రెవరీస్ శివ్వంపేట, ఎం.ఆర్.ఎఫ్. సదాశివపేట, ఇందిరాప్రియదర్శిని స్పిన్నింగ్ మిల్ సదాశివపేట, మహేంద్ర & మహేంద్ర జహీరాబాద్, టాటా కాఫి తుప్రాన్‌లతో పాటు కెమికల్ & డ్రగ్స్, ఐరన్ & స్టీల్ మరియు గ్రానైట్ మొదలగు రంగాలకు సంబంధించిన ఫ్యాక్టరీలలో పని చేస్తున్న కార్మికుల సంఖ్య సుమారుగా 1,30,000 కాగా అందులో మన జిల్లా, తెలంగాణ వాసులు 20,000 వేలకు మించి లేరు. మిగతా కార్మికులంతా ఇతర ప్రాంతాలకు చెందినవారు. స్థానికులు ఏదైనా కర్మాగారంలో ఎక్కువ మంది పని చేసినట్లయితే ఆ యాజమాన్యం కర్మాగారం మూసివేతకే సిద్ధమవుతుంది. ఇన్ని పరిశ్రమలుండగా ఉపాధి పొందలేని పరిస్థితుల్లో మెదక్ జిల్లా యువకులున్నారు. ఈ కర్మాగారాలకు ఉపయోగించుకుంటున్న భూమి అంతా వ్యవసాయానికి అనుకూలంగా ఉన్న భూమే. దీని మూలంగా వ్యవసాయానికి అనుకూలమైన భూమి చాలా తగ్గిపోయింది. పటాన్‌చెరు ప్రాంతంలో ఆకస్మికంగా ప్రారంభమైన పారిశ్రామికవాడ వల్ల నక్కవాగు పూర్తిస్థాయిలో కలుషితమై వ్యవసాయ రంగానికి ఉపయోగపడకపోగా, వాగుకు వాగు మొత్తం పరిశ్రమల వ్యర్థరసాయనిక పదార్థాలచే నిండిన ఫలితంగా పటాన్‌చెరు వాసులు డాక్టర్లు కనుక్కోలేని వ్యాధులతో బాధపడుతూ ఊపిరి సలుపకుండా ఇబ్బంది పడుతున్నారు. నక్కవాగు పరిసర ప్రాంతాల ప్రజలు వ్యవసాయం చేయలేని స్థితిలోకి నెట్టివేయబడ్డారు.

జిన్నారం మండలంలో ప్రభుత్వం ప్రత్యేకంగా పరిశ్రమల కొరకు ఏర్పాటు చేసిన ప్రాంతమైన ఐ.డి.ఏ. బొల్లారంలోని పరిశ్రమల వలన జిన్నారంలోని కొన్ని గ్రామాలు కాలుష్యపు కోరల కింద నలుగుతున్నాయి. హల్దీవాగుకు సమీపంలోనే ఎన్.ఎస్.ఎల్. మెదక్ యూనిట్ ఉండటం వల్ల ఫ్యాక్టరీ వ్యర్థ పదార్థాలను వాగులోకి వదలడం వల్ల హల్దీవాగు కాలుష్యానికి గురైతున్నది. హల్ది వాగు నుండి మెదక్ పట్టణ ప్రజలకు త్రాగునీటి సరఫరా కలదు. వాగు ప్రవహించినన్ని రోజులు మెదక్ పట్టణ ప్రజలు కలుషితమైన నీటినే రక్షిత మంచినీటిగా భావించి తాగాల్సిందే. హత్నూర మండలంలోని కెమికల్ ఫ్యాక్టరీల వల్ల హత్నూర మండలంలోని కొన్ని గ్రామాలు కాలుష్యానికి గురైనాయి. అలాగే కోహీర్ మండలంలో కేమికల్ ఫ్యాక్టరీలు ఉన్నందువలన అక్కడ సైతం కొన్ని గ్రామాలు కాలుష్యపు పంజా కింద కొట్టుమిట్టాడుతున్నాయి. పారిశ్రామిక ప్రాంతాలుగా పేరొందిన ఈ మండలాల్లో బస్సులో ప్రయాణం చేసే ప్రయాణీకులు సైతం ఆ విషవాయువుల వలన తలనొప్పికి గురికాని వారు ఎవరూ లేరంటే అతిశయోక్తేమి కాదు!

కాల్యుష్య వ్యతిరేక పోరాటాల వలన పారిశ్రామిక ప్రగతి కుంటుపడుతుందని, పరిశ్రమలు మూతపడుతాయని భావించిన వారు లేకపోలేదు. వాస్తవంగా మూతపడినవన్నీ కాలుష్య కారకాలు కావని గుర్తించుకోవలసిన ఆవశ్యకత కలదు.

కాలుష్య నివారణ కొరకు పటాన్‌చెరు ప్రాంతవాసులు కోర్టుకుపోయి కాలుష్యం ద్వారా నష్టపరిహారాన్ని ఇవ్వాలని తీర్పు పొందినప్పటికి ఆ రాయితీలు ఇప్పటికి అందని ద్రాక్షలానే మిగిలిపోయాయి. ఇలా అభివృద్ధి చెందిన పారిశ్రామిక ప్రాంతాన్ని భూతల నరకంగా పిలువవచ్చు. ప్రభుత్వరంగ సంస్థలైన ఏ.పి.స్కూటర్స్, ఆల్విన్ వాచ్ డివిజన్‌లను ఎప్పుడో మూసివేసినారు. ఎన్.ఎస్.ఎఫ్. జహీరాబాద్ మరియు మెదక్ యూనిట్లు అమ్మకానికి సిద్ధంగా ఉన్నాయి. భారీ పరిశ్రమ అయిన బి.హెచ్.ఇ.ఎల్. 1965లో 3000 ఎకరాల భూవిస్తీర్ణంలో స్థాపింపబడింది. ఇందులో గల 10,000 మంది ఉద్యోగుల్లో అత్యధిక శాతం కోస్తాంధ్ర వాసులేననేది నగ్నసత్యం. ఈ కోస్తాంధ్ర వాసుల సంతతి అంతా ఇప్పుడు ఆరు సూత్రాల పథకం పుణ్యమా అని మెదక్ జిల్లా వాసులే అయ్యారు...

ఇక్రిశాట్ 1972లో 4,500 ఎకరాలలో స్థాపింపబడిన వ్యవసాయ రంగ పరిశోధనా సంస్థ. ఈ పరిశోధనా ఫలాలను జిల్లావాసులు వ్యవసాయ రంగానికి పొందిన ఫలితాలు వీసమంతా కానరాదు. ఈ పరిశోధనా సంస్థలో సైతం 90 దేశాల వాసులే గాక కోస్తాంధ్రవాసులే అధికంగా ఉన్నారనడంలో సందేహం లేదు.

ఓ.డి.ఎఫ్. (ఆర్డినెన్స్ ఫ్యాక్టరీ) 10,000 ఎకరాల వ్యవసాయ భూమిలో నిర్మింపబడింది. దీని మూలంగా సైతం వ్యవసాయదారులు వ్యవసాయిక భూమిని కోల్పోయారు.

అన్నారంలోని ఎయిర్‌ఫోర్స్ ఆకాడమీ వలన వేల ఎకరాల భూములను కోల్పోవలసి వచ్చింది. కాని భూమిని కోల్పోయిన వారికి దానిలో మాములు చప్రాసి ఉద్యోగం కూడా లభించలేదు.

మెదక్ జిల్లాలో ఈ పారిశ్రామిక ప్రాంతాల వలన వ్యవసాయదారులు వ్యవసాయ భూమిని కోల్పోవడమే గాక నిరుపేదలు పొందాల్సిన ప్రభుత్వ భూములను సైతం కోల్పోయారు. వ్యవసాయదారులు వారి వారి భూములను పరిశ్రమలకు అమ్ముకోకుండానే నిరుపయోగంగా మారిపోయాయి. గాలి, నీరు, భూమి కాలుష్యాల వలన అనారోగ్య బారినపడి జీవించే ప్రాథమిక హక్కును సైతం కోల్పోయారు. ఈ పరిశ్రమల యాజమానులు తెలంగాణేతరులు కావడం వల్ల స్థానికులకు ఉద్యోగాలివ్వడానికి నిరాకరించారు.

కాలుష్య నియంత్రణ బోర్డులోని ఉద్యోగులు సైతం స్థానికులు కాకపోవడం వలన ఇక్కడ పురి విప్పిన కాలుష్యంపైన శ్రద్ధ చూపించలేకపోతున్నారు. దీనివల్ల అనేక చెరువులు, భూములన్నీ కాలుష్యానికి గురై వ్యవసాయానికి నిరుపయోగంగా మారి జీవితాలను ఛిద్రం చేస్తున్నాయి.





# మెతుకుసీమ వ్యవసాయ విజ్ఞానం

పప్పుల రాజిరెడ్డి

మన దేశం ముఖ్యంగా వ్యవసాయ ప్రధానమైన దేశం. గ్రామీణ వ్యవస్థతో కూడుకున్నటువంటిది. అనేక కులవృత్తులకు, సంస్కృతులకు, భాషలకు నిలయమైనది. ఆహారోత్పత్తికి పల్లెలు పట్టుకొమ్మల వంటివి. వాగులు, వంకలు, చెరువులు, కుంటలు, చెలిమెలు, రకరకాల భూములు. అడవులు, వాతావరణ పరిస్థితులు ఊరు జీవితాన్ని పెనవేసుకుని ఉంటాయి. మనిషి జీవికకు ఆహారం ముఖ్యమైనది. అందుకే గ్రామీణ జీవితంలో వ్యవసాయం, కులవృత్తులు ప్రధాన భూమికను పోషిస్తాయి. ఒకదానితో ఒకటి సహసంబంధాన్ని కలిగి ఉంటాయి.

మెతుకుసీమ వ్యవసాయాన్ని పరిశీలించినప్పుడు, అందులో ప్రధానమైనది భూమి. రైతు భూమి రకాన్ని బట్టి పంటలు వేయటానికి నిర్ణయం తీసుకుంటాడు. అన్ని పంటలు ఒకే రకమైన నేలలో పండవు. మన జిల్లాలో రేగడి నేలలు, ఎర్ర సరుక నేలలు, చౌక నేలలు, రాతినేలలు ఎక్కువగా ఉన్నాయి. సంగారెడ్డి, జహీరాబాద్ ప్రాంతాలలో రేగడి నేల ఎక్కువగా ఉండటం వలన వరి, పత్తి, మొక్కజొన్న, చెరుకులాంటి ప్రధాన పంటలతో పాటు కూరగాయలు పండిస్తారు. సదాశివపేట, నారాయణఖేడ్ ప్రాంతాలలో అల్లం, అరటి, జొన్న, రబ్బులు, పసుపు వంటి పంటలను ప్రధానంగా పండిస్తారు. మెదక్ ఆందోల్, జోగిపేట ప్రాంతాలలో రేగడి భూములు అధికం. ఇక్కడ వరిపంట బాగా పండుతుంది. చెరుకు పంట మెదక్ డివిజన్‌లో విరివిగా పండిస్తారు. అన్ని రకాల నేలలు అన్నిచోట్లా జిల్లావ్యాప్తంగా ఉండటం వలన పునాస పంటలైన మొక్కజొన్న, పజ్జొన్న, కంది, పెసర, మినుము వంటివే కాకుండా పొద్దుతిరుగుడు, బీర్నీస్ పంటలు పండిస్తున్నారు.

సిద్ధిపేట డివిజన్‌లో కొంత నీటి వసతి తక్కువ కావటం వలన ఇక్కడి నేలలకు అనుగుణంగా పత్తి, వరి, పొద్దుతిరుగుడు, మల్బరీ, చెరుకు వంటి పంటలు వేస్తున్నారు. ప్రజ్ఞాపూర్, గజ్వేల్ ప్రాంతంలో పత్తి, మొక్కజొన్న, కూరగాయతోటలు పెంచుతున్నారు. ఈ ప్రాంతంలో రేగడి భూమి శాతం ఎక్కువ సదాశివపేట - అనంతసాగర్ ప్రాంతంలో తమలపాకు తోటలు పెంచుతున్నారు. రేగడి నేలలో పత్తి, చెరుకు, మొక్కజొన్న పండిస్తే - ఎర్రసరుక నేలలు అల్లం, మిరప, ఉల్లి, వెల్లుల్లి, పొద్దుతిరుగుడు మొదలగు పంటలకు పనికి వస్తాయి. చౌకనేలల్లో కూడా ఎరువులు వేసి భూమిని 'లగు' చేసి పంటలు పండిస్తున్నారు.

మెతుకుసీమలో నీటి వసతికి వనరులు ఉన్నాయి. ఘనపూర్ ప్రాజెక్టు, నిజాంసాగర్, పోచారం చెరువు, అనంతసాగర్ చెరువు, జోగిపేట చెరువులు మంచి ఆయకట్టును కలిగి ఉన్నాయి. చెరువులు, వాగులు, కుంటలు, చెలిమెలు, బావులు వ్యవసాయానికి అవసరమైన నీటివనరులు. సింగూరు జలాలను కూడా వ్యవసాయానికి ఉపయోగించే వీలుంది. యీ నీటివనరుల వల్ల తరిపంటలైన వరిపంట అధికంగా రైతులు పండిస్తున్నారు. మెదక్ డివిజన్‌లో వరి, చెరుకు అధికంగా పండిస్తే - జహీరాబాద్ - సదాశివపేట ప్రాంతంలో అల్లం, పసుపు - నారాయణఖేడ్ ప్రాంతంలో జొన్న అధికంగా పండిస్తున్నారు.

చెరువుల ద్వారా, ప్రాజెక్టుల ద్వారా లభించే నీటికి కాలువలుంటాయి. బావులు అధికంగా ఉన్న ప్రాంతాలలో మోట, ఏతం, గూడ, గాడెం, రాటు వంటి నీటిని తోడే సాధనాలు ఉపయోగించారు. భూగర్భజలాలు అడుగంటుతున్న సందర్భంలో ఆయిల్ ఇంజన్లు వచ్చాయి. ఇవి డీజిల్, క్రూడ్ ఆయిల్‌తో నడిచేవి. బావులలోతు పెరగడం వలన నీటిని తోడటానికి వీటిని ఉపయోగించేవారు. కొంతకాలానికి జిల్లాలో కరెంటు సరఫరా వచ్చిన తర్వాత కరెంటు మోటార్లు నీటిని తోడి, వ్యవసాయం చేయటం కొంత సులభమైనది. ప్రస్తుత పరిస్థితుల్లో బోర్లు - సబ్‌మెర్సిబుల్ మోటార్లు వాడుతున్నారు.

విద్యుత్ వినియోగం పెరిగిపోవటం వలన, ఉత్పత్తి తగ్గటం వలన విద్యుత్ కొరత ఏర్పడి పంటలు ఎండిపోయే పరిస్థితి కూడా చాలా చోట్ల కన్పిస్తున్నది.

మెదక్ ఏడుపాయల వాగు, కూడవెల్లి వాగు, పసుపేరు వంటి జలవనరులు కూడా వ్యవసాయానికి అవసరమైన నీటిని అందిస్తున్నాయి. సిద్ధిపేట ప్రాంతంలో చెరువులు ఉన్నా నిండకపోవటం వల్ల గత సంవత్సరం వరకు కరువు తాండవించింది. బోరుబావులు ఆధారంగా ఇక్కడ వ్యవసాయం నడుస్తున్నది.



జిల్లాలో పండిస్తున్న పంటలను తరి, ఖుష్కి పంటలుగా పేర్కొంటున్నారు. అధిక నీటి వినియోగం అవసరమయ్యే వరి తరిపంట కాగా - మొక్కజొన్న, గోధుమ, పొద్దుతిరుగుడు, వేరుశెనగ, పెసర, జొన్న, మినుము, సోయాబీన్ వంటివి ఖుష్కి పంటలు. ఆముదము, ఉలవ, శెనగ, పత్తి, మిర్చి, కూరగాయలు ఆరుతడి పంటలు.

పంట పండించటానికి ముందు రైతులు భూమిని దున్నాలు, ముందు పొర్లు మెత్తగా దున్ని ఎరువులు తోలుకుంటారు. పశువుల పేడ, కోడి ఎరువు, గొర్రెమందల ఎరువు, ఆకుతొక్కుడు, కానుగ, తిప్పలి, తంగేడు లాంటి మొక్కలను కోసి వాటి ఆకులను పొలంలో తొక్కేవారు. క్రిమిసంహారక మందు ఎండ్రిన్, యూరియా మాత్రమే ఉపయోగించేవారు. కాని ఇప్పుడు రసాయన ఎరువులైన అమ్మోనియా, యూరియా, దుక్కిమందు, పొటాష్ వంటి ఎరువులు వినియోగిస్తున్నారు. అధిక దిగుబడి పొందుతున్నారు.

మన వ్యవసాయవిధానంలో భూమిని దున్ని, ఎరువులు వేసి, నారుమడి సిద్ధం చేసుకొని నాట్లు వేస్తారు. నాగలి, గొర్రు, పార, మట్టిపార, జంబ, కొడవలి, రాగోల, కొంకి, గొడ్డలి, కమ్మకత్తి, కోర, గడ్డపార వంటి వ్యవసాయ పరికరాలను ఉపయోగిస్తారు. వరికోతకు రాగానే కుప్ప వేస్తారు. వడుగు ఏర్పాటు చేసి బంతి తొక్కుతారు. గడ్డి దులిపి, వడ్లు తూర్పారబట్టి 'రాశి' చేస్తారు. రాశిని బుడ్డితో కొలుస్తారు. ఇప్పుడైతే క్వింటాళ్ళ లెక్కలో కొలత వేస్తున్నారు.

పల్లెలో ముఖ్యంగా మెతుకు సీమలో ఉన్న కొలమానం యిది

2 సోలలు = తవ్వ

2 తవ్వలు = మానెడు

2 మానెలు = అడ్డ

2 అడ్డలు = కుంచె

2 కుంచెలు = బుడ్డి (10 కిలోలు)

"తూమెడు = నాలుగు బుడ్లు; ఐద్దుము = ఎనిమిది బుడ్లు; ముత్తుము = పన్నెండు బుడ్లు; నల్తుము = పదహారు బుడ్లు; ఆర్తుము = ఇరవై నాలుగు బుడ్లు; పల్లా = పది బుడ్లు; ఏడ్తుము = ఇరవై ఎనిమిది బుడ్లు; ఎనపందుం = ముప్పది రెండు బుడ్లు; తొమ్మందుము = ముప్పది ఆరు బుడ్లు; పందుము = నలభై బుడ్లు; పుట్టి =80 బుడ్లు; 2 పందుములు = 1 పుట్టి : ధాన్యం కొలతలు ఈ విధంగా ఉంటే బెల్లం, చింతపండు, ఉల్లిగడ్డ వంటి వాటిని జోకటానికి మడుము, సవ్వశేరు, శేరు అనే కొలతలు ఉపయోగించేవారు. ఈ కొలతలు ప్రస్తుతం కొన్ని అంతరించినా, వస్తువులను తూచటం కిలోలు, క్వింటాళ్ళు, టన్నుల పద్ధతిలో సాగుతున్నది.

విత్తన సేకరణ కూడా వ్యవసాయ రంగంలో ప్రధానమైన అంశం. అధిక దిగుబడి కోసం రైతు విత్తనాన్ని సేకరిస్తాడు. మేలు రకమైన విత్తనాలను ఎండపోసి, శుభ్రం చేసి, జల్లెడ, చాటతో జల్లించి, చెరిగి, కాగులు, బానలు, గరిసెల్లో నిల్వచేస్తారు. మొక్కజొన్న కంకులను గుజులుగా ఏర్పరచుకొని నిల్వ చేసుకుంటారు. వరి విత్తనాలు, మొక్కజొన్నలు, కందులు, పెసర్లు, మినుములు, పొద్దుతిరుగుడు, వేరుశెనగ, శెనగ బబ్బెర, తైద, సామ మొదలైన విత్తనాలను భద్రపరిచి మలిపంట కోసం వినియోగిస్తారు.

పూర్వ దశ వ్యవసాయంలో ఇప్పటిలాగా సంకర విత్తనాలు లేకపోవటం వలన అప్పటి రైతులు పండించిన విత్తనాలను ప్రతిసాలుకు వాడుకున్నారు. రైతులు గ్రామాలలో సాంప్రదాయ విత్తనాలను వాడేవారు. వరిలో ఉన్న రకాలు ఇవి : సాంబలు, మశూరులు, శెట్టిపల్లి గౌడలు, బందర్లు, నల్లవడ్లు. కృష్ణకాటుకలు, గరుడలు, బంగారు తీగలు, జయలు, పొట్టి మొలకలు, ముచ్చులు, పాలాకులు, రాజనాలు మొదలైన విత్తనాలు వాడేవారు. కాని ఇవి అధిక దిగుబడిని ఇవ్వకపోయేవి.

ఆధునిక పద్ధతిలో వ్యాధులను తట్టుకునే కొత్తవరి వంగడాలను శాస్త్రవేత్తలు రూపొందించారు. బి.పి.టి., కల్చర్లు, ఐ.ఆర్.8, ఐ.ఆర్.64, పోతన, హంస, ఎర్ర మల్లెలు వంటివి దాదాపు వందకుపైగా రకాలు వ్యాప్తిలో ఉన్నాయి. ఇవి రోగ నిరోధక శక్తిని కలిగి ఉండటమేకాక, అధిక దిగుబడిని ఇచ్చే వరి వంగడాలు.

చెరుకులో వయూరి, పత్తిలో బోల్‌గార్డు, బి.టి. రకాలు. కూరగాయ విత్తనాలలో సంకర విత్తనాలు, తక్కువ సమయంలో ఎక్కువ దిగుబడి నిచ్చే రకాలు ఎన్నో ఇప్పుడు అందుబాటులో ఉన్నాయి.

రైతులు తమ పొలాలలో ఒకే రకం పంటలు వేయకుండా, రెండు మూడేండ్ల కొకసారి పంట మార్పిడి చేసుకుంటారు. ఒక పొలంలో వరుసగా రెండేండ్లు వరి పండించినప్పుడు భూసారం తగ్గుతుంది. అటువంటి సమయంలో పప్పుధాన్యాల రకాలైన పెసర, బబ్బెర, మినుము, బీర్నీస్ వంటి ఆరుతడి పంటలు పండిస్తారు. ఇలా చేయటం వలన పప్పు జాతి మొక్కల వేళ్లల్లో ఉండే నైట్రోజన్ బుడిపెలు గాలిలోని నైట్రోజన్ గ్రహించి బ్యాక్టీరియా సహాయంతో నైట్రోజన్ పొంది భూసారాన్ని పెంపొందిస్తాయి.

వరి ముఖ్యంగా తరి పంట. దీనికి నీరు ఎక్కువగా అవసరం ఉంటుంది. మొక్కజొన్న, పొద్దుతిరుగుడు, బీర్నీస్, వేరుశెనగ, బబ్బెర, కంది, ఆముదము యివి ఆరుతడి పంటలు. జొన్న, రబ్బి, సజ్జ, తైద, సామ, మొక్కజొన్న, పత్తి వంటివి పునాస పంటలు. పంటలను చీడపీడల నుండి రక్షించుకోవటానికి సస్యరక్షణ చర్యలు చేపడతారు.



మెతుకుసీమ గ్రామాలలో పొలాలను గుంటలు, గజాలు, ఎకరాలలో కొలతలు వేస్తారు. గుంటకు 121 గజాలు, ఎకరాకు నలభై గుంటలు, రెండున్నర ఎకరాలను హెక్టారుగా పిలుస్తారు. పొలానికి దాని నిర్మాణాన్ని బట్టి మడి, సోగు, దొయ్య అనే పేర్లు పెడతారు. మడిపెద్దగా ఉంటే పెద్దమడి అని, వందురులో ఉంటే వందురుమడి అని, మిర్రగా ఉండే మడిని మిర్రమడి అని పిలుస్తారు. గోరుమిళ్ళ దొయ్య, దయ్యాలమడి, దోర్నొందురు, కుంటమీదిసోగు, బొందమడి, వాగుపొంటి దొయ్య మడికట్ల పెరడు మొదలగునవి. కంచెలకైతే 'శెల్క' అనే పదం వాడుకలో ఉన్నది. రాసమాకుల కంచె, మూలవాగు చెల్క వంటివి.

నీటి వనరుల విషయానికొస్తే వాటికి కూడా పేర్లుంటాయి. పెద్ద చెరువు, ఊర చెరువు అంగడికుంట, వంజరోనికుంట, రెడ్డి చెరువు, కోమటి చెరువు, వాగు నుండి కాలువ తీసి కొంతదూరం బాయి వంటి గుంత ఏర్పాటు చేసుకుంటారు దాన్ని 'కోలు' అని పిలుస్తారు. మిర్రకోలు, రాతికోలు, పెద్దకోలు, కొనకోలు వంటివి. వీటిని రాతిపురితో నిర్మించి మోటలు అమర్చారు. కాని ఇప్పుడవి వాడుకలో లేవు.

వ్యవసాయదారులు ముఖ్యంగా కొన్ని పారిభాషిక పదాలను ఉపయోగిస్తారు. పొలానికి నీళ్లు తీసుకపోవటానికి 'కాలువ' ఏర్పాటు చేసుకుంటారు. పొలం నుంచి నీరు రంధ్రం ద్వారా వెళ్ళిపోతే దానిని 'బుంగ' అంటారు. పై పొలం నుంచి కింది పొలానికి నీళ్ళు పెట్టడానికి 'గల్మ'ను ఉపయోగిస్తారు. బండిమీద గడ్డి మెలిగినప్పుడు గడ్డి బరువు వెనకకు ఎక్కువైతె 'ల్యావక' అంటారు. బరువు ఎక్కువైతే 'అరక' అంటారు. నాగలి దున్నే తీరును 'దుంప' ఎలుగు-సలుగులు నిర్ణయిస్తాయి. ఎడ్లను నాగలి, బండి కట్టినప్పుడు కుడివైపు ఉన్న ఎద్దును 'వలపట' అని, ఎడమవైపు ఎద్దును 'దాపట' అంటారు. వరికోసి కల్లం నిండా పరచడాన్ని 'పడుగు' అని, వడ్ల రాశి చుట్టు వేసే బూడిద, వడ్ల మిశ్రమాన్ని 'పొత్తి' అని, వడ్లరాశిలో గడ్డితో తయారు చేసిపెట్టిన ఆకారాన్ని 'గణపతి' అని, వరిగడ్డి దంగిన తరువాత 'బంతి' విడిచేటప్పుడు 'శెలి' అనే పదాన్ని, ధాన్యాన్ని సంచుల్లోకి బుడ్డితో కొలుస్తున్నప్పుడు 'బర్కత్' అని అంటుంటారు. ఇలా అనేక వ్యవసాయ సంబంధమైన పదజాలం మెతుకుసీమ పల్లెల్లో రైతులు విరివిగా ఉపయోగిస్తారు. ప్రాంతాన్ని బట్టి స్థానిక భాషాపదాలలో మార్పులు చోటుచేసుకుంటాయి. కొన్నిచోట్ల కొన్ని కొత్తపదాలు, అదనపుపదాలు వాడకం కూడా ఉండి వుంటుంది.

## వ్యవసాయ సామెతలు

గ్రామ జీవితంలో వ్యవసాయం ప్రధాన వృత్తి. ఇతర కులాల వాళ్లు కూడా సాగుపై శ్రద్ధ చూపారు. అందుకే ఊళ్లల్లో భూమిలేని వారు అరుదుగా ఉంటారు. అందరు

వ్యవసాయ సంస్కృతి నుండి వచ్చినవారే. అందుకే తాతల తండ్రుల నాటి నుండి వ్యవసాయ అనుభవం వారసత్వంగా పొందటం వలన, వాళ్ల జీవిత అనుభవాల నుండి వృత్తి సంబంధమైన నానుడులు పుట్టినాయి. వీటిని మనం సామెతలు అని కూడా చెప్పొచ్చు.

1. **'ఆరుగాలం కష్టం చేసి అడివిల పెట్టినట్టు'** : కష్టపడి భూమిని సాగుచేసుకొని పెట్టువడి పెట్టి, కాలం కాటేసినప్పుడు చేనులెండిపోయినప్పుడు, చేను రోగాల బారిన పడ్డప్పుడు ఇటువంటి సామెత ఉపయోగిస్తారు.
2. **'ఆషాఢమాసంలో అక్కడక్కడ తిరిగి కార్తీక మాసంలో కండ్లకు నీళ్ళు తెచ్చుకున్నట్లు'** : కొందరు పనికి వంగనివారు విత్తనం పెట్టాల్సిన సమయంలో అటుయిటు తిరుగుతారు. వేరే రైతులు విత్తనం పెట్టుకుంటారు. వాళ్ళ చేను వైపుగా పెరిగి మంచి దిగుబడిని ఇస్తుంది. అప్పుడు ఆ చేనును చూసిన ఈ వంగలేని మనిషికి కండ్లళ్ళ నీళ్ళు తిరుగుతాయంటారు.
3. **'అసలేట్ల ముసలెద్దు అంకేసినట్టు'** : ఆశ్లేషకార్తెలో భూమి నిండా ఎటుచూసిన పస్క ఉండటం వలన అంతముందు ఎండల్లో గడ్డి సరిగా అందని ముసలి ఎడ్లు చిక్కవడుతయ్. వయసులో ఉన్న గిత్తలాగా కుస్తీ పట్టటానికి అంకెలేస్తాయి. వయసు మీద పడ్డవాళ్ళు – వయసుమీరిన పని చేసినప్పుడు యీ సామెత ఉపయోగిస్తారు.
4. **'ఏగిలి దుక్కిదున్నితే ఎరువేసినంత బలం'** : పొలాన్ని లేదా గుడ్డాన్ని వర్షంపడిన అదును చూసి నాగళ్ళతో ఇరువాలు మూడు సార్లు దున్ను తుంటారు. ఇలా దున్నటం వలన భూమి వదులు అయి గాలి తగులుతుంది. ఆకు అలము మట్టిలో కప్పబడి మురుగుతుంది. దుక్కి కుంకుమకుంకుమ అవుతుంది. వర్షం పడ్డప్పుడు ఎక్కువ నీటిని తాగుతుంది. ఫలితంగా సారవంతమై ఎరువు తోలినంత బాగా ఉంటుంది.
5. **"దున్నవోతె దూడల్ల – మేయవోతె ఎడ్లల్ల"** : పని చేతగాని వాళ్ళనుద్దేశించి రైతులు స్వానుభవంతో ఏర్పరచుకున్న నానుడి ఇది.
6. **"అద్దెడు వడ్లకు కైకిలిపోతే తూమెడు వడ్లు దుద్దె బుక్కినట్లు"** : కొందరు తమ పని వదిలి అత్యాశతో కూలికి పోయినప్పుడు అతనికి జరిగిన నష్టాన్ని చూసి చెప్పుకునే సందర్భంలో యీ సామెత ఉపయోగిస్తారు.
7. **"బద్దికి బందారుగాళ్ళు-బుక్కిపోయేది రామచిలుకలు"** : ఫాయిదా పొందే వారొకరు, బద్‌నామ్ అయ్యేవారొకరు అయిన సందర్భంలో వాడే సామెత ఇది.



8. **"మడికి ఇద్దుం అలికితే కాపోని కష్టం నాకెందుకని కర్రకోయిత్తు పెట్టినట్టు"**: కొంతమంది పంట బాగా పండాలనే అత్యాశతో, అగడుతో విత్తనం ఒత్తుగా అలుకుతారు. సరైన ఎడం పాటించకపోవటం వల్ల మొక్క బలహీనంగా ఉండి కర్రతో యిత్తు పెడుతుంది. దిగుబడి తగ్గుతుంది.
9. **"కవ్వం కదురు తిరిగినింట్ల కరువెక్కడిది"** : పాడి పశువులు పాలు ఇవ్వటం వలన ఆ రైతు యింట్లో పాడి సమృద్ధిగా ఉంటుంది. చల్లకవ్వం చప్పుడు లయబద్ధంగా వినవస్తుంది. కదురుదారం తీయటానికి వాడే సాధనం పత్తిపంట పండించిన రైతు ఎనకట యింటింటా కదురు సాధనంతో దారం తీసి దారపు కండెలను సాలెవాళ్ళకిచ్చి బట్టనేయించుకునేవారు. పై రెండు ఉన్న వాడికి కరువు లేదనే భావన స్ఫురిస్తుంది.
10. **"రోహిణిలో మక్క వేస్తే రోకండ్లోలె కంకులు పెడతై"** : పంటకు కార్తెబలం ఉంటుంది. రోహిణి ఎడగారులో మొదటి కార్తె కావడం వలన మొదటి వానలకి పడిన విత్తనం అధిక దిగుబడిని ఇస్తుందని చెప్పుకునే సందర్భాన్ని ఈ సామెత తెల్పుతుంది.

**మరికొన్ని సామెతలు :**

1. ఉత్తెర ఉరిమితే పాములు తరుముతై.
2. పుబ్బలో వానపడితే పురేడు ముడ్డికింద నానదట.
3. మగకు మక్కకు పగ.
4. ఉత్తెర జూసి ఎత్తర గంప.
5. ఆరిద్రవోతె ఆకరువు పుట్టె.
6. అసలేట్ల ముసురు లసలసలు.
7. మాగిల దున్నపోతువలె.
8. ఆయెట్కి తొలిసూరు ఆదొండకాయ – భూమికి తొలిసూరు పచ్చని గరుక.
9. కైకిలి గంజి కమ్మకమ్మ. పంట గంజి పాసుపాసు.
10. పసురాన్ని నీళ్ల దగ్గర్కి తోల్కపోతం గాని తాగిస్తమా.
11. పుచ్చిన విత్తులు చచ్చినా మొలవవు.
12. పైరుకు ముదురు పసురానికి లేత ప్రమాదం.
13. పెసరకు పైరగాలి పసురానికి నోటి 'గాలి' ప్రమాదం.
14. రైతు పేదగాని మడి బీదగాదు.

15. ఆవులావులు కొట్లాడి లేగల కాళ్ళు విరిచినట్టు.

16. పాలిచ్చే బర్రెనమ్మి పొడిచే దున్నను తెచ్చినట్టు.

ఇలా ఇంకా మరికొన్ని వ్యవసాయ సంబంధమైన సామెతలను రైతుల ద్వారా, వృద్ధుల ద్వారా సేకరించాల్సిన అవసరం ఉన్నది.

**వ్యవసాయ పండుగలు :**

భూమిని నమ్ముకున్న రైతు పంట చేను మంచిగుండాలని ఆశపడుతాడు. చేనుకు పురుగు తగలకుండా, వ్యాధులు రాకుండా జాగ్రత్త తీసుకుంటాడు. పంటకు దిష్టి తగులకుండా, రాళ్ళ వాన పడకుండా దేవునికి మొక్కుతాడు. వ్యవసాయ పండుగలు చేసుకుంటాడు. అలుకుడు బోనం, శీతలకు పెట్టుడు, పొలి, కాట్రావులు వంటి పండుగలు ఆర్భాటంగా కాకపోయినా భక్తితో జరుపుకునే పండుగలు. వ్యవసాయ పనిలో తోడ్పాటు అందించే వడ్ల, కమ్మరి, కుమ్మరి, మాదిగ, బైండ్ల, బ్యాగరి, నీరడి, ఎరుకలి మొదలగు వృత్తి పని వాళ్ళను భోజనానికి పిలుస్తాడు. మెతుకుసీమ రైతులు జరుపుకునే పండుగలివి.

1. **అలుకుడుబోనం :** వరి పండించటానికి దుక్కి తయారు చేసుకున్న రైతు మొలక పోస్తాడు. నాగళ్ళతో దున్ని మడిని గొర్రుతో రొప్పి మట్టంగా వచ్చేటట్లు పొలంలో అలుకుడు చేస్తాడు. ఇంటి వద్ద నైవేద్యం కోసం అన్నం వండి, ఒక ఎలితెతట్టలో పెట్టుకొని పొలం వద్దకు తెస్తారు. అన్నంలో ఉప్పువేయరు. ఎండిపోయిన ఊడుగకొమ్మను తెచ్చి, ఊడుగకొమ్మను 'తుకం' మడి 'సాయ'కు దగ్గరగా ఒరం అంచున పాతుతారు. ఊడుగు కొమ్మ ముండ్లకు బంతిపూలు గుచ్చి ఐదు పలుగురాళ్ళను ఊడుగ కొమ్మ మొదట నిల్పి, పసుపు కుంకుమలతో అలంకరిస్తారు. విప్పిన మొలకలో నుంచి ఐదు కుప్పలు మైసమ్మ దగ్గర - ఐదు కుప్పలు పోతలింగని దగ్గర, ఐదు కుప్పలు మొలక అలంకరించిన ఊడుగకొమ్మ దగ్గర ఉంచుతారు. ఐదు పలుగు రాళ్ళను కుంకుమ, పసుపు నూనెలతో అలంకరించి కొమ్మ కింద పెడతారు. తెచ్చిన నైవేద్యాన్ని మైసమ్మ దగ్గర, ఊడుగకొమ్మ దగ్గర ఉంచి, పంట మంచిగా రావాలని మొక్కి, పెరుగు, నెయ్యి కలిపిన నైవేద్యాన్ని మొలక అలికిన రైతు తప్ప, అక్కడ ఉన్న మిగతావాళ్ళు ఆ అన్నాన్ని తిని అలుకుడు చేస్తారు. రైతు సిద్ధం చేసుకున్న పొలంలో మొలక అలికి, పిట్ట బొర్లకుండా ఉండటానికి బెదుర్లు ఏర్పాటు చేస్తారు. మడి చుట్టూ నెగడు పెడతాడు.

2. **శీతలకు పెట్టుడు :** కాముని పున్నం వెళ్ళిన తర్వాత ఉగాదికి ముందు పంట కోతకు రాకముందే శీతలకు పెడతారు. పొలానికి దిష్టి తగలకుండా ఉండటానికి ఈ పండగను చేస్తారు. ఈ పండుగనాడు పనోళ్ళందరిని భోజనానికి పిలుస్తారు. సంక్రాంతినాడు గురిగిలో పాలు పొంగించిన అన్నం మెతుకులు, కాముని బూడిద, చింతగింజలు, జీడిగింజలు చేనువద్దకు తీసుకెళ్తారు. మైసమ్మకు, పోతలింగనికి నైవేద్యం పెడతారు. కల్లు, గుడాలు, పూదిచ్చిన బోనంల అన్నం పండుతారు. పొలం దగ్గర కల్లుసాక పెడతారు. పొలానికి దిష్టి తగలకుండా పందిలద్దెతో పొగ వేస్తారు. చనిపోయిన పశువు పంతను పంగల కర్రకు అమర్చి పొలంకెదురుగా బెదుర్లు పెడతారు. చేనుమీద ఇరుగుపొరుగు దిష్టి తగలకుండా ఉండటానికి చెడుగాలి సోకకూడదని ఈ పండుగ జరుపుకుంటారు. పని పాటలోల్లకు భోజనం పెడతారు. వ్యవసాయానికి తోడ్పడే వృత్తుల వాళ్ళతో ఈ పండుగ జరుపుకుంటారు. కావున రైతు మరియు పనివాళ్ళ మధ్య స్నేహం, ఆత్మీయత పెంపొందుతాయి.

3. **కాట్రావుల పండుగ :** వ్యవసాయం చేయాలనుకునే రైతులకు పశువులే బలం. పశువుల వలన పాడి, పని, ఎరువు లభిస్తాయి. సంక్రాంతి పండుగకు ముందు రోజు కాట్రావుల పండుగ జరుపుకుంటారు. పశువులను ఈ రోజు శుభ్రంగా కడుగుతారు. ఇంటి యజమాని దగ్గర వంటకు అవసరమైన బియ్యం, పప్పు, ఉప్పు, కారం, కూరగాయ, నూనె, చింతపండు, పసుపు తీసుకెళ్తారు. అదే విధంగా జాజు, సున్నం బాయి దగ్గరకు తీసుకువస్తారు. బాయి గడ్డమీద చెట్టు క్రింద పందిరివేసి మట్టితో ఎడ్లను తయారుచేసి వీటికి కావలిగా ఒక గుర్రాన్ని ఉంచుతారు. పందిరికి మామిడితోరణం కట్టి పసుపు కుంకుమలతో అలంకరించి పందిట్ల దీపంతతో దీపం పెడతారు. కుండ పెంకులో జాజు కలిపి పశువుల కొమ్ములకు, పెయ్యి మీద ముద్రలు వేస్తారు. పానాదికి రెండు వైపుల మామిడి తోరణం కట్టి పశువులను దాని కింద నుంచి పోనిస్తారు. మైసమ్మ, పోతలింగానికి నైవేద్యం పెట్టి పశువుల కాపరులు భోజనం చేస్తారు. పశువులను మందగా మలిపి కుక్క వేషధారి పసుల చుట్టూ తిరుగుతూ గంతులేస్తాడు. పశువులు సల్లగుండాలని, అవి వ్యాధి బారిన పడవద్దని, పాడీ, పంట సమృద్ధిగా ఉండాలని పశువుల క్షేమం కొరకు చేసే ఈ పండుగను 'కాట్రావుల పండుగ' అంటారు.

4. **పచ్చుపొలి :** పంట చేతికి వచ్చే సమయంలో రైతులు పొలి చేస్తారు. పొలి చేయటమంటే బలి ఇవ్వటమే. చాకలి వాడు మంద దగ్గరికి వెళ్ళి రైతు బ్యారం చేసిన యాటను తీసుకొస్తాడు. బోనానికి బియ్యం, పసుపు, కుంకుమ, సున్నం బాయి దగ్గరికి తీసుకెళ్ళి మైసమ్మ గుడిని పసుపు కుంకుమలతో అలంకరించి, నైవేద్యం తయారు చేసి దేవునికి పెడతారు. యాటకు బొట్టువెట్టి, మైసమ్మకు కల్లుసాకవెట్టి, ధూపం వేసి పంట బాగా పండాలని మైసమ్మను వేడుకుంటారు.

యాట 'జడితి' ఇచ్చిన తర్వాత కొబ్బరికాయ కొట్టి మేకనుగానీ గొర్రెనుగానీ మైసమ్మకు బలి ఇస్తారు. కొంత రక్తాన్ని అన్నాన్ని కలిపి ఒక తట్టలో తీసుకొని 'సర్వు' కలుపుతారు. ఆ సర్వును పొలం చుట్టూ 'పులిగోరియా' అనుకుంటూ చల్లుతారు. ఈ రోజు కూడా పనివాటలోళ్ళు అయిన వడ్లకమ్మరి, మాదిగ, నీరడి, చాకలి, మంగలి, కుమ్మరి మొ॥గు వృత్తుల వాళ్ళు భోజనాలకు వస్తారు.

పశువులు రోగాల బారిన పడినప్పుడు కూడా రైతులు కొలుపుపెట్టి, సరనంబలి కాసి పశువుల దొడ్లముందు, పన్గడి ముందు పోస్తారు. పశువులు బాగుపడిన తర్వాత మైసమ్మ, మహంకాళమ్మకు, సారుగమ్మకు పండుగ చేస్తారు. దీనిని "ఊళ్లె చేసుడు" అంటారు. ఇది ఊరందరు రైతులకు సంబంధించిన సమిష్టి పండుగ.

వ్యవసాయం ఇప్పుడు పల్లెల్లో అందరికి ప్రధానవృత్తిగా మారింది. వ్యవసాయ పండుగలు జరుపుకోవటం చాలా తగ్గిపోయింది. కొత్తకొత్త వంగడాలు వచ్చాయి. వ్యవసాయ పద్ధతుల్లో మార్పులు కూడా వచ్చాయి. అయినా కొంతమంది రైతులు వారికున్న భక్తి, విశ్వాసాలతో కొన్నిచోట్ల వ్యవసాయ పండుగలు జరుపుకుంటున్నారు. వ్యవసాయ పండుగలు జరుపుకోవటం వలన గ్రామాల్లో పరస్పర సహకారం, అనుబంధం, ఒకరిపై మరొకరికి ప్రేమ, సమైక్యతా భావాలు పెంపొందుతాయనేది వాస్తవమైన విషయం. పరస్పర వస్తుమార్పిడి పద్ధతి వలన ఆహారకొరత లేకుండా అన్ని కులాల వాళ్ళు-వర్గాల వాళ్ళు ప్రశాంత జీవనం కొనసాగించే వీలును పల్లెటూళ్ళు కలిగించినాయి.

## ఆధునిక వ్యవసాయ పద్ధతులు

మెతుకుసీమ వ్యవసాయ ప్రధానమైన ప్రాంతం కావటం వలన వ్యవసాయదారులు ఆధునిక పద్ధతుల్లో వ్యవసాయాన్ని చేస్తున్నారు. ఇక్రిశాట్ వ్యవసాయ పరిశోధనా సంస్థ మెదక్‌జిల్లా పటాన్‌చెరువులో ఉంది. నూతనవంగడాల సృష్టి. సంకరవిత్తనాలను తయారుచేయుట, వివిధ వ్యాధులను, నీటిఎద్దడిని తట్టుకునే వంగడాల తయారీ వలన అధిక దిగుబడి, ఫలసాయం లభిస్తుంది. ఆధునిక వ్యవసాయంలో ట్రాక్టర్ ప్రధాన పాత్ర పోషిస్తుంది. పశువుల పాత్ర కొంతమేరకు తగ్గింది. మోటు, గూడ, ఏతం, గాడెం, రాటు వంటి వ్యవసాయ సాధనాల వాడుక తగ్గింది. అయిల్ ఇంజన్లు సర్‌పేస్ కరంటు మోటార్లు వినియోగం కొన్నాళ్ళు జరిగింది. భూగర్భ జలాలు అడుగంటినందువల్ల సబ్‌మెర్సిబుల్ మోటార్లు వచ్చినవి. పొలం దున్నటానికి ట్రాక్టర్, ఎరువేయటానికి ట్రాక్టర్, కలుపుతీసే పట్లర్, పొలం దున్నే టిల్లర్స్ క్రిమిసంహారక, రసాయనాలు వెదజల్లటానికి స్ప్రేయర్లు, దస్టర్లు, రసాయనిక ఎరువులు యూరియా, అమ్మోనియా ఫాస్పేట్, దుక్కిమందు వంటివి రావటం వలన పెట్టుబడి ఖర్చు పెరిగినా వ్యవసాయం సులభపద్ధతుల్లో సాగటమేకాక రాబడి పెరిగింది.

వాణిజ్య పంటలైన పత్తి, చెరుకు, అల్లం, మిర్చి, సోయాబీన్, పొద్దుతిరుగుడు వంటి ఆరుతడి పంటల ప్రాధాన్యం పెరిగింది. రాగులు, కొర్రలు, సజ్జలు, సాములు, పజ్జొన్న, ఉలవలు మొదలైన సాంప్రదాయ పంటలను పండించటానికి రైతులు సుముఖంగా లేరు. కారణం అవి మన రైతు ఆర్థిక స్థితిగతులను ఏ మాత్రం మెరుగు పర్చేవి కాకపోవటమే.

జిల్లాలో కరువు పరిస్థితుల వలన భూగర్భ జలాలు అడుగంటాయి. దౌల్తాబాద్, నంగునూర్, కొండపాక, జగదేవ్‌పూర్ మండలాల్లో నీరు పూర్తిగా అడుగంటిపోయింది. ఫలితంగా రైతులు బోరుబావులపై దృష్టి సారించారు. ఒక్కొక్క రైతు నాలుగైదు బోర్లు వేసినా వ్యవసాయానికి సరిపడే నీరు రాకపోవటం - దీనికి తోడు కరెంటు కోత, రైతులను పూర్తిగా కృంగదీస్తోంది.

అధిక లాభాలొస్తాయన్న ఆశతో రైతు పత్తివైపు మొగ్గు చూపటం వల్ల, వ్యాధి బారిన పడ్డ పత్తిచేనుకు మందులు కొట్టలేక, ఒకవేళ కొట్టినా మందులు పనిచేయక నకిలీ విత్తనాల వల్ల రైతు అప్పులపాలై ఆత్మహత్యల వైపు పయనిస్తున్నాడు.

వెనకటి వ్యవసాయంలో పెట్టుబడి తక్కువ. జీవన ఎరువుల వాడకం ఎక్కువ. రైతు ఇరువైనాలుగు గంటలు వ్యవసాయంపైనే దృష్టి నిల్పేవాడు. తనకు తోటి వాళ్ళకు ఉపయోగపడే పంటలు పండించేవాడు. అధిక దిగుబడి ఆశతో అప్పులు చేసేవాడు కాదు. ఫలితంగా ప్రశాంత జీవనానికి, ఆరోగ్యానికి ఆలంబనగా అప్పటి వ్యవసాయం ఉండేది. ఆధునిక వ్యవసాయం మాత్రం ఒక జూదంగా మారింది. మధ్యతరగతి, దిగువ శ్రేణి రైతులు వ్యవసాయరంగంలో అంతగా రాణించలేకపోతున్నారు.

కరువు, నీటి వనరుల కొరత, క్రిమిసంహారక మందుల అధిక ధర, ఎరువుల ధర అదుపులో లేకపోవటం, నకిలీ విత్తనాలు, నకిలీ మందులు, పండించిన పంటకు మద్దతు ధర లేకపోవటం వలన ఆధునిక వ్యవసాయం కొంతవరకు సంక్షోభానికి గురౌతున్నది.

శాస్త్రవేత్తలు, ప్రభుత్వాలు, వ్యవసాయరంగ నిపుణులు ఆధునిక వ్యవసాయాన్ని పునరుజ్జీవింపచేసి, రైతులకు తగు సూచనలు, సలహాలు ఇచ్చి కృషి చేయాల్సిన అవసరం ఉన్నది.



# గ్రంథాలయోద్యమం - ఆంధ్రమహాసభలు

ఎన్. భగవాన్‌రెడ్డి

హైదరాబాద్ సంస్థానంలోని ప్రజలు ఒకవైపు అత్యంత శక్తివంతమైన బ్రిటిష్ సామ్రాజ్యవాదం, మరోవైపు దాని నమ్మినబంటు అయిన నిజాం దాస్య శృంఖలాల్లో నలిగిపోతూ ఉండేవారు. ఉన్నత స్థాయిలో నిజాం ప్రభువు, కిందిస్థాయిలో గ్రామాల్లో జాగీర్దార్, దేశముఖ్‌ల నిరంకుశ పాలనలో ప్రజలు తల్లడిల్లినారు. రైతులపై భూస్వాముల దోపిడీ అధికమైంది. వెట్టిచాకిరీ అమల్లో ఉండేది, సంస్థానంలోని జనాభాలో సగానికిపైగా జనం తెలుగు భాష మాట్లాడేవారున్నా తెలుగును నిర్లక్ష్యం చేయటమేగాక హేళన భావం ఉండేది. ప్రజలకు కనీస పౌరహక్కులు లేకుండా పోయాయి. వివిధ రంగాల్లో హైదరాబాద్ సంస్థానం వెనకబడి ఉండేది. ఇదే సమయంలో భారతదేశంలో స్వాతంత్ర్యోద్యమం కొనసాగుతున్నది. ఆ ఉద్యమ ఛాయలు సంస్థానంలో పడకూడదని నిజాం జాగ్రత్త పడినాడు. కింది స్థాయిల్లో నమ్మినవారికి జాగీర్దార్లుగా, దేశ్‌ముఖ్‌లుగా ప్రజలపై అన్ని రకాల అధికారాలిచ్చారు. జిల్లాలో 267 జాగీరుగ్రామాలతో పాటు పాపన్నపేట, దుబ్బాక, దౌంతి సంస్థానాలుండేవి. న్యాయ, పాలన, పోలీసు అధికారా లుండేవి. ఈ క్రమంలో తెలంగాణ ప్రజల్లో విజ్ఞానం పెంపొందకుండా ప్రభుత్వం గస్తీ నిషాన్- 53 శాసనాన్ని తెచ్చింది. దాని ప్రకారం ప్రభుత్వ అనుమతిలేకుండా గ్రంథాలయం, పాఠశాల, వ్యాయామశాల, సంఘాలు, సమావేశాలు నిర్వహించరాదు. అందువల్ల గ్రంథాలయాలు ఏర్పాటు చేయడమనేది సాధారణ విషయం కాదు. ఇలాంటి పరిస్థితుల్లో మెదక్ జిల్లా గ్రంథాలయాల స్థాపన, ఆంధ్రమహాసభ సమావేశాలు జరిపి రాష్ట్రంలో తనవంతు పాత్రను నిర్వహించింది.

### గ్రంథాలయోద్యమం

1901లో హైదరాబాద్‌లో శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం స్థాపనతో గ్రంథాలయోద్యమం ప్రారంభమైంది. గ్రంథాలయోద్యమం వల్ల సామాన్య ప్రజల్లో సైతం ఒక రకమైన చైతన్యాన్ని తీసుకొని రావటమనేది ఒక ఆశయంగా ఉండేది. తెలంగాణలో మాతృభాషయైన తెలుగు భాషని ప్రచారం చేయటానికి, నిజాం నియంతృత్వ పాలనకు వ్యతిరేక భావనను ఏర్పరచటానికి బీజాలు వేశాయి గ్రంథాలయాలు. సామాజిక, రాజకీయ, సాంస్కృతికపరమైన చైతన్యాన్ని ఏర్పరచాలనే ఉద్దేశాలతో గ్రంథాలయాల స్థాపన ఒక ఉద్యమంలాగా చేపట్టారు. అందులో భాగంగానే మెదక్ జిల్లాలో గ్రంథాలయాల్ని ప్రారంభించారు. 1922లో సిద్ధిపేట పట్టణంలో మొదటిసారిగా 'ఉమామహేశ్వర ఆంధ్రభాషా నిలయం' అనే ప్రైవేట్ గ్రంథాలయాన్ని స్థాపించటంతో జిల్లాలో గ్రంథాలయోద్యమం మొదలైంది. జోగిపేటలో 1922లోనే 'జోగినాథాంధ్ర గ్రంథాలయం' నెలకొన్నది. ఆ తర్వాత సంగారెడ్డిలో, 1923లో 'ఆనంద గ్రంథాలయం', సదాశివపేటలో 'ఆంధ్ర విజ్ఞాన గ్రంథాలయం' ప్రారంభించారు. 1935లో శంకరంపేటలో 'శ్రీ రామచంద్ర సంస్కృతాంధ్ర గ్రంథాలయం' ఏర్పడింది. దీనికి బి.వి. రాజేశ్వర్ శర్మ కార్యదర్శిగా వ్యవహరించి యువకులు తీరిక వేళల్లోనైనా గ్రంథాలయాలకు హాజరుకావాలనీ, దాతలు విరాళాలకు ముందుకు రావాలన్నారు. సిద్ధిపేటలో ప్రారంభించిన ఉమామహేశ్వర గ్రంథాలయం రెండు సంవత్సరాలు పని చేసిన తర్వాత మూతపడ్డ దశలో కొర్తివాడ నాగభూషణం చొరవ తీసుకొని మళ్ళీ చురుగ్గా పనిచేసేలా చూశాడు. ఆ తర్వాత గ్రంథాలయోద్యమ ప్రచారంలో భాగంగా మాడపాటి హన్మంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, బూర్గుల రామకృష్ణా రావు, మందుముల రాంచందర్‌రావు తదితరులు సిద్ధిపేటకు వచ్చి గ్రంథాలయాన్ని సందర్శించారు.

మెదక్ యువకులు కృష్ణారావు, రాచేపల్లి మాణిక్యరావు లంకా రామకృష్ణశర్మ తదితరులు ప్రథమాంధ్ర మహాసభలకు వెళ్ళి వచ్చిన తర్వాత మెదక్‌లో 'శ్రీ కృష్ణాంధ్ర గ్రంథాలయా'న్ని ఏర్పాటు చేశారు. అందోల్ తాలుకా చౌటకూర్‌లో "లక్ష్మీనరసింహ గ్రంథాలయం" డాకూరులో "సచ్చిదానంద గ్రంథాలయం", రామంచలో "జైహింద్ గ్రంథాలయం", కళ్ళెంపేటలో "ఆంజనేయాంధ్ర గ్రంథాలయం" లాంటి గ్రంథాలయాలు జిల్లాలో నెలకొల్పడం జరిగింది.

సుల్గంటి శివప్ప జోగిపేటలో "జోగినాథాంధ్ర గ్రంథాలయం"ను ప్రారంభించగా, దీని నిర్వహణ కోసం ఆంధ్రజన సంఘ నాయకుల సూచనల మేరకు స్థానిక వైశ్యులు ఉత్సాహం కనబర్చినారు. జైమిని భూమయ్య బాల భక్త సమాజాన్ని స్థాపించి యువకుల్ని

చైతన్యపర్చి గ్రంథాలయానికి వచ్చేలా చేశారు. జోగినాథాంధ్ర గ్రంథాలయానికి అనుబంధంగా వయోజనుల విద్య కొరకు రాత్రి పాఠశాల సైతం నిర్వహించబడింది. ఈ గ్రంథాలయాలు నాటి రోజుల్లో వార్తా పత్రికలు, ఇతర మేగజైన్లకే పరిమితం కాకుండా వార్షికోత్సవాలు, సభలు, సమావేశాలు జరపడంతో తెలంగాణా ప్రజల్లో ఏదో విధంగా రాజకీయ చైతన్యం కల్గించే కేంద్రాలుగా ఉపయోగపడ్డాయి. నిజాం రాష్ట్రంలో గ్రంథాలయోద్యమం నిర్వహించిన పాత్రలో మెదక్ జిల్లా తనవంతు కర్తవ్యాన్ని నిర్వహించింది. అంతేగాక సామాన్య ప్రజలకు సైతం పుస్తకాలు తక్కువ ధరకు అందుబాటులో ఉండాలనే ఉద్దేశ్యంతో పుస్తక ప్రచురుణల కోసం 'అణాగ్రంథమాల' ఏర్పాటు చేసి ఏ పుస్తకమైన అణాకే లభ్యమయ్యేలా చూశారు. అలాంటి అణాగ్రంథమాల స్థాపన, నిర్వహణలో పాలుపంచుకున్న వెల్దుర్తి మాణిక్యరావు మెదక్ జిల్లాకు చెందినవాడే. జిల్లాలో గ్రంథాలయాల ఏర్పాటు సాంస్కృతిక చైతన్యాన్ని తీసుకురావటానికి ఎంతగానో ఉపయోగపడినప్పటికీ చాలా కాలం వరకు, అంటే నేటి వరకు ఆనాటి గ్రంథాలయం అవశేషాలు, చరిత్ర నిలబెట్టిన గ్రంథాలయమేదీ లేకపోవడం ఒక లోపంగానే చెప్పవచ్చు.

**ఆంధ్రమహాసభ**

హైద్రాబాద్ రాష్ట్రంలో సామాన్య ప్రజలు దోపిడీ, పీడనలు, వెట్టిచాకిరీల కింద నలిగిపోతుండగా అధిక సంఖ్యాక ప్రజలు మాట్లాడే తెలుగు భాష నిర్లక్ష్యానికి గురికాబడింది. ఈ పరిస్థితుల నేపథ్యంలో భాషా సాంస్కృతికోద్యమంలో భాగంగా గ్రంథాలయోద్యమం, ఆంధ్ర జనసంఘం పుట్టుకొచ్చాయి. ఆంధ్ర జనసంఘమే ఆంధ్ర మహాసభగా అవతరించినది.

1922 నవంబర్ 11,12 తేదీల్లో హైద్రబాద్ పట్టణంలో 'నిజాం రాష్ట్ర సంస్కరణ మహాసభ' సమావేశమైంది. ఈ సమావేశంలో న్యాయవాది ఆలంపల్లి వెంకట రామారావు ఒక తీర్మానంపైన తెలుగులో ఉపన్యసిస్తుండగా సభలోని వారు చప్పట్లు కొట్టి అవమానిస్తూ ఆపివేశారు. తెలుగువారు ఎక్కువగానున్న తెలంగాణ ప్రధాన నగరంలో తెలుగులో మాట్లాడటాన్ని అవహేళన చేయడం పలువుర్ని ఆవేదనకు గురి చేసి ఆలోచింపజేసింది.

ఆనాటి రాత్రి ఆంధ్రోద్యమమును కొనసాగించే ఉద్దేశ్యంతో నిజాం రాష్ట్ర 'ఆంధ్ర జనసంఘం'ను ఏర్పాటు చేశారు. ఈ సంఘం పాఠశాలల్ని, గ్రంథాలయాల్ని స్థాపించుట, తెలుగు భాష (ఆంధ్రభాష) ప్రచారం తదితర ఆంధ్ర భాషా సంస్కృతికి పరిమితమైన కార్యక్రమాలు చేపట్టినది. రాష్ట్రంలోని తెలుగు సంస్థల అభివృద్ధికి ఈ



కేంద్ర సంఘం ప్రచారకులను పంపించి తోడ్పడుచుండేది. ఈ కాలంలో ఈ సంఘం "వెట్టి చాకిరి" "వర్తక సంఘం" అని ముఖ్యమైన రెండు కరపత్రాలను ప్రచురించింది. వెట్టిచాకిరి ప్రభుత్వనిబంధనలకు వ్యతిరేకమన్న చైతన్యం ప్రజల్లో కల్గించింది. సర్‌బరాహిని వ్యతిరేకించడం కోసం ఆంధ్ర జనకేంద్ర సంఘం వర్తక సంఘాల్ని ఏర్పాటు చేసింది. తెలుగు భాషా సంస్కృతుల పునరుజ్జీవనం కోసం, ఫ్యూడల్ దురంతాలకు వ్యతిరేకంగా చెదురుముదురుగా సాగుతున్న ఉద్యమాల వాగులన్నీ ఆంధ్రజనకేంద్ర సంఘం ఆధ్వర్యంలో మహానదిలా ఏర్పడాలనుకున్నాయి.

**1930 ప్రథమాంధ్ర మహాసభ - జోగిపేట**

నిజాం రాష్ట్రాంధ్రుల కష్టసుఖాలను తెల్సుకొనుటకు వారి సమిష్టి అభిప్రాయాలను నిర్మించుటకు మహాసభ ఒకటి అవసరమనే భావం ప్రచారమవుతూ వచ్చింది. ఫలితంగా గ్రామవాసులకు ఇతర ప్రాంతాల్లో ఏమిజరుగుతుందో తెలియని పరిస్థితుల్లో తెలంగాణా వాసులయిన ఆంధ్రులందరి సమిష్టి కోరికల్ని ప్రకటించుటకు వారి వేర్వేరు ప్రయత్నాలను కేంద్రీకరించుటకు చేయబడిన కృషివల్ల ఆంధ్రమహాసభ ఏర్పడింది. 1930 మార్చి 3,4,5 తేదీల్లో సురవరం ప్రతాపరెడ్డి అధ్యక్షతన మెదక్‌జిల్లా జోగిపేటలో ప్రథమాంధ్ర మహాసభ జరిగింది. ఈ సమావేశంలో 'ఆంధ్ర జనకేంద్రం' అనే పేరు 'ఆంధ్ర మహాసభ'గా మార్చబడింది. ప్రథమాంధ్ర మహాసభ జోగిపేటలో జరగటానికి జోగిపేట వర్తక సంఘం యొక్క ఉత్సాహం, దానికి వామన్ నాయక్ ప్రోత్సాహం ప్రధాన కారణాలయ్యాయి. ఆంధ్రోద్యమ తొలిరోజుల్లో వర్తక సంఘాలు అనేక ప్రాంతాల్లో ఏర్పడటమేకాక అవి ఉద్యమ కార్యక్రమ నిర్వహణలో ప్రముఖ పాత్ర వహించాయి. వర్తక విధానం పెంపుదలకు ఫ్యూడల్ - భూస్వామ్య విధానం అడ్డుతగులుతున్నందున ఫ్యూడల్ విధానాన్ని ప్రతిఘటించడం నాటి వర్తక సంఘాలకు తప్పని సరైంది. మహారాష్ట్రకు చెందిన వామన్ జాగీర్దారే కాక మెదక్‌లో ఈయనకు రైస్‌మిల్ ఉండటంచేత జోగిపేట, సదాశివపేట వర్తకులతో సంబంధాలు ఉండేవి. ఈ కారణాల వలన ప్రథమ ఆంధ్రమహాసభలు మెదక్ జిల్లాలో జరుపుటకు నిర్ణయించారు. సూర్యాపేట వర్తక సంఘం ఆధ్వర్యంలో గతంలో ఆంధ్ర జనకేంద్ర సంఘం సభలు జరిపినందున ఈసారి జోగిపేట వర్తకులు ముందుకు వచ్చారు. దాంతో జోగిపేటలో మొదటి ఆంధ్ర మహాసభ జరగటం అది నైజాం వ్యతిరేక పోరాటానికి నాయకత్వం వహించడం వలన తెలంగాణ చరిత్రలో మెదక్ జిల్లా జోగిపేట ఒక మైలు రాయిగా నిలిచింది. ఈ మహాసభలో రావినారాయణరెడ్డి, ఆరుట్ల రాంచంద్రారెడ్డి, మందుముల రాంచందర్‌రావు, మాడపాటి హన్మంతరావు తదితర రాష్ట్ర నాయకులు హాజరైనారు. కాగా టేక్మాల్ అనంత వెంకట్రావు, గోపాల్ వెంకట్రావు,

రాంచంద్రారెడ్డి, నారాయణ రెడ్డి, దత్తానారాయణ, బచ్చు వెంకటేశ్వర గుప్త, వామన్ నాయక్, బసవమాణయ్య తదితర స్థానిక జిల్లా నాయకులు నిర్వహణ బాధ్యతలు చూసుకున్నారు.

ఈ మహాసభలో పౌరహక్కులు, విద్యా విషయక సాంస్కృతిక విషయాలతో పాటు పాలన వ్యవహారాలు తెలుగు భాషలో జరగాలనీ, రైతు సంఘాల నిర్మాణం, వెట్టి చాకిరి, బాల్య, వితంతు వివాహాల వంటి సంఘసంస్కరణలపై మొత్తం 32 తీర్మానాలు ఆమోదించడం జరిగింది. ఆంధ్ర మహాసభ రాజకీయ వేదికగా మారే వరకు సంస్కరణ మరియు వైజ్ఞానిక ఉద్యమంగా కొనసాగింది. అయితే రాజకీయ హక్కులు ఏ కోశానలేని ఆ రోజుల్లో మహాసభ నాయకులు తమకు రాజకీయాలతో సంబంధం లేదని చెప్పుకున్నా అప్పటికున్న చట్టాలకు లోబడి అతికష్టం మీద సభను నిర్వహిస్తూ ఉన్నా అసలు ఆంధ్రోద్యమ పుట్టుకలోనే గల రాజకీయ ప్రాముఖ్యాన్ని మరువరాదు.

### ఆంధ్ర మహిళాసభ

జోగిపేటలో జరిగిన ఆంధ్రమహాసభలకు అనుబంధంగా జోగిపేటలో ఆంధ్ర మహిళా సభ సమావేశం జరిగింది. ఈ మహిళా సభల్లో నడింపల్లి సుందరమ్మ మరియు చంద్రమతీదేవి ముఖ్య అతిథులుగా సందేశాలివ్వగా విఠోబాయి అధ్యక్షత వహించింది. బాల్యవివాహాలు, మహిళా స్థితిగతులు, వ్యభిచారం, దోపిడీ తదితర మహిళా సమస్యలపై చర్చించి తీర్మానాలు చేశారు.

జోగిపేటలో జరిగిన ఈ సభలు మంచి ఆరంభాన్ని ఇవ్వగా జిల్లాలో చాలామందిలో చైతన్యాన్ని నింపి గ్రంథాలయాల స్థాపనకు, జిల్లా ఆంధ్రమహాసభల్లో కమిటీల్లో పని చేసేలా చేశాయి. క్రమేణా సామాన్య ప్రజల్ని సైతం సమీకరించి చైతన్యం చేసే దిశగా మహాసభల కార్యక్రమాలు కొనసాగి 6వ ఆంధ్రమహాసభ సమావేశంలో రాజకీయ కార్యక్రమాల్ని చేపట్టే తీర్మానాలు చేయటంతో సభల తీరే మారింది.

### మెదక్ జిల్లా ప్రథమాంధ్ర మహాసభ - జోగిపేట (1939)

భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వం 1935 భారత ప్రభుత్వ చట్టం అమలుపర్చింది. అనేక రాష్ట్రాల్లో కాంగ్రెస్ ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. ఈ పరిస్థితుల్లో నిజాం నవాబు కూడ కొన్ని పట్టువిడుపు ధోరణులు పాటించక తప్పలేదు. అందులో భాగంగా సభల పట్ల కొంత ఉదాసీన వైఖరి అవలంభించక తప్పలేదు. ఈ క్రమంలో 1937 నిజామాబాద్‌లో మందుముల నర్సింగరావు అధ్యక్షతన జరిగిన ఆరవ ఆంధ్ర మహాసభలో మొదటిసారి బహిరంగంగా రాజకీయ తీర్మానం జరిగింది. జిల్లాల్లో కాలమాన స్థితిగతులననుసరించి అచ్చటి ప్రజల జీవితాల్లో ప్రత్యేక పరిస్థితులు ఏర్పడుతాయి. అలాంటి సందర్భాల్లోని సమస్యలన్నిటికి మహాసభ వారే పూనుకోవటం కష్టసాధ్యమైనందున ప్రతి జిల్లా యందు స్థానిక ప్రముఖులతో కూడిన జిల్లా సంఘాలు ఏర్పాటు చేయడమైంది. ఫలితంగా మెదక్ జిల్లాలో కూడా జిల్లా సంఘ సమావేశం ఏర్పాటుకు కృషి జరిగింది.

1939 సెప్టెంబర్‌లో జోగిపేటలోనే మెదక్ జిల్లా మొదటి ఆంధ్రమహాసభ సమావేశం బచ్చు వెంకటేశ్వర గుప్త అధ్యక్షతన జరిగింది.

ఈ సభలకు రావినారాయణరెడ్డి, మందుముల రాంచందర్‌రావు, ఎన్.కె.రావు తదితర నాయకులు హైద్రాబాద్ నుండి వచ్చి ఆంధ్రమహాసభల ఆదర్శాలు, ఉద్దేశాలు వివరించారు. మెదక్ జిల్లా సభకు కంది కిషన్‌రావు, ముబారకుపురం నారాయణరెడ్డి, వెంకటేశ్వర గుప్త, జయరాంరెడ్డి, శ్రీపతిరావు తదితర జిల్లా నాయకులు సభా కార్యక్రమాలు నిర్వహించారు. ఈ సభల్లో 16 తీర్మానాలు చేయడం జరిగింది. వీటిలో స్త్రీలవిద్య, నిర్బంధ ప్రారంభ విద్యల పట్ల శ్రద్ధ వహించాలనీ, మనది వ్యవసాయ సమాజమైనందున కరువు నివారణ చర్యలతోపాటు రైతుసహాయక చర్యలు చేపట్టాలనీ, రైతులు రైతు సంఘాలు ఏర్పరచాలనీ, గ్రంథాలయాల్ని ఏర్పరచి విజ్ఞానాన్ని ప్రచారం చేయాలనీ తీర్మానించారు. బాధ్యతాయుత ప్రజాపరిపాలన కోసం రాజ్యాంగ సంస్కరణలు చేయాలనీ, మాతృభాష తెలుగును పరిపాలన రంగంలో అమలు చేయాలనీ, స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధం ఎత్తివేయాలన్న అంశాలతో పాటు మద్యపాన నిరోధం, ఖద్దర్ పరిశ్రమ, ప్రభుత్వశాఖల్లో అవినీతి, వెట్టిచాకిరీ, అంటరానితనం లాంటి అంశాలపై చర్చించి తీర్మానాలు చేశారు.

ఈ కార్యక్రమాల అమలు కోసం తాలుకా, జిల్లా స్థాయి కార్యవర్గాలను ఎన్నుకున్నారు. ఈ సమావేశంలో మద్యపాన నిరోధక కేంద్ర సంఘ ప్రచారకులగు వెల్దుర్తి మాణిక్యరావు మద్యపానంచే కలుగు కష్టనష్టాల్ని వివరించారు. ఫలితంగా ఆ తర్వాత కొత్తపల్లి, శంకరంపేటల్లో మద్యపాన నిషేధ సంఘాలు ఏర్పరచినారు. సిద్దిపేట తాలూకా జాలపల్లి గ్రామంలో కొందరు రైతులు మద్యపానం చేయమని ప్రమాణం చేశారు.

ఈ సభలో జిల్లా కార్యవర్గం అధ్యక్షులుగా బచ్చు వెంకటేశ్వర గుప్త, ఉపాధ్యక్షులుగా కంది శ్రీనివాసరావు, కార్యదర్శిగా జి. రాంరెడ్డి, సహాయ కార్యదర్శిగా పర్శరాం సింగ్‌లు ఎన్నికైనారు. జిల్లా సంఘాల స్థాపనతో గ్రంథాలయాల, మహాసభల కార్యక్రమాల నిర్వహణ అధికమైనందున కొంతమేరకైనా ప్రజల్ని చైతన్య పర్చగల్గినారు. మితవాద నాయకత్వ హద్దుల మేరకైనా కార్యక్రమాలు చేపట్టారు.

రాంచంద్రారెడ్డి, నారాయణ రెడ్డి, దత్తానారాయణ, బచ్చు వెంకటేశ్వర గుప్త, వామన్ నాయక్, బసవమాణయ్య తదితర స్థానిక జిల్లా నాయకులు నిర్వహణ బాధ్యతలు చూసుకున్నారు.

ఈ మహాసభలో పౌరహక్కులు, విద్యా విషయక సాంస్కృతిక విషయాలతో పాటు పాలన వ్యవహారాలు తెలుగు భాషలో జరగాలనీ, రైతు సంఘాల నిర్మాణం, వెట్టి చాకిరి, బాల్య, వితంతు వివాహాల వంటి సంఘసంస్కరణలపై మొత్తం 32 తీర్మానాలు ఆమోదించడం జరిగింది. ఆంధ్ర మహాసభ రాజకీయ వేదికగా మారే వరకు సంస్కరణ మరియు వైజ్ఞానిక ఉద్యమంగా కొనసాగింది. అయితే రాజకీయ హక్కులు ఏ కోశానలేని ఆ రోజుల్లో మహాసభ నాయకులు తమకు రాజకీయాలతో సంబంధం లేదని చెప్పుకున్నా అప్పటికున్న చట్టాలకు లోబడి అతికష్టం మీద సభను నిర్వహిస్తూ ఉన్నా అసలు ఆంధ్రోద్యమ పుట్టుకలోనే గల రాజకీయ ప్రాముఖ్యాన్ని మరువరాదు.

### ఆంధ్ర మహిళాసభ

జోగిపేటలో జరిగిన ఆంధ్రమహాసభలకు అనుబంధంగా జోగిపేటలో ఆంధ్ర మహిళా సభ సమావేశం జరిగింది. ఈ మహిళా సభల్లో నడింపల్లి సుందరమ్మ మరియు చంద్రమతీదేవి ముఖ్య అతిథులుగా సందేశాలివ్వగా విఠోబాయి అధ్యక్షత వహించింది. బాల్యవివాహాలు, మహిళా స్థితిగతులు, వ్యభిచారం, దోపిడీ తదితర మహిళా సమస్యలపై చర్చించి తీర్మానాలు చేశారు.

జోగిపేటలో జరిగిన ఈ సభలు మంచి ఆరంభాన్ని ఇవ్వగా జిల్లాలో చాలామందిలో చైతన్యాన్ని నింపి గ్రంథాలయాల స్థాపనకు, జిల్లా ఆంధ్రమహాసభల్లో కమిటీల్లో పని చేసేలా చేశాయి. క్రమేణా సామాన్య ప్రజల్ని సైతం సమీకరించి చైతన్యం చేసే దిశగా మహాసభల కార్యక్రమాలు కొనసాగి 6వ ఆంధ్రమహాసభ సమావేశంలో రాజకీయ కార్యక్రమాల్ని చేపట్టే తీర్మానాలు చేయటంతో సభల తీరే మారింది.

### మెదక్ జిల్లా ప్రథమాంధ్ర మహాసభ – జోగిపేట (1939)

భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వం 1935 భారత ప్రభుత్వ చట్టం అమలుపర్చింది. అనేక రాష్ట్రాల్లో కాంగ్రెస్ ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. ఈ పరిస్థితుల్లో నిజాం నవాబు కూడ కొన్ని పట్టువిడుపు ధోరణులు పాటించక తప్పలేదు. అందులో భాగంగా సభల పట్ల కొంత ఉదాసీన వైఖరి అవలంభించక తప్పలేదు. ఈ క్రమంలో 1937 నిజామాబాద్‌లో మందుముల నర్సింగరావు అధ్యక్షతన జరిగిన ఆరవ ఆంధ్ర మహాసభలో మొదటిసారి బహిరంగంగా రాజకీయ తీర్మానం జరిగింది. జిల్లాల్లో కాలమాన స్థితిగతులననుసరించి అచ్చటి ప్రజల జీవితాల్లో ప్రత్యేక పరిస్థితులు



ఏర్పడుతాయి. అలాంటి సందర్భాల్లోని సమస్యలన్నిటికి మహాసభ వారే పూనుకోవటం కష్టసాధ్యమైనందున ప్రతి జిల్లా యందు స్థానిక ప్రముఖులతో కూడిన జిల్లా సంఘాలు ఏర్పాటు చేయడమైంది. ఫలితంగా మెదక్ జిల్లాలో కూడా జిల్లా సంఘ సమావేశం ఏర్పాటుకు కృషి జరిగింది.

1939 సెప్టెంబర్‌లో జోగిపేటలోనే మెదక్ జిల్లా మొదటి ఆంధ్రమహాసభ సమావేశం బచ్చు వెంకటేశ్వర గుప్త అధ్యక్షతన జరిగింది.

ఈ సభలకు రావినారాయణరెడ్డి, మందుముల రాంచందర్‌రావు, ఎన్.కె.రావు తదితర నాయకులు హైద్రాబాద్ నుండి వచ్చి ఆంధ్రమహాసభల ఆదర్శాలు, ఉద్దేశాలు వివరించారు. మెదక్ జిల్లా సభకు కంది కిషన్‌రావు, ముబారకుపురం నారాయణరెడ్డి, వెంకటేశ్వర గుప్త, జయరాంరెడ్డి, శ్రీపతిరావు తదితర జిల్లా నాయకులు సభా కార్యక్రమాలు నిర్వహించారు. ఈ సభల్లో 16 తీర్మానాలు చేయడం జరిగింది. వీటిలో స్త్రీలవిద్య, నిర్బంధ ప్రారంభ విద్యల పట్ల శ్రద్ధ వహించాలనీ, మనది వ్యవసాయ సమాజమైనందున కరువు నివారణ చర్యలతోపాటు రైతుసహాయక చర్యలు చేపట్టాలనీ, రైతులు రైతు సంఘాలు ఏర్పరచాలనీ, గ్రంథాలయాల్ని ఏర్పరచి విజ్ఞానాన్ని ప్రచారం చేయాలనీ తీర్మానించారు. బాధ్యతాయుత ప్రజాపరిపాలన కోసం రాజ్యాంగ సంస్కరణలు చేయాలనీ, మాతృభాష తెలుగును పరిపాలన రంగంలో అమలు చేయాలనీ, స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధం ఎత్తివేయాలన్న అంశాలతో పాటు మద్యపాన నిరోధం, ఖద్దర్ పరిశ్రమ, ప్రభుత్వశాఖల్లో అవినీతి, వెట్టిచాకిరీ, అంటరానితనం లాంటి అంశాలపై చర్చించి తీర్మానాలు చేశారు.

ఈ కార్యక్రమాల అమలు కోసం తాలుకా, జిల్లా స్థాయి కార్యవర్గాలను ఎన్నుకున్నారు. ఈ సమావేశంలో మద్యపాన నిరోధక కేంద్ర సంఘ ప్రచారకులగు వెల్దుర్తి మాణిక్యరావు మద్యపానంచే కలుగు కష్టనష్టాల్ని వివరించారు. ఫలితంగా ఆ తర్వాత కొత్తపల్లి, శంకరంపేటల్లో మద్యపాన నిషేధ సంఘాలు ఏర్పరచినారు. సిద్దిపేట తాలూకా జాలపల్లి గ్రామంలో కొందరు రైతులు మద్యపానం చేయమని ప్రమాణం చేశారు.

ఈ సభలో జిల్లా కార్యవర్గం అధ్యక్షులుగా బచ్చు వెంకటేశ్వర గుప్త, ఉపాధ్యక్షులుగా కంది శ్రీనివాసరావు, కార్యదర్శిగా జి. రాంరెడ్డి, సహాయ కార్యదర్శిగా పర్శరాం సింగ్‌లు ఎన్నికైనారు. జిల్లా సంఘాల స్థాపనతో గ్రంథాలయాల, మహాసభల కార్యక్రమాల నిర్వహణ అధికమైనందున కొంతమేరకైనా ప్రజల్ని చైతన్య పర్చగల్గినారు. మితవాద నాయకత్వ హద్దుల మేరకైనా కార్యక్రమాలు చేపట్టారు.

### జిల్లా రెండవ మహాసభ : సదాశివపేట

ఆంధ్ర మహాసభ జిల్లా కార్యవర్గం 1943 వరకు ఆయా ప్రాంతాల్లో జరిగే ఆంధ్ర మహాసభలకు హాజరు కావడం, జిల్లాలో గ్రంథాలయాల్ని సందర్శిస్తూ వాటి నిర్వహణను తెలుసుకోవడం, ఆంధ్రోద్యమము గూర్చి వివరించడం, గ్రంథాలయాల తరపున వయోజన రాత్రి పాఠశాలల్ని నిర్వహించడం వంటి కార్యక్రమాలు చేపట్టారు. ఈ క్రమంలో 1943 ఆగష్టులో మెదక్ జిల్లా ఆంధ్రమహాసభ రెండో సభలు కంది శ్రీనివాసరావు అధ్యక్షతన సదాశివపేటలో జరిగాయి. ఈ సమావేశాల్లో రాజకీయ నిర్బంధితులను వెంటనే విడిచిపెట్టాలని ఈ సమావేశంలో తీర్మానించారు. పటేల్, పట్వారీల జీతాలు చాలా తక్కువగా ఉన్నందున వాటిని పెంచాలన్నారు. జిల్లా సమస్యల్ని చర్చించడంలో భాగంగా రాష్ట్రంలోని అన్ని జిల్లాల కన్నా మెదక్ మండలంలో ఎక్కువ తరిధారాలు ఉన్నందున శిస్తులు తగ్గించాలని అందుకుగాను ఒక కమిటీని ఏర్పరచారు. ఈ సభలో మహిళలు పాల్గొననందున ఇంకా ఉద్యమంలోకి రాలేకపోయారు. బ్రిటిష్ ఇండియాలో క్విట్ ఇండియా ఉద్యమం స్టేట్ కాంగ్రెసు, కమ్యూనిస్టుల కార్యక్రమాల్ని ప్రభావితం చేశాయి. ఆంధ్ర మహాసభలో వామపక్ష భావాలు గల అతివాదులు, మితవాదులు జాతీయ పక్షమని రెండు గ్రూపులుగా ఏర్పడ్డాయి. అందువల్ల మెదక్ జిల్లా రెండో ఆంధ్ర మహాసభలో ఒక స్పష్టమైన ఉద్యమ కార్యక్రమాన్ని రూపొందించుకోలేదు. 1944లో పదకొండో మహాసభ భువనగిరిలో రావి నారాయణరెడ్డి అధ్యక్షతన జరిగింది. ఈ సభలో ఆంధ్ర మహాసభ రెండుగా చీలిపోయింది. 12వ మహాసభలు విడివిడిగానే జరుపు కున్నారు. మెదక్ జిల్లాలోని నాయకత్వం జాతీయ పక్షమునకు నాయకత్వం వహించడంతో చివరిదైన 'పదమూడవ ఆంధ్రమహాసభ' మెదక్ జిల్లా కంది గ్రామంలో జరిగింది.

### చివరి పదమూడవ ఆంధ్రమహాసభ - కంది

భారత స్వాతంత్ర్యోద్యమ చివరిదశలో 13వ ఆంధ్ర మహాసభ 1946, మే 10,11 తేదీల్లో మెదక్ జిల్లా కంది గ్రామంలో జరిగింది. ఆహ్వానసంఘ అధ్యక్షులైన బచ్చు వెంకటేశ్వర గుప్త భారత మరియు రాష్ట్ర రాజకీయాలు, ఆహార సమస్య, హిందూ-ముస్లిం ఐక్యత, కంట్రోల్ విధానము మొదలైన విషయాలపై ప్రసంగించారు. చివరగా 'కమ్యూనిస్టుల సిద్ధాంతాలు, మన సిద్ధాంతాలకు చాలా వ్యతిరేకమైనవి, అదృష్టంపై నమ్మకం లేదు. ఆస్తులన్నీ ప్రభుత్వానికే అప్పగించవలెను' అని మాట్లాడిన తీరు వారి మితవాద నాయకత్వాన్ని సూచిస్తుంది. అందుకే ఆంధ్ర మహాసభ మెదక్ నాయకత్వం జాతీయ పక్షవాదుల వైపు నిలిచినట్లు, కంది మహాసభకు నాయకత్వం వహించినట్లు అర్థమవుతుంది. ఈ చివరి మహాసభకు అధ్యక్షత వహించిన జమలాపురం కేశవరావు అంతర్జాతీయ, జాతీయ రాజకీయాలను, సంస్థాన సమస్యలను వాటి వల్ల హైద్రాబాద్ రాజ్య విధానం, రాష్ట్ర ప్రజల పౌరహక్కులు, రైతుల సమస్యలు మరియు బాధ్యతాయుత ప్రభుత్వం మొదలైన విషయాలను గూర్చి వివరించారు. కేశవరావు నిర్మాణ కార్యక్రమంతో పాటు ఆందోళన కార్యక్రమం కావాలన్నారు. ఈ వాఖ్యల వల్ల, మాదిరాజు స్వీయ చరిత్రలోని వాఖ్యల వల్ల పోటీ ఆంధ్ర మహాసభలో జాతీయపక్షంలోని మితవాదుల్ని వెనక్కినెట్టి అతివాదులే పై చేయి సాధించినట్లు తెలుస్తుంది.

ఈ మహాసభ జరిగిన కొద్ది రోజులకే స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధం తొలగినందున జాతీయ పక్షానికి చెందిన పోటీ మహాసభ అందులో కల్సిపోయింది. కమ్యూనిస్టుల అధ్వర్యంలోని మహాసభ కమ్యూనిస్టు పార్టీలో కల్సిపోయి ప్రజా పోరాటాలకు నాయకత్వం వహించి సామాన్య ప్రజల్లో 'సంఘం'గా పేరొందింది. దీంతో ఆంధ్ర మహాసభ అనేది రద్దు అయింది.

ప్రథమాంధ్ర మహాసభ, చివరి 13వ ఆంధ్ర మహాసభ రెండూ యాదృచ్ఛికంగా మెదక్ జిల్లాలో జరిగినవే. ఆంధ్ర మహాసభగా అవతరణ చెందిన ఆంధ్ర జనసంఘం కూడా మెదక్ జిల్లాకు చెందిన టేక్మాల్ వాసియైన రంగారావు గారింట్లో జరగడం విశేషంగానే చెప్పవచ్చు. మొత్తం మీద మెదక్ జిల్లాలో ప్రథమ, చివరి ఆంధ్ర మహాసభ సమావేశాలు మరియు రెండు జిల్లా సమావేశాలు జరిగినప్పటికీ వరంగల్, నల్గొండ జిల్లాల్లో జరిగిన ప్రజా పోరాటాలు, ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాలు అంతగా ఇక్కడ జరగలేదు. దానికి కారణం ఆంధ్ర మహాసభ నాయకత్వం నల్గొండ, వరంగల్ జిల్లాల ప్రజలకు స్పష్టమైన పోరాట కార్యక్రమాన్ని అందించే సరైన మార్గదర్శకత్వం ఇచ్చినట్లుగా మెదక్‌లో అందివ్వలేకపోయింది. మెదక్ జిల్లాలో నాయకత్వం వహించిన వారు ఎక్కువగా ఉన్నత కుటుంబాలకు చెందిన లాయర్లు, వర్తక సంఘాలకు చెందిన వారు కావడం, పరిమితమైన వారి మితవాద నాయకత్వమే కారణమైంది. ఐనప్పటికీ సరిహద్దు జిల్లాలైన కరీంనగర్, నల్గొండ, వరంగల్ జిల్లాల్లో కమ్యూనిస్టుల నాయకత్వాన జరిగిన 'సంగం' పోరాటాల ప్రభావం మెదక్ జిల్లాలో పడింది. సిద్ధిపేట, గజ్వేల్, నంగునూరు, జగదేవ్‌పూర్, కొండపాక మండలాల్లో కన్పిస్తుంది.

ఏమైనప్పటికీ నైజాం వ్యతిరేక పోరాటంలో ఆంధ్రమహాసభ ప్రారంభానికి మెదక్ జిల్లా పునాదులు వేసిందనవచ్చు.. చరిత్రలో తనవంతు బాధ్యతను నిర్వహించింది.



# మెదక్ జిల్లా రాజకీయ రంగం

ఎన్. భగవాన్ రెడ్డి

మెతుకుసీమ రాజకీయ క్షేత్రానిదొక ప్రత్యేకత. శాతవాహనుల కాలంలో కొండాపూర్ దక్షిణాపథం 'తక్షశిల'గా నిలవగా రెడ్డి రాజుల ఏలుబడిలో అందోలు, రాచవీడు (మెదక్)లు రాజధానులుగా నిలిచాయి. నిజాం రాచరిక పాలనలో మెదక్ సుబాగా పరిపాలించబడింది. అదే నిజాం నిరంకుశ దోపిడీ, పీడనల పాలనపై తిరుగుబాటు చైతన్యపు ఎజెండాగా అవతరించిన ఆంధ్ర మహాసభకు జోగిపేట వేదికనిచ్చింది. దోపిడీ, వివక్షతల్ని నిరసిస్తూ సాహిత్య, కార్మిక, రాజకీయ రంగాల్లో సాంస్కృతిక చైతన్యాన్ని రగిలిస్తూ వేగుచుక్కల్లా వెలిగిన ఎందరికో జన్మనిచ్చిన సీమ ఇది.

ఆనాటి ఆంధ్ర మహాసభతో మొదలైన వివిధ రాజకీయ పార్టీల కార్యకలాపాలు నేటి ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర నినాదం వరకు ఎన్నో పార్టీలు వాటి కార్యాచరణ విధానాలతో జిల్లాను ప్రభావితం చేశాయి. అలాంటి జిల్లాలోని ప్రభావిత రాజకీయాల్ని సంక్షిప్తంగానైనా విశ్లేషించటమే ఈ వ్యాసంలోని ప్రధానాంశాలు.

**నిజాం నిరంకుశ వ్యతిరేకోద్యమాలు – ఆంధ్రమహాసభ – పరోక్ష రాజకీయాలు**

రాజకీయ, పౌరహక్కులు ఏకోశానలేని హైద్రాబాద్ రాష్ట్రంలో రాజకీయ పార్టీలు, వాటి కార్యక్రమాలు చాలా కాలం వరకు ఉండేవి కావు. దోపిడీ, పీడనలు, వివక్షతల్ని ఎదిరించాలన్న చైతన్యపూరితమైన ఆలోచనలకు వేదికగా ఏర్పడిందే ఆంధ్ర మహాసభ. ఆంధ్రమహాసభ గ్రంథాలయాల ఏర్పాటును ఒక ఉద్యమంగా చేపట్టింది. ఆనాటి పరిస్థితుల్లో ఆంధ్ర మహాసభ సమావేశాలు జరపటం, గ్రంథాలయాలను ఏర్పాటు



చేయటం ఒక ఉద్యమ కార్యక్రమంగా ఉండేవి. ఇవి విద్యావంతులైన యువకుల్ని ప్రభావితం చేశాయి. రాజకీయ స్వేచ్ఛ లేనందున ఈ కార్యక్రమాల్లో పరోక్షంగా రాజకీయాలు ఉండేవి. కాంగ్రెస్, కమ్యూనిస్టు ఆర్యసమాజం కార్యకర్తలంతా ఆంధ్ర మహాసభ కార్యక్రమాల ద్వారా పని చేశారు. గ్రంథాలయాల స్థాపనతో నిత్య సమాచార ప్రచారాలతో చైతన్యం తీసుకురావటానికి బి.వి. రాజేశ్వరశర్మ, బచ్చు వెంకటేశ్వర గుప్త, కొర్తివాడ నాగభూషణం, మోర్తాటి హన్మయ్య, గుజ్జం కాశీరాం, కృష్ణారావు, ఆర్.మాణిక్యరావు, వెంకటరాజేశ్వర జోషి, జయరాంరెడ్డి, దత్తనారాయణ, గాండ్లసంగప్ప, రాఘవరెడ్డి తదితరులు అనేక మంది జిల్లా గ్రంథాలయోద్య మంలో పాల్గొన్నారు.

ఆర్యసమాజ సిద్ధాంతాలకు అనుగుణంగా జిల్లాలో బసవమాణయ్య ప్రముఖంగా పని చేశారు. ఇంకా వినాయకరావు, మాణిక్‌రావు, గంగారాం, రాజిరెడ్డి, వెంకటస్వామి, రాములు గుప్త తదితరులు జిల్లా ఆర్యసమాజం కార్యక్రమాల్లో పని చేశారు.

**స్టేట్ కాంగ్రెసు : జాతీయ కాంగ్రెసు అనుబంధ రాజకీయాలు**

బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా దేశ వ్యాప్తంగా భారత స్వాతంత్ర్యోద్యమం జరుగుతున్న రోజులవి. 1937లో సుభాష్ చంద్రబోస్ అధ్యక్షతన జరిగిన కాంగ్రెస్ సమావేశంలోని రాజకీయ తీర్మానం రాజకీయాల్లో ఓ మలుపు తిప్పింది. ఆ సమయంలోనే హైద్రాబాద్ రాష్ట్రంలో ఆంధ్రమహాసభ 'బాధ్యతాయుత ప్రభుత్వం'పై రాజకీయ తీర్మానం చేయడంతో జాతీయ, రాష్ట్ర స్థాయిల్లో రాజకీయ కార్యక్రమాలు ఊపందుకోసాగాయి. ఈ క్రమంలో 'బాధ్యతా యుత ప్రభుత్వం' నినాదంతో 1938లో హైద్రాబాద్ "స్టేట్ కాంగ్రెస్" రాజకీయ పార్టీగా అవతరించింది. స్వామి రామానందతీర్థ దీనికి నాయకత్వం వహించారు. 1938 అక్టోబర్‌లో నిజాం ప్రభుత్వం స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధాన్ని విధించింది.

ఈ నిషేధాన్ని నిరసిస్తూ స్టేట్ కాంగ్రెస్ వ్యక్తి సత్యాగ్రహానికి పిలుపు నివ్వగా జిల్లాలో అప్పారావు షేట్కర్, జయరాంరెడ్డి, కృష్ణమాచారి తదితరులు సత్యాగ్రహంలో పాల్గొని అరెస్టయ్యారు. మెదక్‌లో చోళ లింగయ్య, వెంకటరాజేశ్వర్ జోషిలు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో వందేమాతరం గేయాన్ని పాడటాన్ని నిషేధించినందుకు నిరసనగా మెదక్ హైస్కూల్ విద్యార్థులు సమ్మెకు పిలుపునిచ్చారు. దాంతో ప్రధానోపాధ్యాయులు స్థానిక అధికారుల్తో చర్చించి విద్యార్థుల తల్లిదండ్రుల్ని పిలిచి బెదిరించారు. ఓ విద్యార్థి తండ్రి బాలయ్యను అరెస్టు చేయించారు. విద్యార్థులు వినకపోవడంతో ప్రధానోపాధ్యాయులు నాదిర్ కుర్షిద్ మీర్జా ప్రభుత్వానికి,

విద్యార్థులకు మధ్యవర్తిగా వ్యవహరించి వందేమాతరం గీతం పాడేందుకు అనుమతి కోసం ప్రయత్నిస్తానని హామీ ఇచ్చి సమ్మెను విరమింపజేశారు. వందేమాతరం ఉద్యమంలో జిల్లాకు చెందిన పి.వి. రాజేశ్వరరావు, సి. జగన్నాథరావులు పాల్గొని విశ్వవిద్యాలయం నుండి బహిష్కరించబడ్డారు. స్టేట్ కాంగ్రెస్ చేపట్టిన సత్యాగ్రహం మరియు వందేమాతరం ఉద్యమ కార్యక్రమాలు విద్యార్థి యువకుల్ని, మధ్యతరగతి వర్గాన్ని ఆకర్షించి చైతన్యాన్ని కల్గించాయి.

మెదక్ జిల్లా ఆంధ్రమహాసభల్లో స్త్రీవిద్య, రాజ్యాంగసంస్కరణల డిమాండ్‌తో పాటు స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధం ఎత్తివేయాలని తీర్మానించారు. ఇదే సమయంలో నూతన గ్రంథాలయాల స్థాపన, మద్యనిషేధ సంఘాలు, ఖద్దరు ప్రచార కమిటీల వంటి కార్యక్రమాల్ని స్టేట్ కాంగ్రెస్ చేపట్టింది.

1946 మేలో కందిలో చివరి ఆంధ్రమహాసభ సభలు జరిగిన కొద్ది రోజులకే స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధాన్ని ఎత్తివేశారు. 1947లో హైద్రాబాద్‌లో జరిగిన స్టేట్ కాంగ్రెస్ సభలకు జిల్లా నాయకులు పలువురు వెళ్ళి వచ్చి ఏరియా కమిటీలుగా ఏర్పరచుకొని ప్రచారం చేశారు. సిద్ధిపేట కమిటీలో రాజేశ్వర్ రావు, రాధాకిషన్‌రావు, కొడిత్యాల నాగభూషణం, వెంకట్రామయ్యలు, సంగారెడ్డి కమిటీలో బచ్చు వెంకటేశ్వర గుప్త, కంది శ్రీనివాస్‌రావులు, మెదక్ కమిటీలో వెంకటేశ్వర్‌రావు, బసవ మాణయ్య, వెంకట రాజేశ్వర జోషిలు, అల్లాదుర్గం కమిటీలో దుర్గయ్య, సదానందంలు పని చేశారు. వీరంతా రాష్ట్రానికి స్వాతంత్ర్యం కావాలనీ, హైద్రాబాద్ రాష్ట్రం భారత యూనియన్‌లో కలవాలనీ ఆగష్టు 7న 'ఉత్సవదినం'గా పాటించాలని పిలుపు నిచ్చారు. అందుకోసం స్టేట్ కాంగ్రెస్ రెండు విధానాల్ని పాటించింది. .

1. రాష్ట్ర వ్యాప్తంగా సామూహిక సత్యాగ్రహాలు.
2. రాష్ట్రంతో పాటు సరిహద్దు రాష్ట్ర పట్టణాల్లో స్టేట్ కాంగ్రెస్ ఉద్యమాన్ని కొనసాగించటం.

**జాయిన్ ఇండియా ఉద్యమం**

హైద్రాబాద్‌రాష్ట్రాన్ని స్వతంత్రదేశంగా నిజాంపాలకులు కోరుకోగా భారత యూనియన్‌లో చేరాలన్న ప్రజల కోరికకు స్టేట్‌కాంగ్రెస్ నాయకత్వం వహించింది. ఊరూర జాతీయ త్రివర్ణ పతాకాన్ని ఎగురవేయటమనేది ఆనాడు ఒక ఉద్యమ కార్యక్రమమైంది.

మెదక్ పట్టణంలో 'జాయిన్ ఇండియా' ఉద్యమంలో భాగంగా జాతీయ జెండా ఎగుర వేయుటకు స్థానిక యువకులు ఏర్పాట్లు చేస్తుండగా రజాకార్లు దాన్ని భగ్నం



చేయ ప్రయత్నించారు. సైనిక, ఆయుధ శిక్షణా నైపుణ్యం కల్గిన కేవల్ కిషన్, చోళ లింగయ్యలు వారి అనుచరుల రక్షణ వలయంలో కట్టా వెంకటస్వామి, దమ్ము రామాగౌడ్, వెంకటేశ్వర్‌రావు, మంగలి లక్ష్మయ్య, మల్కాజి నారాయణ, ఆర్.నర్సింహారెడ్డి తదితరులు కల్సి జాతీయజెండాను ఎగురవేశారు.

సిద్ధిపేట తాలూక అల్లీపురంలో రాధాకిషన్‌రావు ఆధ్వర్యంలో జాతీయజెండా ఎగురవేయుటకు ఎల్లాయపల్లి, పోల్కంపల్లి తదితర సమీప గ్రామాల ప్రజలు సైతం వచ్చి గుమికూడారు. దీన్ని అడ్డుకోవటానికి రజాకార్ సైన్యాలు వచ్చి కాల్పులు జరపగా వడ్ల లక్ష్మయ్య మృతి చెందగా కిన్నెర నర్సయ్య, సామలనర్సయ్యలకు తీవ్రగాయాలు అయ్యాయి. అయినా జెండా ఎగురవేసినందుకు రాధాకిషన్‌రావును అరెస్టు చేశారు. చిన్నకోడూరులో అమర వెంకటేశం అరెస్టు అయ్యారు. సిద్ధిపేటలో రాజేశ్వర్‌రావు, కొడిత్యాల నాగభూషణంలు జెండా ఎగురవేశారు. జిల్లాలోని అనేక గ్రామాల్లో జాతీయ పతాకాల్ని ఎగురవేసి 'జాయిన్ ఇండియా' ఉద్యమంలో పాల్గొని పన్నులమాఫీ, ఖద్దరు ప్రచారం, మద్యపానం రద్దు తదితర అంశాల్ని ప్రచారంచేశారు.

స్టేట్ కాంగ్రెస్ కార్యక్రమాల్లో భాగంగా సరిహద్దు క్యాంపుల నిర్వహణలో అనంతుల రామనాథం షోలాపూర్ క్యాంపులో పాల్గొని శిక్షణ పొందారు. చోళలింగయ్య సరిహద్దు క్యాంపులతో సంబంధాలు కొనసాగించారు. సరిహద్దు క్యాంపులకు వెళ్ళి వచ్చిన వారి ప్రభావంతో జిల్లాలో 'భారత్ సేవక్ సమాజ్' సంస్థ ఏర్పడింది.

1948లో స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధాన్ని ఎత్తివేయడంతో ఏర్పడిన జిల్లా కాంగ్రెస్ కమిటీకి అధ్యక్షులుగా జయరాంరెడ్డి, కార్యదర్శిగా వెంకట రాజేశ్వరజోషిలు జిల్లాలోని పలు ప్రాంతాల్లో పర్యటిస్తూ గ్రామ కమిటీలు, శాంతి సంఘాల ఏర్పాట్ల కోసం ప్రచారం చేశారు. స్టేట్ కాంగ్రెస్ జాతీయ కాంగ్రెస్‌లో విలీనం కాగా కాంగ్రెసు పార్టీ కార్యక్రమాలు మొదలైనాయి. అయితే జాయిన్ ఇండియా ఉద్యమం సమయంలోనే దోపిడీ, పీడనల విముక్తి కోసం సామాన్య ప్రజలకు 'సంఘం'గా దగ్గరై సాయుధ పోరాటాన్ని ప్రకటించిన కమ్యూనిస్టులకు, పాలకవర్గ రాజకీయ కాంగ్రెసుల మధ్య పలు ఘర్షణలు సైతం చోటు చేసుకున్నాయి.

ఆంధ్రమహాసభలో పనిచేసిన వారిలో జాతీయభావాలు కల్గిన స్టేట్ కాంగ్రెసు నాయకులు జాతీయకాంగ్రెసు పార్టీలో, వామపక్ష భావాలు కల్గిన వారు కమ్యూనిస్టు పార్టీలో చేరగా కాంగ్రెసు, కమ్యూనిస్టు పార్టీల కార్యక్రమాలు జిల్లాలో మొదలయ్యాయి.

## భారత జాతీయ కాంగ్రెసు : అతి పెద్ద జాతీయ పార్టీ

భారత స్వాతంత్ర్యోద్యమాన్ని నడిపించడానికి ఏర్పడిన భారతజాతీయ

1885లో భారత స్వాతంత్ర్యోద్యమాన్ని నడిపించడానికి ఏర్పడిన భారతజాతీయ కాంగ్రెసుపార్టీ సహజంగానే జాతీయరాజకీయాల్ని శాసించగల్గినందున మెదక్ జిల్లాలో సైతం దాని ప్రభావం ఎక్కువగానే ఉందనవచ్చు. జాతీయ కాంగ్రెసు ప్రభావంతో స్టేట్ కాంగ్రెసు ఏర్పడినందున స్వాతంత్ర్యానంతరం స్టేట్ కాంగ్రెసు జాతీయ కాంగ్రెస్‌లో విలీనమైంది.

జిల్లాలో టి.నర్సింహారెడ్డి, జయరాంరెడ్డి, వెంకటరాజేశ్వర్ జోషి, బసవ మాణయ్య, బచ్చు వెంకటేశ్వర గుప్త, కంది శ్రీనివాస్‌రావు, కె.కృష్ణమాచారి, రామాగౌడ్, దత్తా నారాయణ, కృష్ణారావు, జె.భూమయ్య తదితరులు కాంగ్రెసుకు పునాదులు వేశారు. ఆ తర్వాత పి.రాంచంద్రారెడ్డి, పి.వి.రాజేశ్వర్‌రావు, వెంకటేశ్వర్‌రావు, వెంకటరెడ్డి, రాంచంద్రారెడ్డి, అనంతరెడ్డి, బాగారెడ్డి, పి.హన్మంతరావు, జగన్నాథరావు, అప్పారావు శేట్కర్ తదితరులు పటిష్టం చేశారు.

1952 సార్వత్రిక ఎన్నికల్లో అరిగె రామస్వామి, యం.చెన్నారెడ్డి, వెంకటరాజేశ్వర్ జోషి, జి.రాంరెడ్డి, గునేర్వాల వెంకటేశ్వర్‌రావు, లక్ష్మణ్ కుమార్‌లు కాంగ్రెస్ ఎమ్మెల్యేలుగా, పెండెం వాసుదేవరావు, ఎ.గురువారెడ్డిలు పి.డి.ఎఫ్. ఎమ్మెల్యే అభ్యర్థులుగా గెలిచారు. రెండు ఎం.పి. స్థానాల్లో కాంగ్రెసు, పి.డి.ఎఫ్.ల అభ్యర్థులు ఒక్కొక్కటి గెలుపొందారు. 1952 నుండి 1989 ఎన్నికలవరకు జిల్లాలో ఒకటి, రెండు సీట్లు కమ్యూనిస్టులు మినహా ఎదురులేని విధంగా మెజార్టీ ఎమ్మెల్యే స్థానాల్ని కాంగ్రెసు దక్కించుకొంది. స్వాతంత్ర్యా నంతరం ఎక్కువ కాలం కాంగ్రెసు కేంద్ర, రాష్ట్రాల్లో అధికారంలో ఉన్నందున ప్రభుత్వ పరంగా జరిగే అభివృద్ధి పథకాల కార్యక్రమాలు కాంగ్రెసు పార్టీ ఆధ్వర్యంలోనే కొనసాగాయి. కాంగ్రెసు చేపట్టిన రాజభరణాల రద్దు, పేదరిక నిర్మూలన, బ్యాంకుల జాతీయీకరణ, ప్రాజెక్టుల నిర్మాణంలాంటి కార్యక్రమాలు దేశవ్యాప్తంగా జరిగాయి. పటాన్ చెరువు ప్రాంతంలో పరిశ్రమల స్థాపన జరగటంతో దేశంలో పెద్ద పారిశ్రామికవాడగా పేరొందింది. అయితే ఈ పరిశ్రమల్లో స్థానికేతరులే ఎక్కువగా ఉన్నారనే విమర్శతో పాటు కాలుష్యం వలన జరిగే నష్టాలు అభివృద్ధి కన్నా ఎక్కువగా నష్టాన్ని జిల్లావాసులు ఎదుర్కుంటున్నారనే విమర్శలున్నాయి.

సుదీర్ఘ కాంగ్రెసు పాలనా కాలంలో మధ్యలో 1969 తెలంగాణా ఉద్యమం ఉధృతంగా ముందుకొచ్చిన మూడేళ్ళలో మళ్ళీ కాంగ్రెస్‌లోనే విలీనమైపోయింది. దేశమంతా కాంగ్రెసు ఎమర్జెన్సీ నిర్బంధానికి వ్యతిరేకంగా జనతా పార్టీని గెలిపించగా రాష్ట్రంతో పాటు మెదక్ జిల్లా ప్రజలు కాంగ్రెస్‌నే మెజార్టీ స్థానాల్లో గెలిపించారు. 1980 లోక్‌సభ ఎన్నికల్లో కాంగ్రెసు అధ్యక్షురాలు ఇందిరాగాంధీ రాయబరేలితో పాటు మెదక్ పార్లమెంటరీ స్థానంలో పోటీ చేయగా రెండు స్థానాల్లో విజయం పొందినది. రాయబరేలి స్థానాన్ని వదిలిపెట్టి మెదక్ ఎం.పి.గా లోక్‌సభకు వెళ్ళటమే కాక దేశప్రధాని అయింది. దాంతో దేశానికి ప్రధానిని అందించినట్లు మెదక్ జిల్లా చరిత్రలో నిలిచిపోయింది.

మెదక్ ఎం.పి.గా ఇందిరాగాంధీ ఎన్నికల ప్రచారంలో మెదక్ జిల్లాకు ఇచ్చిన అనేక వాగ్దానాల్లో కొన్ని అమలు చేయడంతో జిల్లా అభివృద్ధిలో ప్రత్యేకతగా భావించవచ్చు. ఎద్దు మైలారంలో ఆర్డినెన్సు ఫ్యాక్టరీ, నిజాం షుగర్ ఫ్యాక్టరీ, 100% గ్రామీణ విద్యుదీకరణ వంటి పనులతో పాటు గిరిజనులకు ఋణసౌకర్యం, గ్రామీణ రోడ్ల నిర్మాణం, కార్యాలయ భవన నిర్మాణాలు వంటి పలు అభివృద్ధి పనులు జరిగాయి. 1952 నుండి 1983 వరకు తెలుగుదేశం ప్రభుత్వం అధికారంలోకి వచ్చే వరకు కాంగ్రెస్ అధికారం కొనసాగింది.

దీర్ఘకాలం కాంగ్రెసు పార్టీ కేంద్ర, రాష్ట్రాల్లో అధికారాల్లోనున్నందున గ్రామ సర్పంచ్‌లు, సమితి అధ్యక్షులు, జిల్లా పరిషత్‌ల ఛైర్మన్ల వంటి పదవుల్లో కాంగ్రెసు నాయకులు కొనసాగారు. జిల్లా ఎం.పి.గా ఇందిరాగాంధీ దేశ ప్రధానమంత్రి కాగా, జిల్లా ఎమ్మెల్యేలు ఎ.మదన్‌మోహన్, పి.రాంచంద్రారెడ్డి, బాగారెడ్డి, జగన్నాథరావు తదితరులు రాష్ట్ర మంత్రులుగా పని చేశారు.

కాంగ్రెసు పార్టీకి అనుబంధంగా యువజన కాంగ్రెస్, మహిళా కాంగ్రెసు, ఎన్.ఎస్.యు.ఐ., రాజీవ్ సేవాదళ్, గీతా పారిశ్రామిక సంఘం తదితర సంస్థలున్నాయి.

2004 ఎన్నికల్లో కాంగ్రెస్, టిఆర్ఎస్ పార్టీ ఎమ్మెల్యేలు గెలుపొందారు. జిల్లాలో 6గురు కాంగ్రెసు ఎమ్మెల్యేలు, 4గురు టిఆర్ఎస్ ఎమ్మెల్యేలుండగా వీరిలో గీతారెడ్డి, ఫరీదుద్దీన్, రాజనర్సింహులు మంత్రి పదవుల్లో కొనసాగుతున్నారు. ఇందిరమ్మ గృహాలు, ప్రజాపథం, రాజీవ్ గృహకల్ప, ఇందిరమ్మ రాజ్యం లాంటి పథకాలు వైఎస్ పాలనలో ప్రత్యేకతలు. గీతారెడ్డి పరిశ్రమల శాఖ మంత్రిగా ఉన్నందున తూప్రాన్ సమీపంలో కార్ల ఫ్యాక్టరీ ఏర్పాటుకు శంకుస్థాపన చేశారు. ఇది మూడు వందల ఎకరాల స్థలంలో ఏర్పాటవుతున్నందున స్థానికులకు ఉపాధి లభిస్తుందని భావిస్తున్నారు. ఇతర చిన్న పరిశ్రమలు ఏర్పాట్లకు ప్రయత్నాలు జరుగు తున్నాయి. దామోదర్ రాజనర్సింహ విద్యాశాఖ మంత్రిగా విద్యారంగంలో జిల్లాను ప్రభావితం చేసే అవకాశాలున్నాయి. ఫరీదుద్దీన్ విద్యుత్ శాఖ మంత్రి కావటంతో జిల్లాలో విద్యుత్ సమస్య నివారణ జరగవచ్చు.

ఇలా స్వాతంత్ర్యోద్యమ పునాదులతో ఏర్పడ్డ కాంగ్రెసు పార్టీ అధికార రాజకీయాలు కేంద్ర, రాష్ట్రాలతో పాటు జిల్లాను ఎక్కువ ప్రభావితం చేస్తున్నాయి.

**భారత కమ్యూనిస్టు పార్టీ (సిపిఐ) : భూమి, భుక్తి, విముక్తి**

సామ్రాజ్యవాద దేశాల మధ్య ఆధిపత్య పోటీతో రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్నపుడు తెలంగాణలో జాగీర్దారీ విధానం, వెట్టిచాకిరీ, ఫ్యూడల్ దోపిడీ విధానాలు కొనసాగటం, రష్యాలో కమ్యూనిజం పాలనలోకి రావటం ఇక్కడ విద్యావంతులైన యువకుల్ని ఆలోచింపజేశాయి. ఫలితంగా మెదక్ జిల్లాకు చెందిన మగ్దూం మొహినొద్దీన్‌తో పాటు ఆలంకుందమీర్, సయ్యద్ ఇబ్రహీం, రాజబహదూర్ గౌర్ తదితరులు "కామ్రేడ్స్ అసోషియేషన్"ను స్థాపించారు. అలా తెలంగాణలో వామపక్ష ఉద్యమ వ్యవస్థాపకుల్లో మగ్దూం ఒకరు. అసోషియేషన్ కార్యక్రమాలు విద్యావంతుల్ని ప్రభావితం చేశాయి.

1940లో ప్రగతిశీల విద్యార్థులచే "ఆల్ హైద్రాబాద్ స్టూడెంట్స్ యూనియన్" ఏర్పడింది. మెదక్‌పట్టణానికి చెందిన కేవల్‌కిషన్ జిల్లా శాఖ నేర్పరచి మెదక్, జోగిపేట తాలూకాల్లో చురుగ్గా పని చేశారు. సిద్దిపేట ప్రాంతంలో పి.వి.రాజేశ్వర్‌రావు పని చేశారు.

ఆంధ్ర మహాసభలో వామపక్ష భావజాల యువకులు సామాన్య ప్రజల సమస్యలు ఎజెండాగా తీర్మానాలు చేసి పై చేయి సాధించారు. వెట్టిచాకిరీ రద్దు, కూలీ పెంపుదల, కౌల్దారీ చట్టం మొదలైన డిమాండ్లతో కమ్యూనిస్టులు ప్రజలకు దగ్గరయ్యారు.

1944 ప్రాంతంలో కేవల్‌కిషన్ 'బాల భారతమండలి' ఏర్పరచారు. 'జీతగాడు' 'మార్పు' లాంటి సాంస్కృతిక ప్రదర్శనలివ్వటం, రాత్రి పాఠశాలలు నిర్వహించి అక్షరాస్యతలాంటి కార్యక్రమాలు చేపట్టారు. మగ్దూం, రావినారాయణ రెడ్డి లాంటి వారితో మంచి సంబంధాలు ఏర్పరచుకున్న ఈయన 'వ్యవసాయ సంఘం', 'పాలేర్ల సంఘం'లు ఏర్పరచారు. నిర్బంధ కార్మికుల్ని విడిపించటం, అన్యాయాల్ని ఎదిరించటం లాంటి చర్యలు చేపట్టారు. అనంతర కాలంలో కేవల్‌కిషన్ హత్యకు గురయ్యాడు. కేవల్‌కిషన్ వర్ధంతి, జయంతిలను మెదక్ ప్రజలు జాతరలాగా నేటికి జరుపుకుంటారు.

1945లో ఆసిఫాబాద్ ఏరియా నుండి జి.ఎన్.గుప్త పార్టీ ఆర్గనైజర్‌గా వచ్చి జోగిపేట ఏరియాలో పని చేశారు. సంవత్సర కాలంలోనే ఎంతో మంది ప్రభావితులైనారు. వేముల్‌ఘాట్ భట్టుమల్లారెడ్డి, యూసుఫ్, మెదక్‌కు చెందిన భట్టి కిష్టయ్య, సున్నం నర్సింలు, గంగ ఈశ్వరయ్య, దస్తగిరిలు, శివంపేట బెస్త లింగం, వెల్మకన్నిలో శివకాశం, దాకూర్ మన్నె రాములు, మల్లారెడ్డి తదితరులు పార్టీలో చేరి పని చేశారు. దొడ్డి కొమురయ్య మరణానంతరం నిరంకుశ, దోపిడీ చర్యల్ని ప్రతిఘటించడానికి కమ్యూనిస్టులు సాయుధ పోరాట చర్యలు చేపట్టడంతో నిజాం ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీపై నిషేధం విధించి స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధాన్ని ఎత్తి వేసింది. కమ్యూనిస్టు పార్టీ అంటే 'సంగం'గా ప్రజల్లో కల్పి అజ్ఞాత చర్యలతో కార్యకలాపాలు చేపట్టింది. అప్పటికే మగ్దూం ట్రేడ్ యూనియన్ కార్యక్రమాలు నిర్వహించేవారు.

సామాన్య ప్రజలకు భూమి, భుక్తి, విముక్తి కావాలనీ, భూస్వామ్య, జాగీర్దారీ వ్యతిరేక చర్యలు చేపడ్తూ, 'సంగా'లను ఏర్పాటు చేస్తూ సామాన్య ప్రజల సానుభూతిని పొందగలిగింది. ఈ క్రమంలో పార్టీ ఆదేశాల మేరకు సిటికాలేజిలో మాథ్స్ లెక్చరర్‌గా పని చేస్తున్న రామంచకు చెందిన ఎ.గురువారెడ్డి ఉద్యోగానికి రాజీనామా చేసి పూర్తికాలం కార్యకర్తగా పార్టీలోకి వచ్చారు. సిద్దిపేట, నంగునూర్, కరీంనగర్, జనగామ, గజ్వేల్ ప్రాంతాల్లో తిరిగి పని చేశారు. 1948 సెప్టెంబర్లో అరెస్టు అయి 1951 సెప్టెంబర్లో విడుదల అయ్యారు. పార్టీ సాయుధ పోరాట విరమణకు ముందు ఆంధ్రమహాసభ, కాంగ్రెసు, సంఘం కార్యక్రమాల్లో పాల్గొన్న కమ్యూనిస్టులు పి.డి.ఎఫ్. పేరిట మొదట శాసనసభ ఎన్నికల్లో పోటీ చేశారు. ఆ తర్వాత కమ్యూనిస్టు పార్టీ జిల్లా శాఖ ఏర్పరచి పని చేశారు. 1952లో మొదటి సాధారణ ఎన్నికల నాటికి మెదక్, రామాయంపేట, సిద్దిపేట, గజ్వేల్, నర్సాపూర్ తాలూకాల పరిధిలో పార్టీకి కొంత పట్టు ఉంది. ఫలితంగా 1952 ఎన్నికల్లో సిద్దిపేటలో ఎ.గురువారెడ్డి, గజ్వేల్ పెండెం వాసుదేవరావులు ఎం.ఎల్.ఏ.లుగా గెలుపొందగా మెదక్ నుండి ఎం.పి.గా జయసూర్యలు పి.డి.ఎఫ్. తరపున గెలుపొందారు. 1962 ఎన్నికల్లో మెదక్‌లో కేవల్ కిషన్ భార్య ఆనంద, నర్సాపూర్‌లో సి.హెచ్. విఠల్‌రెడ్డి ఎం.ఎల్.ఏ.లుగా గెలుపొందారు.

కమ్యూనిస్టు పార్టీ జిల్లా ప్రథమ మహాసభ 1953లో సిద్దిపేట తాలుకా ధర్మాజీపేటలో, రెండవ మహాసభ 1955లో మెదక్‌లో, 1958లో మూడవ మహాసభ సిద్దిపేటలో జరిగాయి. 1953 ప్రథమ మహాసభ నుండి 1972 వరకు జిల్లా పార్టీ కార్యదర్శిగా ఎ.గురువారెడ్డి కొనసాగారు. ఆ తర్వాత యం.కె.మొహినొద్దీన్‌ను 1972లో కార్యదర్శిగా ఎన్నుకున్నారు. 1989లో సి.హెచ్.విఠల్‌రెడ్డి, 1992 నుండి 2002 వరకు ఎం.కె.మొహినొద్దీన్ కార్యదర్శిగా ఎన్నుకోబడగా 2003లో వి. ప్రకాశ్‌రావు జిల్లా కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు.

1952 ఎన్నికల అనంతరం తెలంగాణ ప్రాంతంలో రైతులు, కూలీల హక్కులకై నిలబడి పోరాటాలు నిర్వహించాల్సిన బాధ్యత కమ్యూనిస్టు పార్టీపై పడింది. పోరంబోకు, ఖారిజ్‌ఖాతా, బంచరాయి (గైరాన్) గెట్టునెంబరు మున్నగు పేర్లతోనున్న పది లక్షల

ఎకరాల లావునీ భూములను తెలంగాణా రైతు కూలీలు రజాకార్ల కాలం నుండి ఆక్రమించుకొని సాగులోకి తెచ్చారు.

1953 మే 26 నుంచి మూడు రోజుల పాటు సిద్ధిపేటలో జరిగిన మెదక్ జిల్లా ప్రథమ రైతు మహాసభ నాటికి 20వేల మంది రైతులు సభ్యులుగా చేరారు, స్థానిక సమస్యలు, నీటి పారుదల, బంజరు భూములు, కౌల్దారు సమస్యలు, రాజభరణాల రద్దుపై తీర్మానాలు చేశారు. గురువారెడ్డి అధ్యక్షులుగా, పి.వాసుదేవరావు, రషీద్‌లు ఉపాధ్యక్షులుగా కేవల్‌కిషన్ కార్యదర్శిగా జిల్లా రైతు కమిటీ ఏర్పడింది.

1954లో మెదక్‌లో జిల్లా రెండవ రైతు మహాసభ జరిగింది. పార్టీ నాయకత్వాన సుమారు లక్ష ఎకరాల భూమిని ఆక్రమించారు. ప్రభుత్వం బేదఖలీలకు పూనుకోగా నిలుపుదల చేయించారు. జిల్లాలో 400 గ్రామాల వరకు ఉన్న జాగీరు గ్రామాల్లోనున్న అధిక శిస్తును తగ్గింపజేశారు. సిద్ధిపేట, మెదక్‌లలో తాలూకా రైతు మహాసభలు జరిగాయి. కమ్యూనిస్టు పార్టీ అధిక సంఖ్యాకులైన సామాన్య ప్రజల, రైతు, కూలీల సమస్యలు ప్రధాన ఎజెండాగా పని చేస్తూ వస్తుంది. ఈ పార్టీ అనుబంధ ప్రజాసంఘాలు ఏర్పరచి ఆయా రంగాల్లో పని చేస్తుంది. 2003లో నూతన జిల్లా కౌన్సిల్ కార్యదర్శిగా ప్రకాశరావు పని చేస్తున్నారు. 1970లో జిల్లా ఎ.ఐ.టి.యు.సి. నిర్మాణం జరిగింది. పటాన్‌చెరువు, బొంతపల్లి, నర్సాపూర్, సిద్ధిపేట ప్రాంతాల్లోని కార్మికుల కోసం ఎ.ఐ.టి.యు.సి. పని చేస్తుంది. సిద్ధిపేటలో బీడి, హమాలీ, రిక్షా, రైస్‌మిల్ వంటి అసంఘటిత కార్మికుల్ని ఐక్యం చేస్తూ సిరాజొద్దీన్ కార్మికనాయకునిగా పనిచేస్తున్నారు. అఖిలభారతబీడి సిగార్ అండ్ తంబాకు వర్కర్స్ ఫెడరేషన్ జాతీయ అధ్యక్షులుగా ఉన్నారు. వ్యవసాయ కూలీల కోసం వ్యవసాయ కార్మిక సంఘం, విద్యార్థి సమస్యల కోసం ఎ.ఐ.ఎస్.ఎఫ్. తదితర ప్రజా సంఘాల్ని ఏర్పరచి భారత కమ్యూనిస్టు పార్టీ (సి.పి.ఐ.) పని చేస్తుంది.

**కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) (సి.పి.యం.) : సోషలిస్టు సమాజం**

సైద్ధాంతిక విబేధాల వలన భారత కమ్యూనిస్టు పార్టీ 1964లో చీలిపోయి సి.పి.ఐ. మరియు సి.పి.యం.లుగా ఏర్పడ్డాయి. జిల్లాలో సి.పి.యం. బలహీనంగానే ఉండేది. కొంతకాలం చల్లా నర్సింహారెడ్డి, గుండు గౌరయ్య, బాల్‌రెడ్డి తదితరులు పని చేశారు. ఆ తర్వాత కొంతకాలం స్తబ్దంగా ఉంది. వరంగల్ జిల్లా నాయకులు సంబంధాలు పెట్టుకొని శాఖ వేసి పని చేయాలని చూశారు. నాయకత్వం వహించేవారు లేక స్తబ్దంగానే ఉన్నప్పటికీ రాష్ట్రనాయకత్వం కృషివల్ల 1980 దశకం నుండి సి.పి.యం. కార్యకలాపాలు మొదలయ్యాయి. కొండపాక, సిద్ధిపేట, సంగారెడ్డి, పటాన్ చెరువు,



జిన్నారం తదితర ప్రాంతాల్లో వ్యవసాయ, సంఘటిత, అసంఘటిత కార్మికరంగాల్లో పనిచేస్తూ పార్టీని నిర్మించే ప్రయత్నాలు జరిగాయి. పారిశ్రామిక, వ్యవసాయ రంగాల్లో సమస్యలపై పని చేస్తున్నారు.

సంగారెడ్డిలో చుక్కారాములు, మల్లేశం, మల్లిఖార్జున్, సిద్ధిపేటలో చింతల మల్లేశం, బాల్ నర్సయ్య తదితరుల నాయకత్వంలో సి.పి.యం. కార్యక్రమాల్ని నిర్వహించింది. విద్యార్థుల సమస్యల పరిష్కారం కోసం ఎస్.ఎఫ్.ఐ., కార్మికుల సమస్యలపై సి.ఐ.టి.యు., రైతాంగ సమస్యలపై వ్యవసాయ కార్మిక సంఘం, కుల వివక్ష పోరాట సమితి లాంటి అనుబంధ సంఘాలను ఏర్పరచి ఆయా రంగాల్లో పట్టు కోసం ప్రయత్నిస్తుంది. సింగూరు జలాలతో స్థానికులకు సాగు, తాగు నీటిని అందించాలనీ, కరువు నివారణ చర్యలు చేపట్టి రైతు ఆత్మహత్యల్ని నివారించాలని పాదయాత్రలతో ప్రచారం చేసింది. ఆయా సమస్యలపై స్పందిస్తూ ధర్నాల్లాంటి ఉద్యమాల్ని నిర్వహిస్తూ కార్యకలాపాల్ని విస్తృతి చేసుకుంటున్నది. అలా పట్టు సాధించుకోవటం వల్ల గత శాసనసభ ఎన్నికల్లో సంగారెడ్డి ఎమ్మెల్యేగా చుక్కా రాములు, సిద్ధిపేటలో జెడ్పీటిసి చింతల మల్లేశంలు అభ్యర్థులుగా పోటీ చేశారు. విజయం సాధించనప్పటికీ కార్యకర్తల్ని, విస్తృతిని పెంచుకోగలిగారు. పారిశ్రామిక రంగంలో స్థానాన్ని సంపాదించుకోగలిగారు. సంగారెడ్డి, పటాన్ చెరువు, జిన్నారం, నర్సాపూర్ పారిశ్రామిక ప్రాంతాల్లో కార్మికుల్ని సంఘటితం చేస్తూ, వేతనాల పెంపు, భద్రతలపై ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా ఆందోళనలు చేస్తూ కార్మిక రంగంలో స్థానం సంపాదించుకుంది. మున్సిపల్ సిబ్బంది సమ్మె, గ్రామసేవకులు, అంగన్‌వాడీ వర్కర్స్ వేతనాల పెంపు కోసం ఆందోళనలు చేపట్టింది. ఇటీవల పేదలకు ఇళ్ళ స్థలాల కోసం పోరాడుతున్నది.

సమగ్ర అభివృద్ధి, వివిధశాఖల అభివృద్ధినమూనా సూచికల మేరకు నిధులు కేటాయించే ఏర్పాటు వంటి డిమాండ్లను చేస్తుంది. కార్మిక రంగంలో పట్టు సాధించే దిశలో కృషి చేస్తుంది.

**తెలంగాణ ప్రజాసమితి - ప్రత్యేక రాష్ట్ర డిమాండ్**

ఆంధ్ర పాలకుల చేతల్లో తెలంగాణ ప్రాంతానికి వివిధ రంగాల్లో ముఖ్యంగా ఉద్యోగాల్లో అన్యాయం జరుగుతుందని తెలంగాణ రాష్ట్ర డిమాండ్‌తో 1969లో తెలంగాణ ప్రజాసమితి ఏర్పడింది. తెలంగాణ ప్రజాసమితికి మర్రి చెన్నారెడ్డి, మదన్‌మోహన్, మల్లిఖార్జున్ వంటి వారు నాయకత్వం వహించారు. మెదక్ జిల్లా టిపిఎస్ ఉద్యమనాయకత్వ బాధ్యతలు జిల్లాకు చెందిన మదన్‌మోహన్ స్వీకరించారు. ఫలితంగా తెలంగాణ ఉద్యమాన్ని మొదట్లో వ్యతిరేకించిన జిల్లా కాంగ్రెసుఎమ్మెల్యేలు

బాగారెడ్డి, సైదయ్య, శివరావుషేట్కర్, సి.జగన్నాథరావు, కె. రాంచంద్రారెడ్డి, ఎమ్మెల్సీలు ఐరేని లింగయ్య, లక్ష్మారెడ్డిలు ప్రత్యేక రాష్ట్ర డిమాండ్ చేయటమే కాకుండా ఉద్యమంలో పాల్గొన్నారు. ఈ ఉద్యమం జిల్లాలో ప్రధాన పాత్ర వహించింది. తెలంగాణ ఎన్‌జీవోలు జిల్లా కలెక్టర్ కార్యాలయం ముందు సామూహిక నిరాహార దీక్షలు చేపట్టారు. 1969 మే 2న సిద్దిపేటలో తెలంగాణ ఉద్యోగుల సదస్సు జరిగింది.

1969 ఏప్రిల్‌లో ఉద్యమం దాడుల రూపం తీసుకోగా ఆఫీసులు, బస్సులపై దాడికి పాల్పడ్డారని జిల్లాలో 567 మందిని అరెస్టు చేశారు. సంగారెడ్డి, సిద్ధిపేట, జహీరాబాద్, జోగిపేట, నారాయణఖేడ్‌లలో సర్పంచ్‌లు, కౌన్సిలర్లు పికెటింగ్, ధర్నాలు, సత్యాగ్రహాలు చేపట్టారు. 1969 జూన్ 23న స్త్రీలు, పురుషులు, పిల్లలు అనే తేడా లేకుండా నిషేధాజ్ఞలు ఉల్లంఘించి సత్యాగ్రహం చేసినందుకు 2,000 మందిపై లాఠీచార్జీ చేసి అరెస్టు చేశారు.

ఆరుమాసాల్లోనే తెలంగాణఉద్యమంలో నాటకీయపరిణామాలు జరిగి ఉద్యమం తీవ్రరూపంగా మారింది. రెండు సంవత్సరాల్లో ప్రభుత్వ, ప్రైవేట్ ఆస్తుల నష్టంతో పాటు, లాఠీచార్జీలు, కాల్పులు, మరణాలు సంభవించి రాష్ట్ర ప్రభుత్వాన్ని కలవరపర్చింది. నాటి ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డిని పదవీచ్యుతున్ని చేసింది. 1971లో జరిగిన లోక్‌సభ ఉప ఎన్నికల్లో తెలంగాణ 14 లోక్‌సభ స్థానాల్లో 10 స్థానాలు టిపిఎస్ గెలుచుకోగల్గింది. దాంతో ఉద్యమ నాయకులతో కేంద్రం రాజీకుదుర్చుకొని మంత్రిపదవుల ఎరచూపి ఉద్యమం చల్లార్చింది. అది విమర్శలకు గురైంది.

ఫలితంగా మొదటి సారిగా జిల్లా సంబంధీకులయిన మదన్‌మోహన్, బాగారెడ్డిలకు రాష్ట్రమంత్రి పదవులు, వెంకటస్వామి, శివశంకర్, మల్లికార్జున్‌ల వంటి వెనుకబడిన తరగతుల నాయకులకు కేంద్ర మంత్రి పదవులు దక్కాయి.

**జనతా పార్టీ : ఎమర్జెన్సీపై తిరుగుబాటు**

ఇందిరాగాంధీ ప్రధానిగా ఉండి దేశంలో విధించిన ఎమర్జెన్సీ కాలంలో అనేక రకాలుగా అవాంఛనీయ, దుష్పరిణామాలు సంభవించాయి. ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తే అరెస్టులు జరిగాయి. ఫలితంగా విబేధించిన కాంగ్రెసు వాదులు, సోషలిస్టులు, జనసంఘ్, లోక్‌దళ్‌లకు చెందిన నాయకులు ఏకమై ప్రజల ఆకాంక్షలకు తగిన పాలనను అందించాలన్న లక్ష్యంతో జనతాపార్టీ ఏర్పాటు జరిగింది. 1977 జనవరి 30న మెదక్ జిల్లాలో జనతా పార్టీ శాఖ ఏర్పడింది. జనతాపార్టీ జాతీయ, రాష్ట్ర నాయకులు జిల్లాలో పర్యటనకు వచ్చినప్పుడు జిల్లా నాయకులు స్వాగతించారు.



విద్యావంతులైనవారు చాలా మంది దేశంలోని ఎమర్జెన్సీ చర్యల్ని నిరసిస్తున్న క్రమంలో జనతా పార్టీ ఆవిర్భావంతో రాజకీయంగా ఆలోచించసాగారు. జిల్లాలో పి.రాంచంద్రా రెడ్డి, పి. నర్సింహారెడ్డి, కొండల్‌రెడ్డి, ఖాజా మొహినొద్దీన్, సి.రామారావు, భీంరెడ్డి తదితరులు జనతా పార్టీలోకి వచ్చి పని చేశారు. 1977 లోక్‌సభ ఎన్నికల్లో రెండు స్థానాల్లో పోటీ చేసి ఓటమి చెందగా 1978 అసెంబ్లీ ఎన్నికల్లో 20 స్థానాల్లో పోటీ చేసి ఓటమి పాలైంది. కేంద్రంలో జనతా ప్రభుత్వం ఏర్పడినా జిల్లాలో స్థానం దక్కనందున చెప్పుకోదగిన ప్రభావాన్ని చూపలేకపోయింది. ఖాజామొహినొద్దీన్, సి.రామారావు, రాంచంద్రారెడ్డిలు పోటీ చేసినా గెలుపొందలేదు. తర్వాత కాలంలో జనతా పార్టీ ఉనికి కోల్పోయింది.

**తెలుగుదేశం పార్టీ (టి.డి.పి.) : తెలుగోడి ఆత్మగౌరవం**

తెలుగు చలన చిత్ర రంగంలో ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్న ఎన్టీఆర్ 1982లో తెలుగువారి ఆత్మగౌరవం నినాదంతో ఏర్పాటు చేసిన 'తెలుగుదేశం పార్టీ' ఆవిర్భావం రాజకీయాల్లో సంచలనమే అయిందనవచ్చు. ఎన్టీఆర్ రాష్ట్రవ్యాప్తంగా నిర్వహించిన చైతన్యరథయాత్రకు, ప్రసంగాలకు అన్ని ప్రాంతాల్లో మంచి స్పందన లభించింది. ఎన్నోఏళ్ళుగా కాంగ్రెస్‌లో నాయకత్వ స్థానం లభించని చాలామందికి రాజకీయంగా ఎదుగుటకు టిడిపి మంచి అవకాశం కల్పించింది. విద్యావంతులైన యువకుల్ని ఆకర్షించింది. టిడిపి మెదక్ జిల్లా కన్వీనర్‌గా వెంకటేశం కష్టపడి జిల్లాలో పార్టీ కేడర్‌ని ఏర్పరచారు. ఫలితంగా పి.వి.రాజేశ్వరరావు, కె.చంద్రశేఖర్‌రావు, ఎం.వెంకట్‌రెడ్డి, డి.రాంచంద్రారెడ్డి, నవాజ్‌రెడ్డి, కె.రాంచందర్‌రావు, సి. హెచ్.ముత్యం రెడ్డి తదితరులు టిడిపిని జిల్లాలో పటిష్టపరిచారు. తెలుగు రైతు శిక్షణా శిబిరం, తెలుగు యువత శిక్షణా శిబిరాల పేరుతో హైద్రాబాద్‌లో నిర్వహించిన శిబిరాలు పార్టీ అభివృద్ధికి ఎంతగానో తోడ్పడ్డాయి. త్వరలోనే క్రింది స్థాయి వరకు పార్టీ వెళ్ళింది. రాష్ట్రంలో టిడిపి అధికారం చేజిక్కించుకున్నప్పటికీ 1983 ఎన్నికల్లో మూడు, 1985 ఎన్నికల్లో ఐదు, 1989 ఎన్నికల్లో రెండు, 1994, 1999 శాసనసభ ఎన్నికల్లో జిల్లాలో మెజార్టీ శాసనసభ స్థానాల్ని గెలుచుకొని కాంగ్రెసు బలాన్ని అడ్డుకోగల్గింది.

తెలుగుదేశం వ్యవస్థాపకులు ఎన్టీఆర్, అతని అల్లుడు చంద్రబాబునాయుడు కల్సి 17 ఏళ్ళు ముఖ్యమంత్రులుగా రాష్ట్రాన్ని పాలించారు. ఎన్టీఆర్ ఆంధ్ర అధికారులపై ఆధారపడి నందున తెలంగాణకు నష్టం జరిగినప్పటికీ సామాన్య ప్రజల్లో స్థానం సంపాదించేందుకు తను అమలుపర్చిన నిర్ణయాలు ఉపయోగపడ్డాయి. గ్రామాల్లో ప్రజల్ని ఇబ్బందులకు గురిచేసిన పటేలు, పట్వారీ వ్యవస్థ రద్దు చేశారు. మండలాల

వ్యవస్థ ఏర్పాటు, ప్రజల వద్దకు పాలన నినాదాన్ని అమలుపర్చారు. పేదలకు 2 రూపాయల కిలో బియ్యాన్ని పౌరసరఫరా శాఖ ద్వారా అందించారు. మహిళల్ని కష్టాల పాల్జేసిన మద్యపానాన్ని నిషేధించి వారి అభిమానం సంపాదించారు. విద్యుత్ స్లాబ్ రేటుతో రైతాంగాన్ని ఆకట్టుకునే ప్రయత్నం చేశారు. మద్యపాన విషయంలో వారుణి వాహినిని చౌకగా ప్రవేశపెట్టి మరింత కష్టాల పాల్జేశారనే విమర్శ ఉంది. జన్మభూమి పథకాన్ని ప్రవేశపెట్టి గ్రామాల్లో సభలు నిర్వహిస్తూ సమస్యల్ని అక్కడికక్కడే పరిష్కరించాలనీ, ప్రజల వద్దకే అధికారులు (పాలన) వెళ్ళాలని గ్రామ సభలు నిర్వహించారు. పంచాయితీ సమితిల స్థానంలో జిల్లాలో 45 మండలాల్ని ఏర్పాటు చేశారు. మండల, జిల్లా ప్రాదేశిక ప్రాంతాల్ని ఏర్పాటు చేసి వాటికి ఎం.పి.టి.సి.లు, జెడ్.పి.టి.సిల ఎన్నికలు నిర్వహించారు.

ఫలితంగా యువకులైన చాలా మందికి రాజకీయ అవకాశం లభించి పార్టీకి కేడర్ పెరిగింది. విద్యాకమిటీలు, నీటికమిటీలు, వి.ఎస్.ఎస్.ల వంటివి అమలు చేశారు. అధికారుల బదిలీల్లో కౌన్సిలింగ్ పద్ధతి ప్రవేశపెట్టడం వల్ల బదిలీల్లో జరిగే అవినీతి తగ్గింది. మెజారిటీ మండలాల అధ్యక్షులు, జిల్లా పరిషత్ ఛైర్మన్ పదవులను టిడిపి కైవసం చేసుకోవటానికి ఈ కార్యక్రమాలు దోహదపడ్డాయి. తర్వాత విద్యుత్ స్లాబ్ మార్పు, మద్యపానం, రెండు రూపాయల కిలో బియ్యం లాంటి అంశాల్లో టిడిపి విధానాలు విమర్శలకు గురయ్యాయి.

తెలుగుదేశం పార్టీని జిల్లాలో బలోపేతం చేయటానికి నవాజ్‌రెడ్డి, మంత్రి కరణం రాంచంద్రరావు, ఎలక్షన్ రెడ్డి, ఎం.ఎల్.ఏ. బాబుమోహన్, ఎస్.రాంచంద్రారెడ్డి ఎం.పి., శ్రీనివాస్ గౌడ్ జెడ్.పి. ఛైర్మన్, వెంకట్ రెడ్డి ఎం.ఎల్.ఏ., చెరుకు ముత్యంరెడ్డి ఎం.ఎల్.ఏ., మంత్రి కె.చంద్రశేఖర్‌రావు, విజయ రామారావు ఎం.ఎల్.ఏ., బట్టి జగపతి, శ్రీనివాస్‌రెడ్డి, రాధాక్రిష్ణ శర్మ తదితర నాయకులు ఉపయోగపడ్డారు. టిడిపికి జిల్లా అధ్యక్షులుగానున్న బట్టి జగపతి స్థానంలో ప్రస్తుతం 2007లో మైనంపల్లి హన్మంతరావు అధ్యక్షులయ్యారు. తెలంగాణ రాష్ట్ర సమితి ఏర్పాటు వరకు మెదక్ జిల్లా పాలకపక్ష రాజకీయాల్లో కాంగ్రెస్, టిడిపిలు ప్రధాన పార్టీలుగా కొనసాగుతూ వచ్చాయి. తెలంగాణా విషయంలో అనుకూల వైఖరి లేనందున 2004 ఎన్నికల్లో టిడిపి ఓడిపోయింది. ఒక్క ఎమ్మెల్యే స్థానాన్ని దక్కించుకోలేక పోయింది.

తెలుగుదేశం పార్టీ రాష్ట్రంలో అధికారంలో ఉన్న 17 ఏళ్ళ కాలంలో జిల్లాకు చెందిన కె.చంద్రశేఖర్‌రావు, కరణం రాంచందర్‌రావు, మల్యాల రాజయ్య, చెరుకు ముత్యంరెడ్డి తదితరులు మంత్రి పదవులు నిర్వహించారు. ఈ సమయంలోనే అనేక ప్రాంతాల్లో చెక్‌డ్యాంల నిర్మాణం, మోడల్ స్కూళ్ళ నిర్మాణాలు, మానేరు డ్యాం నుండి



సిద్ధిపేటకు తాగు నీటి సరఫరా వంటి పనులు జరిగాయి. సుదీర్ఘ కాంగ్రెసు పాలనకు తెరదించిన తెలుగు దేశం పార్టీ రాజకీయాల్లో ప్రత్యేక ముద్ర వేసింది.

**భారతీయ జనతా పార్టీ (బిజెపి) : జాతీయ సమగ్రత**

1980లో 'పంచనిష్ట' సిద్ధాంత ప్రాతిపదికన జాతీయ స్థాయిలో భారతీయ జనతా పార్టీ ఏర్పడింది. పంచనిష్టలో (1) జాతీయత, జాతీయసమగ్రత, (2)ప్రజాస్వామ్యం (3)గాంధేయసోషలిజం (4) సమానత్వధర్మాలు (5) రాజకీయవిలువలు అనేవి ప్రధానమైనవి. 1980లో బిజెపి మెదక్ జిల్లా శాఖ విజయరావు కన్వీనర్‌గా నిర్మాణం జరిగింది. జిల్లా నాయకులైన ఎన్.నర్సింహారెడ్డి, అశోక్‌గౌడ్, పన్యాల ప్రభాకర్, వాసురెడ్డి, జె.రాంచంద్రరావు, వేణన్న, చంద్రంగౌడ్ తదితరులు పార్టీ రాజకీయాల్ని ప్రచారం చేశారు.

1983 నుండి జిల్లా స్థానికసంస్థల, అసెంబ్లీ, లోక్‌సభ స్థాయి ఎన్నికల్లో బిజెపి పాల్గొన్నది. 1983లో సిద్ధిపేట శాసనసభ స్థానానికి నిమ్మనర్సింహారెడ్డిని నిలబెట్టగా ఓటమి చెందారు. 1985లో టిడిపితో పొత్తుపెట్టుకోగా రామాయంపేట ఎమ్మెల్యేగా శ్రీనివాసురెడ్డి గెలుపొందారు. సంగారెడ్డి పురపాలక సంఘ ఛైర్మన్ పదవిని 3 సార్లు కైవసం చేసుకోగా పన్యాల ప్రభాకర్, జగ్గారెడ్డి, పద్మలు ఛైర్మన్లుగా కొనసాగారు. సిద్ధిపేటలో రెండు సార్లు వైస్ ఛైర్మన్ పదవిని దక్కించుకొని 1984లో వంగ రాంచంద్రారెడ్డి, 2004లో కేదారినాథ్‌లు కొనసాగారు.

బిజెపి నాయకులు, దాని అనుబంధ విద్యార్థి సంఘం ఎ.బి.వి.పి. కార్యక్రమాలు, రాష్ట్రీయ స్వయంసేవక్‌సంఘ్‌ల కార్యకలాపాలతో పట్టణాల్లోని ఉన్నతవ్యాపార వర్గాల వారిని ఆకర్షించ గలిగారు. మున్సిపాల్టీల్లో సంగారెడ్డిలో ఛైర్మన్, సిద్ధిపేటలో వైస్ ఛైర్మన్ల పదవుల్ని, సంగారెడ్డి ఎమ్మెల్యేగా సత్యనారాయణ, మెదక్ ఎం.పి.గా నరేంద్రలు ఎన్నిక కావడం జరిగింది.

బిజెపి నాయకత్వంలో రుద్రారంలో ఆల్‌కబీర్ పశువధ కర్మాగారాన్ని ఎత్తివేయాలని ప్రభుత్వ నిర్బంధాన్ని ఉల్లంఘించి పెద్దఎత్తున ఆందోళన నిర్వహించారు. పారిశ్రామిక ప్రాంతంలో కాలుష్య నివారణ కోసం, సింగూరు జలాలు జిల్లాకు చెందాలని ఆందోళనలు నిర్వహించారు. పాదయాత్ర, నిరాహారదీక్షలు చేపట్టారు. ఇటీవల 2007లో తెలంగాణాకు నష్టం కల్గించే బాబ్లీ ప్రాజెక్టు నిర్మాణంపై, బీడి కార్మికుల ఉపాధికి హాని కల్గించే పుర్రె గుర్తులపై కూడా ఆందోళనా కార్యక్రమాలు చేసింది. 2007లో మెదక్ జిల్లా బి.జె.పి. అధ్యక్షులు కె.సంగమేశ్వర్ రెడ్డి, ప్రధాన కార్యదర్శి విష్ణువర్ధన్ రెడ్డి నాయకత్వంలో కమిటీ పని చేస్తుంది. భారతీయ జనతా యువమోర్చా,

కిసాన్‌మోర్చా, మహిళా మోర్చా, ఎస్టీమోర్చాల అధ్యక్షుల్ని నియమించారు.

జిల్లాలో ఎ.నరేంద్ర, నిమ్మ నర్సింహారెడ్డి, వంగ రాంచంద్రారెడ్డి, సత్యనారాయణ, యస్.విద్యాసాగర్, విష్ణువర్ధన్ రెడ్డి, సంగమేశ్వర్ రెడ్డి, సంజీవరెడ్డి, లక్ష్మన్ యాదవ్, శ్రీనివాస్‌గౌడ్, బత్తుల నారాయణ, అనురాధారెడ్డి తదితరులు బిజెపి అభివృద్ధికి కృషి చేశారు.

**బహుజన సమాజ పార్టీ (బియస్‌పి) : బహుజనుల సంక్షేమం**

సామాజికంగా వెనుకబడిన వర్గాలైన ఎస్సీ, ఎస్టీ, బి.సి., మైనార్టీ తరగతుల సంక్షేమ నినాదంతో కాన్షీరాం నాయకత్వంలో 1984లో జాతీయ స్థాయిలో బహుజన సమాజ పార్టీ ఏర్పడింది. అగ్రవర్ణాల ఆధిపత్యాన్ని ప్రశ్నిస్తూ ఆవిర్భవించిన బిఎస్‌పి రెండు రకాల కార్యక్రమాలతో ప్రజల ముందుకు వచ్చింది. 1. సామాజిక చైతన్యం కల్గించటం అంటరానితనం నిర్మూలన, ఎస్సీ, ఎస్టీ, బిసిల ఆత్మగౌరవం, సమానత్వం, అన్ని కులాల మధ్య సోదర భావాన్ని కల్గి ఉండటం, 2.రాజ్యాధికారం సాధించటం, ఆర్థిక ప్రయోజనాల కోసం భూమిలేని పేదలకు భూమి, కులవృత్తుల్ని నమ్ముకొని జీవించే వారికి పని కల్పించటం, గ్రామాల నుండి పట్టణాలకు వలసల్ని ఆపటానికి పని కల్పించటం వంటి అంశాల్ని ముందుకు తెచ్చింది. ఫలితంగా 1989 ఏప్రిల్ 4న మెదక్ జిల్లా కమిటీ ఏర్పడింది. 1989 నుండి 1995 వరకు బిఎస్పీకి నల్లా సూర్యప్రకాశ్ జిల్లా కన్వీనర్‌గా కొనసాగారు. 1996 నుండి 1999 వరకు జిల్లా అధ్యక్షులుగా లక్ష్మినర్సింహగౌడ్, కార్యదర్శిగా పల్లె సంజీవయ్యలు తర్వాత ముత్యాల నర్సింలు అధ్యక్షులుగా, ప్రధాన కార్యదర్శిగా లింగంపల్లి యాదగిరిలు ఉన్నారు. ప్రస్తుతం జిల్లా అధ్యక్షులుగా యం.బాలయ్య ఉన్నారు.

'ఓట్లు మావి – సీట్లు మీకా' అన్న నినాదంతో బియస్‌పి 1989 లోక్‌సభ ఎన్నికల్లో మెదక్, సిద్ధిపేట స్థానాల్లో పోటీ చేసి విజయం సాధించలేకపోయింది. జనాభాలో 85% మేమే ఉన్నాం. మా ఓట్లు మాకే అని భావించి ప్రచారం చేసినా చాలా తక్కువ ఓట్లను పొందగల్గింది. దానికి కారణాలు చాలానే ఉన్నాయి. జిల్లాశాఖ ఏర్పడిన 6 నెల్లకే ఎన్నికలు రావడం, పార్టీ పరంగా కనీస కరపత్రాల వంటి ఆర్థిక సహాయం లేకపోవటం, నిలబడ్డ అభ్యర్థి ఆర్థికంగా వెనుకబడిన వారైనందున ప్రచారం సైతం చేయలేకపోవటం వంటి కారణాలున్నాయి. ఎర్రోల్ల రత్నయ్య మెదక్ లోక్‌సభ స్థానానికి పోటీ చేశారు.

పార్టీ సమావేశాలు, అంబేద్కర్ జయంతి సభలు, అంబేద్కర్ ఆలోచనా విధానాల్ని ప్రచారం చేయడం లాంటి కార్యక్రమాలు, ఎస్సీ, ఎస్టీ, బిసి, మైనార్టీ వర్గాల్ని ఏకం చేయాలని ప్రయత్నం చేస్తుంది. జూన్ 4న మెదక్ జిల్లా సంగారెడ్డిలో యు.పి.లో



సాధించిన విజయం స్ఫూర్తితో పార్టీ ఆవిర్భావ దినోత్సవం, విజయోత్సవ సభ నిర్వహించేందుకు ప్రచారం చేపట్టింది.

**తెలంగాణ రాష్ట్ర సమితి : ప్రత్యేక రాష్ట్ర నినాదం**

తెలుగుదేశం ప్రభుత్వం విద్యుత్ బిల్లుల విషయంలో అవలంభించిన విధానాల్ని సిద్ధిపేట ఎమ్మెల్యేగా, డిప్యూటీ స్పీకర్‌గా ఉన్న కె.చంద్రశేఖర్‌రావు బహిరంగంగా విమర్శిస్తూ చంద్రబాబు నాయుడుపై తిరుగుబాటు బావుటా ఎగురవేస్తూ బయటకు వచ్చారు. ఆ రెండు పదవులకూ రాజీనామా చేశారు. అప్పటికే తెలంగాణ ప్రాంతానికి జరుగుతున్న అన్యాయాలపై రాష్ట్ర వ్యాప్తంగా కొంత చర్చ జరుగుతుంది. మంజీరా రచయితల సంఘం తెలంగాణ వివక్షతపై సభలు నిర్వహించింది. ఇన్నయ్య సహచరులు జిల్లాలో తెలంగాణ ఎదుర్కొంటున్న వివక్షత అన్యాయాల్ని తెలంగాణ స్టడీ ఫోరం ద్వారా జిల్లాలో ప్రచారం చేశారు. ఇంద్రారెడ్డి సైతం కొంత కాలం తెలంగాణ అంశాన్ని ముందుకు తెచ్చారు. ఈ అంశాలన్నింటినీ బాగా అధ్యయనం చేసిన చంద్రశేఖర్‌రావు పకడ్బందీ ప్రణాళికతో తెలంగాణ అంశాన్ని తెరమీదకు తెచ్చారు.

ఫలితంగా 2001 ఏప్రిల్ 27న కె.చంద్రశేఖర్‌రావు తెలంగాణ రాష్ట్ర సమితిని ఏర్పరచారు. తెలంగాణ ప్రాంత రైతులు, నిరుద్యోగులు, ఉద్యోగులు, రాజకీయ, ఆర్థిక రంగాల్లో ఎలా కష్టనష్టాలకు బలవుతున్నారో వివరించటంతో ఈ ప్రాంత ప్రజలు ఆకర్షితులయ్యారు. టి.ఆర్.ఎస్. ఏర్పాటు తర్వాత కరీంనగర్‌లో పెద్దసభ నిర్వహించటంతో తెలంగాణా రాష్ట్ర డిమాండ్‌తో వచ్చిన ఏకైక పెద్ద పార్టీ కావటంవల్ల జిల్లాలో విశేష స్పందన వచ్చింది.

తెలంగాణ రాష్ట్ర సమితి ఏర్పడిన మూడుమాసాలకు స్థానికసంస్థల ఎన్నికల బరిలో తెలంగాణ రాష్ట్ర డిమాండ్‌తో దిగింది. పార్టీ పుట్టిన 115 రోజుల్లో 104 మంది ఎంపిటిసిలు, 85 మంది జెడ్పీటీసీలు, 100 మంది మండలాధ్యక్షులు, 1800 మంది సర్పంచుల్ని గెలిపించింది. తెలంగాణ జిల్లాల్లో గెలుపొందిన ప్రజాప్రతినిధులతో ఆగష్టు 24, 25 తేదీల్లో టి.ఆర్.ఎస్. ప్రజా ప్రతినిధుల సదస్సును సిద్ధిపేటలో నిర్వహించింది. సిద్ధిపేట సదస్సులో అన్నిరంగాల్లో అన్యాయానికి గురవుతున్న తెలంగాణాను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పరచాలనీ, తెలంగాణ రైతాంగానికి ఉచితంగా కరెంటివ్వాలనీ, కరువు దృష్ట్యా తెలంగాణ రైతులకు రుణాలమాఫీ, రైతులకు అన్ని రకాల సహాయ చర్యలు చేపట్టాలని, విద్యావంతులైన యువకులకు 610 జి.ఓ. ద్వారా ఉద్యోగాలివ్వాలనీ, ఈ ప్రాంత పరిశ్రమల మూసివేతను ఆపి కార్మికుల కుటుంబాలకు భద్రత కల్పించాలని తీర్మానాలు చేశారు. దీంతో ఈ పార్టీ అన్ని వర్గాల

వారిని ఆకట్టుకో గల్గింది. సిద్ధిపేట ఎమ్మెల్యే అభ్యర్థిత్వానికి కేసిఆర్ రాజీనామా చేయటంతో వచ్చిన ఉప ఎన్నికలో టిఆర్ఎస్ తరపున మళ్ళీ కెసిఆర్, టిడిపి నుండి అతని శిష్యుడు శ్రీనివాస్‌రెడ్డి, కాంగ్రెసు తరపున హన్మంతరెడ్డి ప్రధాన పార్టీల అభ్యర్థులుగా పోటీపడ్డారు. కాంగ్రెస్, టిడిపి శక్తి యుక్తులన్నీ ప్రయోగించారు. టిఆర్ఎస్ స్థానిక ప్రజాప్రతినిధుల్ని నియోజకవర్గంలోని ప్రతి గ్రామానికి పంపించి పకడ్బందీ వ్యూహంతో కెసిఆర్‌ని గెలిపించింది.

ఈ ఎన్నికలో కెసిఆర్ సాధించిన విజయం టిఆర్ఎస్‌కు బలాన్నిచ్చింది. ఇతర పార్టీల నుండి టిఆర్ఎస్‌కు వలసలు మొదలయ్యాయి. తెలంగాణ వాదానికి ప్రజల్లో లభిస్తున్న స్పందనను చూసి చాలా మంది ఆకర్షితులవడం జరిగింది. బిజెపి, సిపిఐ, తెలుగుదేశం, కాంగ్రెస్‌ల నుండి రెండో శ్రేణి నాయకులు చేరారు.

'ఒక ఓటు రెండు రాష్ట్రాలు' అన్న నినాదం ఇచ్చిన బిజెపి తెలంగాణ విషయంలో అవలంభించిన విధానాన్ని నిరసిస్తూ బిజెపికి రాజీనామా చేసిన ఆలె నరేంద్ర టి.ఆర్.ఎస్.లో చేరటం ఆ పార్టీకి మరింత బలం చేకూర్చింది. తెలంగాణ నినాదం ప్రభావం వల్ల కెసిఆర్ అంచనాకు మించిన స్పందన రావడం జరిగింది. దాంతో విద్యావంతులు, ఉద్యోగులు, యువకులు, రైతులు ఆకర్షితులైనారు. ప్రజాస్వామికంగా, ఎన్నికల్లో పాల్గొని అధికారవత్తిళ్ళతో తెలంగాణాను సాధించేవ్యూహంతో టిఆర్ఎస్‌ను ముందుకు తీసుకెళ్తున్నారు. జాతీయస్థాయిలో అన్ని పార్టీలు తెలంగాణా అంశాన్ని ప్రస్తావిస్తున్న పరిస్థితి ఏర్పడింది.

తెలంగాణ రాష్ట్ర సమితి ఏర్పాటు తర్వాత వచ్చిన సార్వత్రిక ఎన్నికల్లో సమైక్య నినాదాన్ని ఇస్తున్న టిడిపిని గద్దె దించటానికి రాజకీయ వ్యూహంలో భాగంగా కాంగ్రెస్‌తో పొత్తుపెట్టుకొని ఎన్నికల బరిలోకి దిగింది. ఈ ఎన్నికల్లో టిడిపిని తిరస్కరించి టి.ఆర్.ఎస్., కాంగ్రెసు కూటముల అభ్యర్థులకు జిల్లా ప్రజలు పట్టం కట్టారు. సిద్ధిపేట అసెంబ్లీ స్థానానికి హరీష్‌రావు, మెదక్ పార్లమెంటు స్థానానికి ఎం.పి.గా ఆలె నరేంద్ర, సంగారెడ్డి ఎమ్మెల్యేగా జగ్గారెడ్డి, దొమ్మాట ఎమ్మెల్యేగా ఎస్.రామలింగారెడ్డి, రామాయంపేట ఎమ్మెల్యేగా పద్మా దేవేందర్‌రెడ్డిలు టి.ఆర్.ఎస్. తరపున గెలుపొందగా మిగతా స్థానాల్లో కాంగ్రెస్ ఎమ్మెల్యేలు గెలుపొందారు. దొమ్మాట నియోజక వర్గాన్ని అభివృద్ధి చేశానంటూ ముచ్చటగా మూడుమార్లు టిడిపి ఎమ్మెల్యేగా గెలిచిన సి.హెచ్.ముత్యం రెడ్డి స్థానంలో అప్పుడే రంగంలోకి వచ్చిన జిల్లా సీనియర్ జర్నలిస్టు రామలింగారెడ్డిని గెలిపించడం తెలంగాణ నినాదం ప్రత్యేకతను తెలియజేస్తుంది.



తెలంగాణాలో అన్ని రకాల వనరులున్నా ఇతర ప్రాంతాల నాయకులు కొల్లగొట్టడం వల్ల తెలంగాణ వట్టిపోతుందనీ నిధులు, నీళ్ళూ తరలింపబడుతున్నాయనీ తెలంగాణ రాష్ట్రంలోనే అన్ని రకాల అభివృద్ధి సాధ్యమన్న ఎజెండా తెలంగాణ జిల్లాల ప్రజల్ని ఆకట్టుకునేలా చేసింది. మెదక్ జిల్లాకు చెందిన కెసిఆర్ టిఆర్ఎస్‌కు నాయకత్వం వహించటం వల్ల మెదక్‌లో ఎక్కువ ప్రభావం కన్పించడం సహజం. ఎన్నికల పొత్తువల్ల ఆ తర్వాత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల్లో టిఆర్ఎస్ పాలుపంచుకొంది. ఆ తర్వాత కొద్దికాలానికే తెలంగాణ ఏర్పాటు విషయంలో ప్రజల్లో అపోహలు ఏర్పడటం కాంగ్రెసు, టిఆర్ఎస్ సంబంధాలు బెడిసికొట్టి మంత్రివర్గాల నుండి టిఆర్ఎస్ బయటకు రావటం జరిగింది.

శాసనసభ సమావేశాల్లో జిల్లాకు చెందిన ఎమ్మెల్యేలు హరీష్‌రావు, పద్మాదేవేందర్‌రెడ్డి, రాంలింగారెడ్డిలు తరచుగా 610 జి.వో. అమలు, తెలంగాణ రైతాంగ సమస్యలు, ప్రాజెక్టు అంశాలపై ప్రస్తావిస్తూ డిమాండ్ చేస్తూనే ఉన్నారు. ఇతర అన్ని రాజకీయ పార్టీలు తెలంగాణ అంశంపై తప్పనిసరిగా మాట్లాడాల్సి రావటానికి టిఆర్ఎస్ కారణమని భావిస్తున్న పరిస్థితి ఏర్పడింది.

గత నాలుగైదు ఏళ్ళుగా కరువు పరిస్థితుల నుండి 2006లో కొంతమెరుగైన వర్షాలతో భూగర్భ జలాలు పెరిగినా, తెలంగాణా రైతు కరెంటు కోత తీవ్ర కష్టనష్టాలు కల్గిస్తున్నాయని రైతాంగానికి నిరంతరాయంగా తొమ్మిది గంటలు ఇవ్వాల్సిందేనని టిఆర్ఎస్ డిమాండ్ చేసింది. ఆ డిమాండ్ సాధనకోసం ప్రత్యక్ష కార్యాచరణకు దిగి డిశంబర్ 29న 250కి.మీ. దూరం హైద్రాబాద్ నుండి మంచిర్యాల వరకు రాజీవ్ రహదారిని దిగ్బంధం చేస్తూ చారిత్రాత్మకమైన మహా రాస్తారోకో పిలుపునిచ్చింది. అందులో భాగంగా గజ్వేల్, సిద్ధిపేట, దొమ్మాట నియోజక వర్గాల రైతాంగం ప్రజలు రాజీవ్ రహదారిపై చేరి ఎండిన పొలాలు, కరెంటు తీగలు, బతుకమ్మ ఆట పాటల ప్రదర్శనలతో కష్టనష్టాలు ఏకరువు పెట్టారు. రోడ్డుపైన వంటావార్పూ చేపట్టారు. పకడ్బందీ కార్యాచరణ వల్ల మంచి స్పందనతో ఈ రాస్తారోకో విజయవంతమైంది.

కరీంనగర్ శాసన మండలికి ఎమ్మెల్సీగా జిల్లా జర్నలిస్టు సత్యనారాయణ గెలిచారు. సింగూరు జలాల సాధన, 610 జివో అమలు, తెలంగాణ రాష్ట్రాన్ని టిఆర్ఎస్ ఎలా సాధిస్తుందన్నది మిగిలి ఉంది.

1952 నుండి 1983 ఎన్నికల వరకు కాంగ్రెసు పార్టీ అధికారంలో ఉన్నందున ప్రభుత్వం చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలన్నీ కాంగ్రెసు ఆధ్వర్యంలోనే జరిగాయి. రోడ్లు, ప్రభుత్వ కార్యాలయాలు, భవనాల నిర్మాణం, పరిశ్రమల స్థాపన, మౌలిక

సౌకర్యాల కల్పన వంటి ప్రజోపయోగ పనులు అధికార పార్టీ చేయాల్సినందున ఆ పార్టీ ప్రభావిత కార్యక్రమాలుగానే జరిగాయి. కష్టజీవుల పక్షపాతిగానే కమ్యూనిస్టు పార్టీ నిలిచిపోయింది.

ముప్పై ఏళ్ళకు పైగా కాంగ్రెసు, పదిహేడేళ్ళు తెలుగు దేశం పార్టీలు అధికారంలో ఉన్నందున ఈ రెండు రాజకీయ పార్టీల ప్రభావం రాష్ట్రంతో పాటు జిల్లాలో సైతం ఎక్కువగా ఉంది. రెండు పార్టీల పథకాల్లో ఆ పార్టీల రాజకీయ మార్కు పథకాల ప్రభావం కన్పిస్తుంది. పేదల కోసం గరీబీ హఠావో అని కాంగ్రెసు, రెండు రూపాయల కిలో బియ్యం అని టిడిపి, కూడు, గూడు, గుడ్డ అని కమ్యూనిస్టులు ఇచ్చిన నినాదాలుగా ప్రజల్లో ప్రచారమయ్యాయి. ఈ రెండు పార్టీలు అధికార రాజకీయాల్లో, కమ్యూనిస్టులు శ్రామికవర్గ ప్రజల సమస్యలే ఎజెండాగా ప్రతిపక్ష రాజకీయాల్లో కొనసాగుతున్నాయి.

2001లో తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర డిమాండ్‌తో ఏర్పడి ముందుకెళ్తున్న టిఆర్ఎస్ తెలంగాణ జిల్లాలతో పాటు మెదక్‌లో ప్రభావిత రాజకీయ పార్టీగా ఎదుగుతుంది. స్థానిక సమస్యల ఎజెండాతో ముందుకొచ్చే పార్టీలే జిల్లాలో పట్టుసాధించుకోగల అవకాశాలున్నాయి. ఇలా స్టేట్ కాంగ్రెసు నుండి తెలంగాణ రాష్ట్ర సమితి వరకు అన్ని రాజకీయ పార్టీలు మెదక్ జిల్లాలో తమ కార్యకలాపాలతో ప్రభావితం చేశాయి.





# మెతుకుసీమలో నక్సలిజం

**తోట అశోక్**

ఆర్థిక, సామాజిక అసమానతలు, భూస్వాముల దుశ్చర్యలు, పోలీసుల అణచివేతలు మెదక్ జిల్లాలో నక్సల్‌బరి ఉద్యమానికి పునాదులుగా నిలిచాయి. 34 సంవత్సరాలలో ఎందరో అమరవీరుల త్యాగాలు ఉద్యమాన్ని పదునెక్కించాయి. ఇక్కడ ఉద్యమం ప్రజలను విప్లవోన్ముఖులను చేసింది. పోరాటాలకు ఎందరో వీరులను అందించింది. ప్రజల గుండెచప్పుళ్ళను పాటలుగా వినిపిస్తున్నది. పీడితులను సంఘటితం చేసి, ప్రజల సమస్యల పరిష్కారాలను ఎజెండాగా చేసి ఎర్రజెండా నీడలో ప్రజాపోరును ఉధృతం చేసి నక్సల్‌బరి చరిత్రలో మెదక్ జిల్లా చెరగని ముద్రవేసింది. దాడులు, ప్రతిదాడులు, వర్గశ్రేణుల ఘర్షణలు, పాలకుల ఫాసిస్ట్ చర్యలు, ప్రపంచీకరణ పాశవిక విధానాలు విప్లవోద్యమాన్ని గాయపరిచాయి. అయినా ఉద్యమం ప్రజల గుండెల్లో నివురుగప్పిన నిప్పులా వున్నది. విభిన్న రూపాల్లో వ్యక్తమవుతున్నది.

శ్రీకాకుళం నక్సల్‌బరి పోరాట స్ఫూర్తితో 1975 సంవత్సరంలో నలుగురు యువకులు మెతుకుసీమ పల్లెల్లో అడుగుపెట్టారు. ఉద్యమాన్ని నిర్మించడానికి విప్లవకారులు పల్లెలకు తరలివెళ్ళాలని విప్లవపార్టీలు ఇచ్చిన పిలుపుకు స్పందించి వరంగల్‌లో ఉన్నత విద్యను అభ్యసిస్తున్న సూరపనేని జనార్ధన్‌రావు, మురళీ మోహన్ (19), కాసెట్టి ఆనందరావు (15), వనపర్తి సుధాకర్ (19)లు సిద్ధిపేట చేరుకున్నారు. ఆ సమీపంలోని పల్లెల్లో విప్లవగీతాలతో, ప్రసంగాలతో విప్లవోద్యమాన్ని పోటెత్తించారు. విప్లవ సాహిత్యాన్ని పంచుతూ అక్షరబీజాలను నాటారు. బానిస సంకెళ్ళను బద్దలు కొట్టాలని, పోరాడితే పోయేదేమీలేదని, దున్నేవానిదే భూమని, వ్యవసాయ కూలీరేట్లు

పెంచాలని చేసిన నినాదాలు పీడితులను ఆకర్షించాయి. అంతకుముందు 1973, సెప్టెంబర్ 12న కొండపాక మండలం వెలికట్ట గ్రామంలో బర్ల యాదగిరి రాజు ఏడుమంది నక్సలైట్లతో కలిసి టి.లక్ష్మారెడ్డి కుమార్తెను కిడ్నాప్ చేశారు. లక్ష్మారెడ్డి వద్దనున్న తుపాకీతో పాటు 40వేల రూపాయలు ఇవ్వాలని డిమాండ్ చేశారు. పోలీస్‌లు చాకచక్యంగా అమ్మాయిని చెరవిడిపించారు. 1975 నుండి సిద్దిపేట ప్రాంతంలో నక్సలైట్ ఉద్యమం ఊపందు కున్నది. ప్రభుత్వ భూములలో వున్న చింతచెట్లను ఆ వృత్తిపై ఆధారపడ్డ కులస్థులకే కేటాయించాలనే నినాదాన్ని ఆ నలుగురు యువనక్సలైట్లు లేవదీశారు. 1975, ఏప్రిల్1న సిద్దిపేట తాలూకా దుద్దెడ పోలీస్ పటేల్ సుధాకర్‌రెడ్డిపై హత్యాయత్నం చేసి తుపాకీ లాక్కోవడానికి ప్రయత్నం చేశారు. 1975, జూన్ 22న సిద్దిపేట తాలూకా బక్రి చెప్యాల పోలీస్ పటేల్ ముత్యాల్‌రెడ్డిపై ఐదుగురు నక్సల్స్ హత్యాయత్నం చేశారు. ఇదే రోజు జనార్దన్, సుధాకర్ ఆధ్వర్యంలో 6 మంది నక్సల్స్ సిద్దిపేట తాలూకా సిరిసినగండ్లలో వడ్డీ వ్యాపారి దొంతుల అంతయ్యను హత్య చేసి ప్రామిసరి నోట్లను తగులబెట్టారు.

### దేశంలో సంచలనం సృష్టించిన ఎన్‌కౌంటర్

సిద్దిపేట ప్రాంతంలోని భూస్వాములు, దోపిడీదారుల గుండెల్లో రైళ్ళు పరుగెత్తించిన నక్సలైట్లపై కన్నెర్ర జేసిన పోలీసులు ఉద్యమంలో పని చేస్తున్న కొందరిని డబ్బుల వలలో పడవేసి ఇన్‌ఫార్మర్‌లుగా మలుచుకున్నారు. వీరు ఇచ్చిన సమాచారం మేరకు రహస్య స్థావరాన్ని నలువైపుల నుండి చుట్టుముట్టి సూరపనేని జనార్ధన్‌రావు, మురళీ మోహన్, కాసెట్టి ఆనందరావు, వనపర్తి సుధాకర్‌లను సజీవంగా పట్టుకుని చిత్రహింసలకు గురిచేసి కొండపాక మండలం గిరాయిపల్లి అడవుల్లో చెట్లకు కట్టివేసి కాల్చి చంపారు. 1975, జులై 25న జరిగిన ఈ తొలి బూటకపుఎన్‌కౌంటర్ దేశంలోనే సంచలనం సృష్టించింది. ఈ ఎన్‌కౌంటర్‌ను విచారించడానికి జనతా ప్రభుత్వం తొలిసారి భార్గవ కమీషన్‌ను ఏర్పాటు చేసింది.

### రెండు సంవత్సరాల విరామం తర్వాత...

1977 మే 29న వై.ఎస్.మూర్తి నేతృత్వంలో ఐదురుగు నక్సలైట్లు రాజగోపాల్ పేట పోలీస్ స్టేషన్ పరిధిలోని మైసంపల్లిలో జీడిపర్తి నారాయణ ఇంటిపై దాడి చేసి 15 వేల రూపాయల నగదును దోచారు. 1979 మార్చి 23న బందారంలో వడ్డీ వ్యాపారం చేసే సోమగౌరయ్య ఇంటిపై దాడి చేసి 40వేల రూపాయలను దోచుకుని 30వేల విలువైన ప్రామిసరీ నోట్లను చించేశారు. పట్టువున్న గ్రామాల్లో విప్లవోద్యమాన్ని ప్రచారం చేశారు.



### డాక్టర్ రాకతో ఊపందుకున్న ఉద్యమం

1983లో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో మెడిసిన్ నాల్గవ సంవత్సరం చదువుతున్న అంకం బాబురావు ఉద్యమం కోసం చదువును పక్కకుపెట్టి రాడికల్ విద్యార్థి సంఘాన్ని బలోపేతం చేశాడు. ఈ క్రమంలో పీపుల్స్‌వార్ ఆదేశాల మేరకు బాబురావు అలియాస్ రామకృష్ణ సిద్దిపేట ప్రాంతంలో ఉద్యమాన్ని విస్తృతం చేశాడు. ఇదే సమయంలో ప్రస్తుత మావోయిస్ట్ రాష్ట్రనేత శాకమూరి అప్పారావు అలియాస్ అశోక్, రవి సిద్దిపేట పట్టణంలో ప్రవేశించి విద్యార్థులకు ట్యూషన్‌లు చెబుతూ మరోవైపు ఉద్యమాన్ని బలోపేతం చేయడానికి కృషి చేశాడు. ప్రజాసంఘాల ఏర్పాటు, భగత్‌సింగ్ వర్ధంతి, మేడే ఉత్సవాలను నిర్వహించి యువకులను, విద్యార్థులను, ఆలోచనాపరులను విప్లవోద్యమం వైపు నడిపించాడు. పీపుల్స్‌వార్ పార్టీపేరుతో దుబ్బాక, ఇందుప్రియాల్, మెదక్, నర్సాపూర్ అటవీ ప్రాంతాలలో దళాల ఏర్పాటు జరిగింది. సిద్దిపేట, గజ్వేల్, దుబ్బాకలలో రాడికల్ విద్యార్థి సంఘాలను ఏర్పాటు చేశారు. సిద్దిపేట వ్యవసాయ మార్కెట్‌లో రాడికల్స్ అధ్వర్యంలో జరిగిన బహిరంగ సభలో ప్రజాగాయకుడు గద్దర్, విప్లవ కవి వరవరరావులు పాల్గొన్నారు. బాబురావు, అప్పారావుల స్ఫూర్తితోనే నాగన్న, మహేందర్, రామన్న, చంద్రన్న, శంకరన్న, మురళీ, సుధాకర్, అనంద్, నగేశ్, శేషన్న, భిక్షపతి, రాజశేఖర్ మొదలగువారు వార్ నేతలుగా పని చేశారు.

### మేకపుల్లర ప్రతిఘటనతో మెదక్‌లో పోరు

మెదక్ సమీపంలోని పుష్పాలవాగు ప్రాంతంలో మేకపుల్లర విధానానికి వ్యతిరేకంగా పీపుల్స్‌వార్ చేపట్టిన ఉద్యమం గొల్లకుర్మలను సంఘటితం చేసింది. ఉద్యమ నిర్మాణానికి అనువుగా వున్న రామాయంపేట, నర్సాపూర్ ప్రాంతాలలో మేకపుల్లర వ్యతిరేక పోరు ప్రభుత్వ యంత్రాంగాన్నిఆందోళనకు గురిచేసింది. మెదక్‌లో గొల్లకుర్మలతో భారీ ప్రదర్శన జరిగింది. ఈ సందర్భంగా పోలీస్‌లు వార్‌నేత నక్కమోహన్‌ను అరెస్ట్ చేశారు. నక్సలైట్లు రామాయంపేట సమీపంలోని కాట్రియాల్ గ్రామంలో వడ్డీ వ్యాపారస్థుల నుండి తాకట్టుపడ్డ నగలను, సామాగ్రిని పేద ఋణగ్రస్థులకు ఇప్పించి అప్పు పత్రాలను దగ్ధం చేశారు.

### అమరుడైన అంకం బాబూరావు

మెదక్ జిల్లా పీపుల్స్‌వార్ బలోపేతమవుతున్న క్రమంలో జిల్లా కార్యదర్శిగా పని చేసిన అంకం బాబురావు 1986 నవంబర్ 15న గుండెపోటుతో మరణించాడు. 32 సంవత్సరాల వయస్సులో మరణించిన బాబురావు కృషిని ఆ తర్వాత జిల్లా కార్యదర్శిగా బాధ్యతలు స్వీకరించిన శాకమూరి అప్పారావు కొనసాగించాడు.

1986 అక్టోబర్ 10న నిజామాబాద్ జిల్లాకు చెందిన వార్ గ్రూప్ హరిభూషణ్ ఆధ్వర్యంలో మెదక్ సమీపంలోని రాయినిపల్లి ప్రభుత్వ అతిథి గృహంలో హైద్రాబాద్‌కు చెందిన నవాబ్ ఖాదర్‌ను బెదిరించి, వాచ్‌మెన్‌ను కొట్టి టెలిస్కోప్ రైఫిల్, పిస్టల్, 0.22 రైఫిల్‌లను ఎత్తుకెళ్ళారు. 1987 ఫిబ్రవరి 24న సిద్ధిపేట మండలం వెంకటాపూర్‌లో మాజీ పోలీస్‌పటేల్ ముత్యాల వెంకట్ రెడ్డిని హరిజనులను వేధిస్తున్నాడనే కారణంపై నక్సల్స్ కాల్చి చంపారు.

**అణచివేతలతో పోటెత్తిన ఉద్యమం**

జిల్లాలో పీపుల్స్‌వార్ కార్యకలాపాలు విస్తృతం కావడంతో పోలీస్ యంత్రాంగం అణచి వేత చర్యలను చేపట్టింది. వార్‌నేతలను, కార్యకర్తలను, సానుభూతిపరులను ప్రత్యక్షంగా, పరోక్షంగా వేధించడం, ఇండ్లపై దాడి చేయడం, కుటుంబ సభ్యులను విచారణ పేరిట హింసించడం వల్ల సానుభూతిపరులు, కొరియర్‌లు అజ్ఞాతంలోకి వెళ్ళారు. నక్సలైట్లను పట్టుకున్న, కాల్చిచంపిన పోలీస్ అధికారులకు ప్రభుత్వం ప్రమోషన్‌లు ఎరవేయడంతో అధికారులు మరింత విచ్చలవిడిగా విధ్యంసాలకు, హింసలకు దిగడం, బూటకపు ఎన్‌కౌంటర్‌లకు పాల్పడడంతో నక్సల్స్ నేతలు, కార్యకర్తలు పూర్తి అజ్ఞాతంలోకి వెళ్ళి ఉద్యమాన్ని మరింత బలోపేతం చేశారు.

**ప్రజా సమస్యలపై పీపుల్స్ 'వార్'**

ప్రభుత్వ, భూస్వాముల భూములను పేద ప్రజలకు పంచడం ద్వారా పీపుల్స్‌వార్ 'దున్నే వానిదే భూమి' నినాదాన్ని ఆచరణలో చూపింది. సర్కార్ ప్రజావ్యతిరేక విధానాలను ప్రత్యక్షంగా, పరోక్షంగా నిరసించడంతో పాటు ప్రజాఉద్యమాలను నిర్మించింది. రాడికల్ విద్యార్థి సంఘం, యువజన సంఘం, రైతు కూలి సంఘాల ఏర్పాటు ద్వారా విభిన్న వర్గాలను ఉద్యమంలో భాగస్వాములను చేసింది. ప్రజాకోర్టులు నిర్వహించి అన్యాయం చేసిన వారిని బహిరంగంగా శిక్షించింది.

తుపాకులు ఎక్కుపెట్టి కూలీల, కార్మికుల వేతనాలను పెంచింది. సిద్ధిపేటలో ప్రైవేట్ వైద్యుల ఫీజులను తగ్గించింది. కులాంతర, మతాంతర వివాహాలను నిర్వహించి ఆదర్శాలను ప్రోత్సహించింది. అడవులను నరికివేసే వారిని బెదిరించి, శిక్షించి వనసంరక్షణకు కృషి చేసింది. ప్రజలకు భారమైన ఫైనాన్స్‌ల వడ్డీరేట్లను తగ్గించింది.

**సంచలనం సృష్టించిన కిడ్నాప్‌లు**

1991లో రాష్ట్ర రాజధాని హైద్రాబాద్ మధ్య నుండి ఎమ్మెల్యే సుధీర్‌కుమార్‌ను మెదక్ జిల్లా నక్సల్స్ కిడ్నాప్ చేసి సంచలనం సృష్టించారు. వార్ అగ్రనేతలను విడిపించుకుని సుధీర్‌ను వదిలిపెట్టారు. 1989లో ఎమ్మెల్యే విఠల్‌రెడ్డిని, చేగుంట



మండలాధ్యక్షులు మునీరొద్దీన్ ఘోరీని, 1990లో జడ్‌పి వైస్ ఛైర్మన్ కూర జైపాల్‌రెడ్డిని, రాష్ట్రయూత్ కాంగ్రెస్ కార్యదర్శి ఫారుఖ్ హుస్సేన్‌ను పీపుల్స్‌వార్ నక్సల్స్ కిడ్నాప్ చేశారు. జిల్లాలో వార్, సిపివర్గం నక్సల్స్ 16 కిడ్నాప్ సంఘటనలకు పాల్పడ్డారు.

**విప్లవాగ్నులు - నక్సల్స్ అక్షరాయుధాలు**

ప్రజాపోరాటాలతో పాటు అమరవీరుల త్యాగాలను క్రోడీకరించి వార్ "మృత్యుం జయుడు" కవితాసంకలనాన్ని జిల్లా అడవుల్లో ఆవిష్కరించి సంచలనం సృష్టించింది. సముద్రుడు అలియాస్ జనార్దన్ రచించిన "భూమినా తలవెల నిర్ణయించు" పుస్తకం వెలువడింది. సముద్రుడు, కౌముదిల పేరిట వార్ నేతలు వెలువరించిన కవితలు సాహిత్యరంగంలో చెదరని ముద్రను వేశాయి. సముద్రుడి ఎన్‌కౌంటర్ తర్వాత "మృత్యువే మరణిస్తుంది" అనే పుస్తకం ప్రచురించబడింది. మెదక్ జిల్లా అమరవీరుల వివరాలతో, ఫోటో వ్యాఖ్యానాలతో "మేం యుద్ధంలోనే పుడ్తాం" పుస్తకం ప్రచురించారు. కౌముది రచించిన కవితలు 'చనుబాలధార'గా వెలువడినాయి.

**ఎన్‌కౌంటర్‌లతో ఛిద్రమైన ఉద్యమం**

గిరాయిపల్లి ఎన్‌కౌంటర్ తర్వాత 1989లో లింగాపూర్ తండా వద్ద జరిగిన ఎన్‌కౌంటర్‌లో వార్ సెంట్రల్ ఆర్గనైజర్ కుమార్ హతమయ్యారు. 1991లో గజ్వేల్ సమీపంలోని అహ్మదీపూర్ వద్ద జరిగిన ఎన్‌కౌంటర్‌లో వార్ దళనేత సుధాకర్ అలియాస్ జహీర్ సిద్దిఖితో పాటు దళసభ్యులు ప్రసాద్, కిరణ్‌లు మరణించారు.

నక్సల్స్‌ను ఎదుర్కోవడానికి పోలీస్‌లు ఇన్‌ఫార్మర్ వ్యవస్థను పటిష్టం చేసుకోవడంతో పాటు గాలింపు చర్యలను ముమ్మరం చేశారు.. ఎం.ఎల్.ఏ. సుధీర్ కిడ్నాప్‌లో ప్రధాన పాత్ర వహించిన వార్ జిల్లా కమిటీ సభ్యుడు జనార్ధన్ అలియాస్ సముద్రుడిని, మిలిటెంట్ సత్యంగౌడ్‌లను చందాయిపేట వద్ద పట్టుకున్న పోలీస్‌లు పాంబండ వద్ద కాల్చివేసి ప్రతీకారం తీర్చుకున్నారు. మెదక్ జిల్లా రాష్ట్ర రాజధానికి దగ్గరగా వుండడంతో గ్రేహౌండ్స్ మెరుపుదాడులకు జిల్లా అనువుగా మారింది. ఈ క్రమంలో 1991లో లక్ష్మాపూర్ వద్ద జరిగిన పోలీస్ కాల్పుల్లో వార్ రాష్ట్ర నేత మేకల దామోదర్‌రెడ్డి, ఏడుగురు యాక్షన్ కమిటీ సభ్యులు మరణించారు. 1991లో తీగుల్ వద్ద జరిగిన ఎన్‌కౌంటర్‌లో వార్ ప్రత్యేక గెరిల్లా దళం హతమైనది. 1998 జులైలో నవాబ్‌పేట వద్ద జరిగిన ఎన్‌కౌంటర్‌లో నర్సాపూర్ ట్రేడ్ యూనియన్ దళనాయకుడు శేషన్న, డిప్యూటీ ఆర్గనైజర్ ప్రభాకర్‌లతో పాటు మరో 5గురు దళ సభ్యులు హతమైనారు. 1998లో మెహిదినిపూర్ వద్ద జరిగిన ఎన్‌కౌంటర్‌లో గిరాయిపల్లి దళనేత మురళితో పాటు దళ సభ్యులు మృతి చెందారు. ఈ రెండు ఎన్‌కౌంటర్‌ల నుండి తేరుకోక ముందే 1999లో చిన్నచింతకుంట వద్ద జరిగిన ఎన్‌కౌంటర్‌లో

నర్సాపూర్ ట్రేడ్ యూనియన్ దళం హతమైనది. సిద్దిపేట మండలం సీతారాంపల్లి గ్రామం వద్ద జరిగిన ఎన్‌కౌంటర్‌లో దళనేత భిక్షపతి, వార్ సాక్ సభ్యుడు శ్రీనివాస్‌రెడ్డితో పాటు దళసభ్యులు మరణించారు. జిల్లాలో వార్ కార్యకలాపాలను విస్తృతం చేసిన కార్యదర్శి మహేందర్ వరంగల్ వద్ద జరిగిన ఎన్‌కౌంటర్‌లో మృతి చెందాడు. వార్ అగ్రనేతగా ఎదుగుతున్న గజ్వేల్‌కు చెందిన భానుప్రసాద్ అలియాస్ బాలన్న కరీంనగర్‌లో జరిగిన ఎన్‌కౌంటర్‌లో బలయ్యారు. జిల్లాలో వార్ కార్యకలాపాలను పోటెత్తించిన జిల్లా కమిటీ సభ్యురాలు రాధక్క, ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలను, వార్ కార్యక్రమాలను నిర్వహించిన కవి, విప్లవకారుడు కౌముది నల్లమల అడవుల సమీపంలో మరణించారు.

### వార్ ప్రతీకారాగ్నిలో ఆహుతైన పోలీస్‌లు, ఆస్తులు

1991 ఏప్రిల్ 4న పీపుల్స్‌వార్ నక్సలైట్లు కౌడిపల్లి ఎస్ఐ దామోదర్ రెడ్డిని, పోలీస్ కానిస్టేబుల్ మల్లేశంలను కాల్చిచంపారు. నవంబర్ 11న దౌల్తాబాద్ ఎస్ఐ రాజగోపాలాచారి, హెడ్‌కానిస్టేబుల్ చంద్రయ్యలు నక్సల్స్ తూటాలకు బలయ్యారు. 1997లో పేలిన మందు పాతరకు డిఎస్పీ బాలసుబ్రహ్మణ్యం, సిఐ వెంకటేశం, మరో నలుగురు పోలీస్‌లు బలయ్యారు. వివిధ ఎన్‌కౌంటర్‌లకు నిరసనగా, బంద్ పిలుపుల సందర్భంగా భయోత్పాతం సృష్టించడం కోసం నక్సల్స్ సుమారు 45 బస్సులను దగ్ధం చేశారు. ప్రభుత్వ కార్యాలయా లను, బ్యాంక్‌లను, టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లను, సెల్‌ఫోన్ టవర్‌ను పేల్చివేశారు. తునికాకు కల్లాలు, సారా పాకెట్‌లు సైతం వార్ ప్రతికారాగ్నికి బూడిదయ్యాయి. నక్సల్స్ హత్యా కాండలపై, విధ్వంసాలపై, విరాళాల సేకరణపై, చట్ట వ్యతిరేక కార్యకలాపాలపై సుమారు 475 కేసులను జిల్లా పోలీసులు నమోదు చేశారు.

### ఉద్యమానికి తూట్లు - నక్సల్స్ లొంగుబాటు

1990లో పీపుల్స్‌వార్ గ్రూప్‌పై నిషేధం ఎత్తివేయడంతో లంపెన్‌లు, ప్రజా వ్యతిరేక శక్తులు పార్టీలో ప్రవేశించాయి. సిద్ధాంత పునాదులు లేని వీరు పోలీస్‌ల అణచివేత చర్యలతో లొంగుబాట పట్టారు. ఉద్యమం పెరుగుతున్న క్రమంలో పోలీస్‌లు నిర్బంధాన్ని ముమ్మరం చేసింది. ఎన్‌కౌంటర్‌లతో భయోత్పాతాన్ని సృష్టించారు. కూంబింగ్‌లు, దాడులతో పాటు నక్సల్స్ కుటుంబాలపై దాడులు చేయడం, భారీ మొత్తంలో డబ్బుల వలలు విసరడం, జనజీవన స్రవంతిలో కలిస్తే వాహనాలు ఇస్తామని, ఉపాధి కల్పిస్తామని ఆశలు చూపడంతో సిద్ధాంత బలంలేని నక్సలైట్లు పోలీసుల వలల్లో చిక్కారు. ఇదే సమయంలో జిల్లా నక్సల్స్‌కు స్ఫూర్తిగా నిలిచిన శాకమూరి అప్పారావు అరెస్ట్ నక్సల్స్‌పై ప్రభావం చూపింది. దీంతో దళనాయకులుగా పని చేసిన శంకరన్న



అలియాస్ రాజేంద్రప్రసాద్, చంద్రన్న, రామన్న, శ్రీనివాస్‌రెడ్డి, గణేశ్, రాజశేఖర్ మొదలగువారు పార్టీ నుంచి వైదొలిగారు. వందలాది మంది వార్ నేతలు, మిలిటెంట్లు లొంగిపోయారు. దళనేత జనార్ధన్ తదితరులు విరాళాలతో పారిపోయారు.

### ద్విముఖపోరుతో చంద్రవర్గం

బుల్లెట్, బ్యాలెట్‌లతో విప్లవ లక్ష్యాలను నెరవేరుస్తామని జిల్లాలో సిపిఐ (ఎం.ఎల్.) చంద్రవర్గం జనశక్తి పార్టీగా అంకురించింది. సాయుధ పోరాటాలతో ప్రజా సంఘాలు ప్రత్యక్ష సంబంధాలు కలిగి ఉండాల్సిన అవసరంలేదని చంద్రవర్గం ఒకవైపు, ప్రజా ఉద్యమాలతో కలిసి పోవాలని కొండపల్లి సీతారామయ్య వర్గం మరోవైపు పట్టుబట్టడంతో 1974లో విప్లవకారులు రెండు శ్రేణులుగా విడిపోయారు. ఈ నేపథ్యంలో మెదక్ కళాశాలలో పిడిఎస్‌యు విద్యార్థి సంఘం చంద్ర పుల్లారెడ్డి కార్యకలాపాలకు శ్రీకారం చుట్టింది. కరీంనగర్ జిల్లా కమిటీ కార్యదర్శి బోడా లక్ష్మారెడ్డి అలియాస్ జీవన్‌ల నేతృత్వంలో జిల్లాలో సాయుధ దళాలు ఏర్పడ్డాయి. మెదక్, రామాయంపేట, చేగుంట, వరిగుంతం, కొల్చారం, దుబ్బాక, మిరుదొడ్డి, చిన్నకోడూర్ తదితర ప్రాంతాలలో చంద్రవర్గం రైతుకూలి సంఘాలను ఏర్పాటు చేసి రైతులను విప్లవోన్ముఖులను చేశారు. అదే విధంగా బీడి కార్మికులతో కలిసి ఉద్యమాన్ని నిర్వహించారు. పోరాటాలతో కూలిరేట్లను పెంచారు. జిల్లాలోని వివిధ ప్రాంతాల్లో తునికాకు కల్లాలను దగ్ధం చేశారు. 1989లో సిద్ధిపేట, రామాయంపేట శాసనసభ నియోజకవర్గాలలో చంద్రవర్గం తమ అభ్యర్థులను నిలబెట్టి విప్లవ భావాలను ప్రచారం చేసుకున్నది. జిల్లాలో ఉద్యమాన్ని బలోపేతం చేయడంలో ప్రధాన పాత్ర పోషించిన దేగల సుభాష్ పోలీస్ కాల్పుల్లో మరణించగా మరోనేత శ్రీధర్ పోలీసులకు లొంగిపోయాడు. ఆ తర్వాత జాన్సన్, తాజాగా సంజీవ్ అలియాస్ మంతూరి నాగభూషణం తదితరులు పోలీసుల కాల్పుల్లో అమరులైనారు.

### బహుజన శ్రామిక శక్తిగా వీరన్న వర్గం

సిపి నక్సల్స్ పార్టీల నుండి సిద్ధాంత వైరుధ్యంతో వైదొలగిన వీరన్న వర్గం నక్సలైట్లు బహుజన శ్రామికశక్తి పార్టీగా ఆవిర్భవించింది. బహుజనుల ఐక్యత విప్లవోద్యమాన్ని నిర్మించాలని ఆశపడ్డ వీరన్నవర్గం వీరన్న ఎన్‌కౌంటర్‌తో బలహీనపడిపోయింది.

### శ్రేణుల ఘర్షణలు అమరులైన విప్లవకారులు

విప్లవ శ్రేణుల మధ్య జరిగిన ఘర్షణలో వార్, జనశక్తి నేతలు, మిలిటెంట్‌లు, అమాయకులు హతమైనారు. ఆధిక్యత కోసం జరిగిన ఈ పోరులో సిద్ధిపేట డివిజన్

అట్టుడికి పోయింది. 1989లో వార్ సానుభూతిపరుడు లింగం తమ్ముడు వెంకట్ గౌడ్‌ను చంద్రవర్గం కుమార్ దళం గొడ్డళ్ళతో నరికి చంపింది. ప్రతీకారంగా రామన్నదళం లింగారెడ్డిపల్లిలో జనశక్తి సానుభూతిపరుడు రాజిరెడ్డిని కాల్చివేసింది. చెప్యాలలో వార్ మిలిటెంట్ రాజన్నను చంద్ర వర్గం కాళ్ళు నరికి దారుణంగా హతమార్చింది. చంద్రవర్గం జోనల్ కమిటీ సభ్యుడు కుమార్‌ను వార్ నక్సల్స్ దారుణంగా హతమార్చి చెట్టుకు శవాన్ని వేలాడదీశారు. చిన్నకోడూర్ మండలంలో ఇద్దరు వార్ మిలిటెంట్లను చంద్రవర్గం కాల్చివేయగా పీపుల్‌వార్ చంద్రవర్గం జోనల్ కమిటీ సభ్యుడు కమలాకర్‌తో పాటు ఇద్దరు మిలిటెంట్లను హతమార్చింది. విప్లవ శ్రేణుల మధ్య ఘర్షణ విప్లవోద్యమానికి విఘాతం కలిగిస్తుందని ముంబాయి నుండి సెబాస్టియన్ నాయకత్వంలో వచ్చిన మేధావుల బృందం ఇరువర్గాలతో చర్చలు జరిపి శాంతి ఒప్పందాన్ని కుదిరించింది.

### పోలీస్ - వార్‌ల మధ్య నలిగిన సామాన్యులు

పోలీస్‌లు, నక్సల్స్ మధ్య జరిగిన ఆధిక్యతా పోరులో జిల్లాలోని సామాన్యులెందరో నలిగిపోయారు. నక్సల్స్‌కు అన్నం పెట్టారని, ఆశ్రయం ఇచ్చారని, వాహనాలను ఇచ్చారని పోలీసులు సామాన్యులను వేధించారు, బెదిరించారు, చితకబాది కేసులు పెట్టారు. మిరుదొడ్డి మండలంలో ఇద్దరు పశువులు కాసే అమాయక బాలురు పోలీస్ తూటాలకు బలయ్యారు. నక్సల్స్ కుటుంబాలపై, బంధువుల ఇండ్లపై పోలీస్‌లు దాడులు చేసి, సామాగ్రిని చిందరవందర చేసి భయోత్పాతాలను సృష్టించారు. అదే విధంగా నక్సల్స్ పోలీసు ఇన్‌ఫార్మర్‌ల పేరిట కొందరిపై దాడులు చేయడంతో పాటు నారాయణరావు పేట సమీపంలో జిల్లా ఉత్తమ యువజనసంఘనేత సుధాకర్‌రెడ్డితో పాటు నలుగురు యువకులను కాల్చివేశారు. ఈ విధంగా ఇరువర్గాల మధ్య నలిగిపోయిన కుటుంబాలు కొన్ని ఇతర ప్రాంతాలకు వలసవెళ్ళారు. మరికొందరు నక్సలైట్లలో కలిసిపోయారు. నక్సల్స్ భావాలు జిల్లాలో అంతర్‌వాహినిగా ప్రవహిస్తూనే వున్నాయి.

### గెరిల్లా పోరులోనక్సల్స్ - ఆధిక్యతలో పోలీస్‌లు

నిలువెల్లా గాయాలైనా ఉద్యమాన్ని జాగ్రత్తగా ముందుకు తీసుకు వెళ్ళడానికి నక్సల్స్ యాక్షన్ టీంలుగా ఏర్పడి రహస్యంగా, పరిమితంగా కార్యకలాపాలు నిర్వహిస్తున్నారు. గెరిల్లా పోరును ఎంచుకున్నారు. ఇక పోలీస్‌లు ఆధునిక ఆయుధాలు, నిఘాలతో ఉద్యమం నిర్మూలించటానికి చర్యలు తీసుకుంటున్నారు.





## ప్రజాసంఘాల ఉద్యమాలు - మెతుకుసీమ

కె. విరాహత్ అలీ

ప్రజలు తమహక్కుల సాధనకోసం, ప్రజల్లో సామాజికచైతన్యం కల్పించే లక్ష్యంతో ఆవిర్భవించిన ప్రజాసంఘాలఉద్యమాలకు మెతుకుసీమ ఊతమిచ్చింది. ముఖ్యంగా జిల్లాలో విద్యార్థిసంఘాలు, దళితసంఘాలు, పౌరహక్కుల సంఘాలు, జర్నలిస్టు సంఘం గడిచిన కాలంలో ప్రజలను చైతన్యపరిచే దిశలో జరిపిన కృషి అభినందనీయమని చెప్పవచ్చు. జిల్లాలో ప్రజా సంఘాల పుట్టుపూర్వోత్తరాలు, కార్యకలాపాలను పరిశీలించుద్దాం.

### జిల్లాలో జర్నలిస్టుల సంఘం

దాదాపు 23 ఏళ్ళ క్రితం మెదక్ జిల్లాలో ఆవిర్భవించిన జర్నలిస్టుల సంఘం తన కార్యకలాపాలతో రాష్ట్రంలో ప్రత్యేక స్థానాన్ని కైవసం చేసుకున్నది. కేవలం వృత్తిపరమైన సమస్యల పరిష్కారానికే పరిమితం కాకుండా సామాజికస్పృహతో ముందుకు సాగుతూ ప్రజలపక్షాన నిలబడి అనేకపోరాటాలు చేసి ఇతర జిల్లాలకు ఆదర్శంగా నిలిచింది. 1979-80 ప్రాంతంలో పట్టుమని పదిమంది సభ్యులతో జిల్లాలో జర్నలిస్టుల సంఘం ఆవిర్భవించింది. అప్పట్లో ఈ సంఘానికి సిద్ధిపేటకు చెందిన డాక్టర్‌దామోదర్, రామలింగం, మెదక్‌కు చెందిన కె.ఎన్.రావు, సంగారెడ్డికి చెందిన జెట్టినాగేశ్వర్‌రావు, అన్వర్ ఆబిద్, జోగిపేటకు చెందిన బండారుగాలయ్యాలు నాయకత్వం వహించారు. రాష్ట్రంలో అప్పటికే ఆం.ప్ర. వర్కింగ్‌జర్నలిస్టుయూనియన్ పటిష్టంగా ఉన్నప్పటికీ ఈ జిల్లాలో మాత్రం "మెదక్‌వర్కింగ్‌జర్నలిస్ట్స్‌యూనియన్" పేరిట సంఘ కార్యకలాపాలు కొనసాగేవి. అయితే ఆ సమయంలో జిల్లాలో పనిచేస్తున్న

జర్నలిస్టుల సంఖ్య కేవలం ఇరవైలోపే ఉండడం, పత్రికల సంఖ్య కూడా తక్కువగానే ఉండడంతో సంఘకార్యకలాపాలు అంతంతమాత్రంగానే ఉండేవి. 1982-83 ప్రాంతంలో మెదక్ వర్కింగ్‌జర్నలిస్ట్స్‌యూనియన్‌కు నాయకత్వం వహిస్తున్న కొందరు సీనియర్ పాత్రికేయులు వృత్తికి దూరం కావడంతో అప్పట్లో సంఘం నిర్వీర్యమొందింది. అయినా సంఘాన్ని మాత్రం విశ్వనాథం, సత్యనారాయణ, దేవయ్య, అంజయ్య తదితరులు ముందుకు తీసుకెళ్ళడానికి తమవంతు ప్రయత్నాలు కొనసాగించారు. 1989 నాటికి జిల్లాలో పాత్రికేయుల సంఖ్య 60కి చేరుకోవడంతో సంఘాన్ని పటిష్టపరిచేందుకు ప్రయత్నాలు ప్రారంభమైనాయి. ఇందులో భాగంగానే జిల్లా జర్నలిస్టులు సంగారెడ్డి జెడ్‌పి హాలులో సమావేశమై అప్పటి సీనియర్ జర్నలిస్టు ఎస్.వి.ప్రసాద్‌రావును కన్వీనర్‌గా, మరో 8 మందిని అడ్‌హక్ కమిటీ సభ్యులుగా ఎన్నుకున్నారు. అదే సమయంలో జర్నలిస్టులు రామలింగారెడ్డి, అంజయ్య, యాదగిరి తదితరులు సభ్యత్వసేకరణకు శ్రీకారంచుట్టారు. అప్పుడు "మెదక్ వర్కింగ్ జర్నలిస్ట్స్ యూనియన్" ఆం.ప్ర.వర్కింగ్‌జర్నలిస్ట్స్‌యూనియన్‌లోకి విలీనమైంది. 1990-91 నాటికి జిల్లాలో జర్నలిస్టుల సంఖ్య 80కి చేరుకుంది. 1990-91లో ప్రప్రథమంగా జిల్లా కేంద్రమైన సంగారెడ్డిలో ఆం.ప్ర. వర్కింగ్ జర్నలిస్టుల సంఘం మెదక్‌జిల్లా శాఖకు ఎన్నికలు జరుగగా తొలి అధ్యక్షుడిగా పులుగు శ్రీనివాస్‌రెడ్డి (అప్పటి ఉదయం జిల్లా ప్రతినిధి) ఎన్నిక కాగా, కార్యదర్శిగా వెంకటేశ్వర్‌రావు (ఆంధ్రజ్యోతి జిల్లా ప్రతినిధి) ఎన్నికయ్యారు. ఆ తర్వాత 1992-93లో జోగిపేటలో జరిగిన ఎన్నికల్లో అధ్యక్షులుగా జి.దేవయ్య, కార్యదర్శిగా వెంకటేశ్వర్ రావులు ఎన్నికయ్యారు. 1993-94లో అధ్యక్షులుగా దేవయ్య, కార్యదర్శిగా ఎస్.రామలింగారెడ్డి, 1995-96లో అధ్యక్షులుగా ఎస్.రామలింగారెడ్డి, కార్యదర్శిగా కె.ప్రసాద్‌రావులు ఎన్నికయ్యారు. 1996 నుండి 1999 వరకు మూడు పర్యాయాలు అధ్యక్షులుగా విరాహత్‌అలీ ఎన్నికకాగా కార్యదర్శులుగా పి.కృష్ణ, కె.ప్రసాద్‌రాజు ఎన్నికయ్యారు. 1999-2000లో అధ్యక్షులుగా ఎస్.రామలింగారెడ్డి ఎన్నికకాగా, 2000-01లో వరకు అధ్యక్షులుగా విరాహత్ అలీ, 2001-02లో అధ్యక్షులుగా వి.యాదగిరి, కార్యదర్శిగా కె.శ్రీనివాస్, 2002-04 వరకు అధ్యక్షులుగా విరాహత్ అలీ, కార్యదర్శిగా పి.ఆంజనేయులులు ఎన్నికయ్యారు. 2005లో జరిగిన ఎన్నికల్లో అధ్యక్షులుగా కె.రంగాచారి, కార్యదర్శిగా ఫైసల్ అహ్మద్‌లు ఎన్నికైనారు. మెదక్ జిల్లా జర్నలిస్టుల సంఘానికి గ్రామీణ విలేకరులే నాయకత్వం వహిస్తుండడం గమనార్హం. వామపక్ష భావాలతో జిల్లాలో జర్నలిస్టుల సంఘం ఉద్యమ నిర్మాణం జరుగుతుండడంతో 1990లో అప్పటి దుబ్బాక ఉదయం విలేకరి ఎస్.రామలింగారెడ్డిపై పోలీసులు అక్రమంగా కేసులు నమోదు చేయడం రాష్ట్ర వ్యాప్తంగా సంచలనం సృష్టించింది. ఆ సమయంలో ప్రభుత్వ చర్యను నిరసిస్తూ



జర్నలిస్టు సంఘం భారీ ఉద్యమాన్ని నిర్వహించింది. జిల్లాలో పత్రికా స్వేచ్ఛను హరిస్తూ జర్నలిస్టులపై అక్రమకేసులు నమోదుకావడం ఆ సంఘటననుండే మొదలైందని చెప్పవచ్చు. ఆ తర్వాత జిల్లాలో తరచుగా దాడులు, అక్రమకేసుల బనాయింపు, బెదిరింపుల పరంపర కొనసాగింది. 1997-98లో అప్పటి జిల్లా ఎస్.పి. వినయ్ కుమార్ సింగ్ జిల్లాలో జర్నలిస్టులను నక్సలైట్లుగా చిత్రీకరిస్తూ పత్రికా స్వేచ్ఛను హరించేందుకు పూనుకోగా జిల్లా జర్నలిస్టులసంఘం కొనసాగించిన ఉద్యమం రాష్ట్రంలో వినూత్న చరిత్రను సృష్టించింది. ఈ సందర్భంగా "జిల్లా జర్నలిస్టుల మరణ వాంగ్మూలం" అనే సుదీర్ఘ కరపత్రాన్ని ప్రచురించిన జర్నలిస్టులసంఘం వేలసంఖ్యలో వాటిని ప్రజల్లోకి విడుదల చేసింది. అంతేకాకుండా ప్రజాసంఘాలు, ప్రజలను కూడగట్టి నిర్విరామంగా నెల రోజులపాటు రాష్ట్రవ్యాప్తంగా ఉద్యమాన్ని చేపట్టింది. దాంతో జిల్లా ఎస్.పి.ని బదిలీ చేయక తప్పలేదు. అదే సమయంలో మెదక్ పాత్రికేయులు వెంకటేశ్‌గౌడ్, బాలేశ్వర్‌లపై పోలీసులు కక్ష్య సాధింపు చర్యలకు పాల్పడే వైఖరిని అవలంబించగా సంఘం ప్రతిఘటించింది. 2003లో జిల్లా మాజీ అధ్యక్షులు వి.యాదగిరిని కల్లు మాఫియా దారుణంగాహ్యత చేయడం రాష్ట్రంలో సంచలనం సృష్టించింది. ఈ ఘటనపై రాష్ట్ర వ్యాప్తంగా మళ్ళీ ఉద్యమానికి శ్రీకారంచుట్టిన జర్నలిస్టులసంఘం 24 గంటల్లో హంతకు లను అరెస్టు చేయించడమేగాకుండా బాధిత కుటుంబానికి న్యాయం చేకూర్చింది. కేవలం వృత్తిపరమైన అంశాలకే జిల్లా జర్నలిస్టుల సంఘం పరిమితం కాలేదు. ఎన్నో సామాజిక కార్యక్రమాలను చేపట్టింది. 1992లో జిల్లాలో ప్రప్రథమంగా సారా వ్యతిరేకోద్యమ సభను గజ్వేల్‌లో నిర్వహించి ఆ తర్వాత జిల్లా వ్యాప్తంగా ఉద్యమాన్ని ఉధృతం చేసింది. 1994-95లో "సమకాలీనసమాజంలో జర్నలిస్టులపాత్ర" అనే అంశంపై గజ్వేల్ పట్టణంలో ప్రజా గాయకుడు గద్దర్‌తో బహిరంగ సభ నిర్వహించింది. వ్యవసాయరంగంలో కీలకపాత్ర పోషించే పశుసంపదను అంతం చేసేందుకు జిల్లాలో అప్పుడే నెలకొల్పబడిన అల్‌కబీర్ పశువధశాలకు వ్యతిరేకంగా 1996లో జిల్లా కేంద్రమైన సంగారెడ్డిలో వేలాది మంది రైతాంగాన్ని కూడగట్టి ప్రదర్శన, బహిరంగసభను జర్నలిస్టులసంఘం ఏర్పాటు చేసింది. అదే సమయంలో జిల్లాలో అక్రమ ఇసుక రవాణాతో భూగర్భజలాలు అడుగంటి పోతున్న నేపథ్యంలో దానిని నిరసిస్తూ మండలకేంద్రమైన వెల్దుర్తిలో భారీప్రదర్శన, బహిరంగసభను ఏర్పాటుచేసింది. ప్రముఖ పర్యావరణవేత్త ప్రొఫెసర్‌పురుషోత్తంరెడ్డిని ఆ కార్యక్రమానికి ఆహ్వానించి సహజవనరుల పట్ల ప్రజల్లోఅవగాహన, చైతన్యం కల్పించింది. జిల్లాలో మహిళలపై జరుగుతున్న లైంగికదాడులు, వరకట్నహత్యలు, వేధింపులు, ఇతర అవమానాలను తీవ్రంగా పరిగణించిన జర్నలిస్టుల సంఘం 1998లో రామాయంపేటలో భారీబహిరంగసభను ఏర్పాటుచేయగా దాదాపు 6వేల

మంది మహిళలు హాజరవ్వడం విశేషం. ఆం.ప్ర. చైతన్య మహిళా సమాఖ్య అధ్యక్షురాలు అనురాధ, ప్రజాకవి నందిని సిధారెడ్డి తదితరులను ఈ కార్యక్రమానికి ఆహ్వానించి మహిళల్లో చైతన్యం నింపింది.

కాలుష్య రక్కసికి వ్యతిరేకంగా 1999లో హత్నూర మండలం దౌల్తాబాద్‌లో 2వేల మందితో జర్నలిస్టులసంఘం బహిరంగసదస్సును ఏర్పాటుచేసింది. పర్యావరణవేత్త ప్రొఫెసర్ పురుషోత్తం రెడ్డి, సీనియర్‌పాత్రికేయులు సతీష్‌చందర్ తదితరులను ఈ సభకు ఆహ్వానించి ప్రజలను చైతన్య పరిచింది. బాలకార్మిక వ్యవస్థ నిర్మూలనలో భాగంగా నర్సాపూర్, నారాయణఖేడ్ పట్టణాల్లో సదస్సులు నిర్వహించింది. గ్రామీణ ప్రాంతాల్లో అమాయకప్రజల ప్రాణాలుతీస్తున్న మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా మారుమూల దౌల్తాబాద్ మండలం వడ్డెపల్లి, తిర్మలాపూర్ గ్రామాల్లో సాంస్కృతిక సభలు నిర్వహించింది.

ఎక్కడా లేని ఓ సాంస్కృతిక ప్రయత్నాన్ని జిల్లా జర్నలిస్టుల సంఘం చేపట్టింది. గ్రామీణవిలేకరుల సాదకబాధలు, సమాజంలో జర్నలిస్టుల కర్తవ్యాలు, బాధ్యతలను గుర్తు చేస్తూ రూపొందించిన “కలం రాగాలు” ఆడియో క్యాసెట్ రాష్ట్రంలో ఎంతో ఆదరణ పొందింది.

**జిల్లాలో పౌరహక్కుల ఉద్యమాలు**

మెదక్ జిల్లాలో మాత్రం ఈ హక్కుల ఉద్యమ సంఘాలు ఏర్పాటు కావడానికి ఆలస్యం జరిగిన విషయం వాస్తవమే అయినప్పటికీ, జిల్లాలో జరిగిన అనేక రాజ్యహింస, సామాజిక హింస ఘటనలపై పౌరహక్కులసంఘం రాష్ట్రప్రతినిధులు నిజనిర్ధారణకమిటీలుగా జిల్లాలో పర్యటించి, విచారణలు జరిపి ఎన్నోవాస్తవాలను బహిర్గతంచేశారు.

మెదక్ జిల్లాలో విప్లవోద్యమ ప్రారంభదశలో జరిగిన ఓ ఎన్‌కౌంటర్‌ఘటనలో నలుగురు విప్లవకారులు ప్రాణం కోల్పోవడం జిల్లాలో పౌరహక్కుల ఉద్యమాల ప్రాధాన్యతకు ఊత మిచ్చిందని చెప్పవచ్చు. గిరాయిపల్లి అడవుల్లో జరిగిన ఈ ఎన్‌కౌంటర్లో నలుగురు ఉద్యమకారులను కాల్చిచంపిన సంఘటన అప్పట్లో రాష్ట్ర వ్యాప్తంగా సంచలనం సృష్టించింది. ఈ వాస్తవాలను హైకోర్టు దృష్టికి తేవడమే కాకుండా, రాష్ట్రంలో బూటకపు ఎన్‌కౌంటర్‌లకు ప్రభుత్వం శ్రీకారం చుట్టిందనే వాస్తవాన్ని ప్రజలకు తెలియజేయడంలో పౌరహక్కుల సంఘం ప్రధాన పాత్ర పోషించింది.

జిల్లాలో 1984లో పౌరహక్కుల సంఘం ఏర్పడింది. కొంతకాలం తర్వాత నిర్బంధ కారణంగా స్తబ్దతకు లోనయింది. మెదక్ జిల్లాలో తిరిగి పౌరహక్కుల సంఘం శాఖ



ఏర్పడాలనే తాపత్రయంతో కొందరు మేధావులు చేసిన కృషి ఫలితంగా 1995 డిసెంబర్ 26న మెదక్, కరీంనగర్ జిల్లాల ఉమ్మడి కమిటీ ఒకటి ఏర్పాటైంది. ఆం.ప్ర. పౌరహక్కుల సంఘం ఆనాటి ప్రధాన కార్యదర్శి బాలగోపాల్ నేతృత్వంలో కరీంనగర్ జిల్లా సిపిఐ కార్యాలయ ఆవరణలో సమావేశమైన కొందరు మేధావులు రెండు జిల్లాల ఉమ్మడి కమిటీని ఏర్పాటు చేయాలని తీర్మానం చేయగా, కన్వీనర్, కో–కన్వీనర్‌లతో పాటు 8 మంది సభ్యులతో మెదక్, కరీంనగర్ ఉమ్మడి కమిటీ ప్రారంభమైంది. ఇందులో భాగంగానే ఆ కమిటీ కన్వీనర్‌గా కరీంనగర్ జిల్లాకు చెందిన సుధాకర్‌రెడ్డి, కో–కన్వీనర్‌గా మెదక్ జిల్లాకు చెందిన బయ్యారం రాంరెడ్డిని నియమించడం జరిగింది. రెండున్నర ఏళ్ళ పాటు కొనసాగిన ఆ కమిటి ఆధ్వర్యంలో జిల్లాలో జరిగిన అనేక అణచివేతలపై ఉద్యమాలు జరిగాయి. అప్పట్లో జిల్లా వ్యాపితంగా విస్తరించి ఉన్న విప్లవోద్యమంపై పోలీసుల అణచివేత జోరుగా సాగింది. ఈ అణచివేతతో అనేకమంది అమాయకప్రజలను అనుమానితులుగా చేసి వేధించడం పోలీసులకు నిత్యకృత్యంగా మారింది. ఈ నేపథ్యంలో పౌరహక్కుల సంఘానికి తనశక్తికి మించి పనిచేయాల్సి వచ్చింది. ఈ క్రమంలో ఆం.ప్ర. పౌరహక్కుల సంఘం 1998 ఆగస్టు 22న మెదక్ పట్టణంలో మొదటి మహాసభను నిర్వహించి నూతనకమిటీని ఎన్నుకుంది. ఇందులో భాగంగానే కన్వీనర్‌గా అంజిరెడ్డి, కో–కన్వీనర్‌గా యం.అశోక్ కుమార్‌లు ఎన్నిక కాగా, మరో ఆరుగురు సభ్యులను కమిటీలో ఎన్నుకున్నారు. జిల్లాలో జరిగిన అనేక పౌరహక్కుల ఉల్లంఘనలను వెలికితీసిన ఈ కమిటీ, ఆ సమయంలో జరిగిన బూటకపు ఎన్‌కౌంటర్లు, లాకప్ హత్యలు, పోలీసుల వేధింపులతో జరిగిన మరణాలపై తీవ్రంగా స్పందించింది. రెండేళ్ళ పాటు కొనసాగిన ఈ కమిటీ జిల్లాలో 11 సమావేశాలు ఏర్పాటు చేసి దళితులపై జరిగిన దాడులను, మహిళలపై కొనసాగిన రాజ్యహింసను, పత్రికా స్వేచ్ఛపై జరిగిన దాడులను ప్రతిఘటించింది.

జిల్లాలో అదే సమయంలో జరిగిన అనేక ఎన్‌కౌంటర్లలో నక్సలైటు దళాలు మొత్తంగా తుడిచిపెట్టుకు పోవడంతో పౌరహక్కుల ఉద్యమానికి చాలా ప్రాధాన్యత ఏర్పడింది. జిల్లాలో రెండేళ్ళ కాలంలోనే అయిదు దళాలు ఎన్‌కౌంటర్ల సంఘటనల్లో బలైపోవడంతో పౌరహక్కుల ఉద్యమాలు ఉధృతంగా కొనసాగాయి. ఓ వైపు ఎన్‌కౌంటర్ మృతదేహాలను స్వాధీనం చేసుకొని వారి బంధువులకు చేరవేయడంతో పాటు, జరిగిన సంఘటనల వాస్తవాలను బహిర్గతం చేస్తూ పోలీసుల ఏకపక్ష కాల్పుల వివరాలను ప్రజలకు తెలియజేయడంలో కీలకపాత్రను పోషించాయి. జహీరాబాద్, దుబ్బాక పోలీస్‌స్టేషన్లలో జరిగిన లాకప్ హత్యలపై విస్తృతంగా ప్రచారం జరిపి ప్రజలను చైతన్యపరిచాయి. మెదక్ మండలంలోని ‘వాడి’ గ్రామంలో మహిళలపై పెట్టిన కేసులపై

రాష్ట్రవ్యాప్తంగా జిల్లా పౌరహక్కులసంఘం ప్రచారం నిర్వహించింది. జిల్లాలో వెనుకబడిన ప్రాంతమైన నారాయణ్‌ఖేడ్ నియోజకవర్గంలోని శివారు గ్రామాలైన కరస్‌గుత్తి, మనూర్ తదితర గ్రామాలను సందర్శించి అక్కడి సామాజిక వెనుకబాటుతనానికి, కరువుకు కారణమైన పరిస్థితులను వెలుగులోకి తెచ్చాయి. ఉరిశిక్షల రద్దును కోరుతూ జిల్లాలో పోస్టర్లను విడుదల చేసి ప్రచారం నిర్వహించింది. పౌరహక్కుల సంఘం మెదక్ జిల్లా రెండవ మహాసభలను సిద్ధిపేటలో జరుపుకుంది. ఈ మహాసభలో పూర్తి స్థాయి కార్యవర్గాన్ని ఎన్నుకొని అనేక ఉద్యమాలను నిర్వహించింది. 2001 జనవరిలో పురుషోత్తం సంస్మరణ సభను ఏర్పాటు చేసింది. అప్పటికే రాష్ట్ర వ్యాప్తంగా పౌరహక్కుల సంస్థల బాధ్యులపై హంతక ముఠాల బెదిరింపులు మొదలయ్యాయి. ఈ పరిస్థితుల్లో జిల్లాలో పౌరహక్కులసంస్థ ప్రభావం స్తబ్దంగా ఉండి పోయింది.

## మానవ హక్కుల వేదిక

పౌరహక్కులసంఘంలో వచ్చిన సైద్ధాంతికవిభేదాలు మెదక్‌జిల్లాలో సైతం ప్రభావితం చేశాయి. పౌరహక్కుల సంఘం రాష్ట్ర శాఖ 1997లో గుంటూరులో మహాసభ జరిపి మెజారిటీ సభ్యులకు అనుకూలమైన నూతన కమిటీని ఎన్నుకున్నారు. అప్పటివరకు ఈ సంఘానికి రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా కొనసాగిన బాలగోపాల్ సైద్ధాంతపరంగా విభేదించి కొద్దిమందితో విడిపోయి మానవ హక్కుల వేదిక ఏర్పాటు చేశారు. ఈ నేపథ్యంలో మెదక్ జిల్లాలో కూడా రెండు హక్కులసంఘాలు ఏర్పడ్డాయి. అప్పటివరకు జిల్లా కీలక బాధ్యతల్లో ఉన్న బయ్యారంరాంరెడ్డి బాలగోపాల్ ఏర్పాటు చేసిన మానవహక్కుల వేదికతో కలిసి ఆ సంస్థ జిల్లా బాధ్యుడిగా పని చేశారు.

బాలగోపాల్ ఆధ్వర్యంలో ఏర్పాటైన మావన హక్కుల వేదిక జిల్లా శాఖ బయ్యారం రాంరెడ్డి, హరి, స్వామి తదితర సభ్యులతో ఏర్పాటై ఉద్యమ కార్యక్రమాలను జిల్లాలో విస్తరించింది. కొద్దికాలానికే బయ్యారం రాంరెడ్డి గుండెపోటుతో మృతి చెందగా, మిగతా సభ్యులతో మానవహక్కులవేదిక పనిచేస్తున్నది. ఆసంస్థ రైతుల ఆత్మహత్యలపై, చేనేతకార్మికుల ఆత్మహత్యలపై, ఆకలి చావులపై విచారణ జరిపి వాస్తవాలను వెలికి తీసింది.

జిల్లాలో నక్సలైటుఉద్యమ ప్రభావాన్ని అరికట్టడానికి పోలీసులు జరిపిన అనేక చర్యలతో జిల్లా ప్రజలపై అణచివేత తీవ్రంగా కొనసాగింది. ఈ అణచివేత స్వరూపాలను ప్రచారం చేస్తూ ప్రజలను చైతన్య పరిచిన పౌరహక్కుల సంఘం అప్పటి రాష్ట్ర సహాయ కార్యదర్శి టి.పురుషోత్తం చైతన్యస్ఫూర్తితో రెండేళ్ళపాటు సమర్థవంతంగా పని చేయగలిగింది. ఈ రెండేళ్ళ కాలంలో జిల్లాలో జరిగిన 84 సంఘటనలపై



కమిటి విచారణ జరిపి వాస్తవాలను ప్రచారం చేయడం సంస్థ చేసిన కృషికి నిదర్శనంగా చెప్పవచ్చు.

## త్యాగాలకు మారుపేరుగా విద్యార్థి ఉద్యమాలు

మెదక్ జిల్లాలో విద్యార్థిఉద్యమాలు ఇవ్వాళ కొత్తేమీ కాదు. నాలుగు దశాబ్దాల సుదీర్ఘచరిత్రలో జిల్లాలో ఎన్నో పోరాటాలు జరిపిన విద్యార్థులు తమ ప్రాణాలను సైతం త్యాగం చేసి ఇతర జిల్లాలకు స్ఫూర్తిగా నిలిచారు. 1969-70లో మర్రి చెన్నారెడ్డి నేతృత్వంలో జరిగిన తెలంగాణోద్యమంలో జిల్లా విద్యార్థులు పోషించిన పాత్ర ఎంతో కీలకం. జిల్లా వ్యాప్తంగా ఈ ఉద్యమం విస్తరించిపోవడంతో ఉద్యమం హింసారూపం దాల్చక తప్పలేదు. విద్యార్థులు తమచదువులను సైతం ప్రక్కనబెట్టి ప్రత్యక్షంగా ఉద్యమంలో పాలు పంచుకుంటూ మరింత తీవ్రతరం చేశారు. 1969 జనవరిలో సదాశివపేటలో ప్రత్యేక తెలంగాణ ఊరేగింపు బంద్‌కు నాయకత్వం వహిస్తూ సారకృష్ణ, పద్మశాలి శంకర్, గంగారాంలు పోలీసు కాలుపుల్లో మరణించారు. గజ్వేల్ పట్టణంలో అప్పటికే ఎంతో పటిష్టంగా ఉన్న విద్యార్థిసంఘానికి నాగిరెడ్డి, అల్తాఫ్‌లు నాయకత్వం వహించారు. వారిచ్చే పిలుపుకు అప్పట్లో వందలాది మంది విద్యార్థులు రోడ్డుపైకి వచ్చి ధర్నాలు, రాస్తారోకోలు, బంద్‌లు వంటి ఆందోళనలో పాలు పంచుకునే వారు. ఆ తర్వాత విద్యార్థి సంఘానికి గజ్వేల్ మండలం బూర్గుపల్లి గ్రామానికి చెందిన వి.కిష్టారెడ్డి, అహ్మదీపూర్ గ్రామానికి చెందిన శ్రీనివాస్‌రెడ్డిలు నాయకత్వం వహిస్తూ జిల్లాలో ఎక్కడలేని విధంగా ఆందోళనా కార్యక్రమాలు నిర్వహించేవారు. 1969 ఫిబ్రవరిలో గజ్వేల్‌లో వందలాది మంది విద్యార్థులు తరగతులను బహిష్కరించి ప్రదర్శన జరుపుతుండగా ఆ సమయంలో ఇక్కడ పనిచేసిన ఆంధ్రప్రాంతానికి చెందిన సబ్ఇన్‌స్పెక్టర్ ప్రదర్శనను భగ్నంచేసేందుకు ప్రయత్నించాడు. దీంతో మరింత రెచ్చిపోయిన విద్యార్థులు ఎస్.ఐ.కు వ్యతిరేకంగా పెద్దపెట్టున నినాదాలు చేయడంతో ఉద్రిక్తవాతావరణం చోటుచేసుకుంది. పోలీసులు కాల్పులు జరపగా గజ్వేల్‌కుచెందిన హైస్కూల్‌విద్యార్థి అయిలనర్సింలు (13) నేలకొరిగాడు. అతని వీరమరణం ఒక్క మెదక్ జిల్లాలోనే కాదు తెలంగాణాలోని ప్రతి విద్యార్థికి స్ఫూర్తిదాయకంగా నిలిచింది. 1976 తర్వాత మళ్ళీ విద్యార్థి సంఘాల కదలిక జిల్లాలో కన్పించినా అంతంత మాత్రంగానే ఉండేది. 1980లో మాత్రం విద్యార్థి సంఘాల ఉద్యమాలు ఒక్కసారిగా ఊపందుకున్నాయి.

1979-80లో జిల్లాలో ప్రగతిశీల ప్రజాస్వామిక విద్యార్థి సంఘం (పిడిఎస్‌యు) ఆవిర్భ వించింది. కొల్చారం మండలం వరిగుంతం గ్రామానికి చెందిన విద్యార్థి

సత్యనారాయణ ఉద్యమానికి బీజం నాటారు. సాంఘిక సంక్షేమ హాస్టళ్ళలో జరిగిన దోపిడికి వ్యతిరేకంగా మెదక్ కేంద్రంలో పిడిఎస్‌యు ఉద్యమం ప్రారంభమైంది. ఇదే స్ఫూర్తితో మెదక్ తాలూకాలో ఉద్యమం విస్తరించి విద్యార్థులు అనేక పోరాటాలు చేశారు. కొల్చారం మండలంలోని కొన్ని గ్రామాల్లో భూస్వాములకు వ్యతిరేకంగా జరిగిన రైతాంగ పోరాటాల్లో పిడిఎస్‌యు కార్యకర్తలు ప్రత్యక్షంగా పాలుపంచుకోవడం విశేషం. మెదక్ విద్యార్థుల స్ఫూర్తితో దుబ్బాక, సిద్ధిపేట ప్రాంతాలకు ఉద్యమం విస్తరించడంతో వామపక్ష భావాలు కలిగి ఉన్న పలువురు విద్యార్థులు పిడిఎస్‌యు ఉద్యమానికి ఊతమిచ్చారు. 1982-83లో మెదక్ కళాశాలలో పిడిఎస్‌యు, ఎబివిపి కార్యకర్తల మధ్య జరిగిన ఘర్షణ జిల్లాలో అప్పట్లో చర్చనీయాంశ మైంది. ఆ తర్వాత జిల్లాలోని ఆయా కళాశాలల్లో విద్యార్థి సంఘ ఎన్నికల్లో పిడిఎస్‌యు తమ అభ్యర్థులను పోటీలోకి దింపి పలుచోట్ల విజయం సాధించింది.

అదే కాలంలో జిల్లాలో రాడికల్ విద్యార్థి సంఘం (ఆర్ఎస్‌యు) ఆవిర్భవించింది. సిద్ధిపేట ప్రభుత్వ కళాశాలలో జూనియర్ కళాశాల అధ్యక్షుడుగా రాజేంద్రప్రసాద్ ఎన్నికైనాడు. ఈ క్రమంలో 1983-84లో దుబ్బాక కళాశాలలో జరిగిన విద్యార్థి సంఘ ఎన్నికల్లో ఆర్ఎస్‌యు నుండి పోటీ చేసిన రామలింగారెడ్డి అనే విద్యార్థి అధ్యక్షుడిగా విజయం సాధించాడు. ఈ ఎన్నికతో విద్యార్థుల్లో వామపక్ష భావాల్ని పసిగట్టి జిల్లాలో ఆర్ఎస్‌యు కార్యకలాపాలను విస్తరించేందుకు నిర్ణయించు కున్నారు. ఇందులో భాగంగానే 1984-85లో ఆర్ఎస్‌యు జిల్లా తొలి మహాసభ గజ్వేల్ పట్టణంలో ఏర్పాటు కాగా, జిల్లా కమిటి అధ్యక్షులుగా రామలింగారెడ్డిని, కార్యదర్శిగా భానుప్రసాద్‌ను ఎన్నుకున్నారు. అదే సమయంలో సిద్ధిపేట డిగ్రీ కళాశాలలో జరిగిన విద్యార్థి సంఘ ఎన్నికల్లో ఆర్ఎస్‌యు తమ అభ్యర్థులను రంగంలోకి దింపగా పథకం ప్రకారం ఏవేవో సాకులు చూపి ఆర్ఎస్‌యు అభ్యర్థుల నామినేషన్లను తిరస్కరించారు. దాంతో విద్యార్థులు ఆగ్రహానికి గురై కళాశాల ప్రిన్సిపాల్ కార్యాలయంపై దాడి జరిపి భీభత్సం సృష్టించడం, భారీ పోలీసు బందోబస్తు మధ్య విద్యార్థిసంఘ ఎన్నికలు జరగడం అప్పట్లో సంచలనం సృష్టించింది. "విద్యార్థుల్లారా గ్రామాలకు తరలండి" అనే పిలుపుపై స్పందిస్తూ ఆర్ఎస్‌యు ఆధ్వర్యంలో గ్రామగ్రామాన సభలు, సమావేశాలు నిర్వహించారు. రామలింగారెడ్డి, భానుప్రసాద్, శ్యాంమనోహర్, రాజేంద్ర ప్రసాద్, విజయానంద రెడ్డిలు అప్పట్లో ఆర్ఎస్‌యులో కీలకపాత్ర పోషించారు.

1986-87లో జరిగిన విద్యార్థి సంఘ ఎన్నికల్లో గజ్వేల్ జూనియర్ కళాశాలలో ఆర్ఎస్‌యు నుండి అధ్యక్ష పదవికి పోటీ చేసిన భానుప్రసాద్ భారీ మెజారిటీతో విజయం సాధించారు. కళాశాల వార్షికోత్సవ సభకు ప్రజా గాయకులు గద్దర్‌ను ఆహ్వానించడం విద్యార్థిలోకాన్ని ఎంతో ఆకర్షించింది. కేవలం విద్యార్థుల సమస్యలు



పరిష్కారానికే పరిమితం కాకుండా రైతులకు, పేద ప్రజలకు బాసటగా నిలిచిన ఆర్ఎస్‌యు అప్పట్లో ఎన్నో పోరాటాలు నిర్వహించింది. ఆ తర్వాత ఆర్ఎస్‌యుపై పోలీసుల నిర్బంధం పెరిగిపోవడం, దానికి నాయకత్వం వహించిన భానుప్రసాద్, రామలింగారెడ్డి అరెస్టు కావడంతో కొంతకాలం సంఘ కార్యకలాపాలు నిలిచి పోయాయి. 1991 తర్వాత జిల్లాలో విప్లవోద్యమం బలోపేతం కావడంతో మళ్ళీ ఆర్ఎస్‌యు తెరమీదికి వచ్చింది. గజ్వేల్ పాలిటెక్నిక్ కళాశాలకు చెందిన కొందరు విద్యార్థులు ఈ సంఘానికి నాయకత్వం వహిస్తూ ర్యాగింగ్‌కు వ్యతిరేకంగా, స్కాలర్‌షిప్‌ల సాధన కోసం ఉద్యమించారు. 1999 తర్వాత జిల్లా విప్లవోద్యమాలు తగ్గుముఖం పట్టడంతో ఆర్ఎస్‌యు కార్యకలాపాలు కనుమరుగైపోయాయి.

జిల్లాలో ప్రగతిశీల భావాలతో పిడిఎస్‌యు, ఆర్ఎస్‌యు సంఘాలే కాకుండా ఎస్ఎఫ్ఐ, ఎఐఎస్ఎఫ్ విద్యార్థి సంఘాలు సైతం విద్యార్థులను చైతన్యపర్చడంలో కీలక పాత్ర పోషించాయని చెప్పవచ్చు. 1973-80 నుండే జిల్లాలో ఎబివిపి కార్యకలాపాలు విస్తృతంగా కొనసాగుతున్నాయి. ఈ సంఘాన్ని పటిష్టపరిచేందుకుగాను అప్పుడు వందలాది మంది విద్యార్థులు పూర్తి స్థాయి కార్యకర్తలుగా పని చేస్తూ విద్యార్థులను కూడగట్టడం జరిగింది. నాటి నుండి నేటి వరకు ఒకే సిద్ధాంతంతో పని చేస్తున్న ఎబివిపి జిల్లాలో విద్యార్థుల హక్కుల సాధన కోసం ఆందోళనా కార్యక్రమాలు చేపడుతూనే ఉంది. విద్యార్థులను ఆకర్షించి విద్యార్థి సంఘాలు జిల్లాలో తమ కార్యకలాపాలను నిర్వహిస్తున్నాయి. విద్యార్థి సంఘాలకు ఎన్నికలు జరిగిన సమయంలో వీటి ప్రభావం తీవ్రంగా కన్పించినా 1989 తర్వాత ఎన్నికల నిషేధం విధించడంతో నామమాత్రంగానే పని చేస్తున్నాయని చెప్పవచ్చు. జిల్లాలో ప్రస్తుతం ఎబివిపి, ఎన్ఎస్‌యుఐ, ఎస్ఎఫ్ఐ విద్యార్థి సంఘాలే బలంగా ఉన్నాయి. వీటితోపాటు టిఎన్ఎస్ఎఫ్, బహుజన స్టూడెంట్స్ ఫ్రంట్, తెలంగాణా రాష్ట్ర విద్యార్థి సంఘం, ఎఐఎస్ఎఫ్‌లు తమ కార్యకలాపాలు కొనసాగించడం కన్పిస్తుంది. 1998లో జిల్లాలో తెలంగాణా స్టూడెట్స్ ఫెడరేషన్ (టిఎస్ఎఫ్) పని చేసింది. ప్రస్తుతం తెలంగాణ ఉద్యమంలో టిఆర్ఎస్‌వి పుట్టి పనిచేస్తున్నది.

ఏదిఏమైనా జిల్లాలో నాటి నుండి నేటి వరకు విద్యార్థి సంఘాలు పోషిస్తున్న పాత్ర ప్రశంసనీయంగానే ఉందని చెప్పవచ్చు.

## జిల్లాలో దళితోద్యమం - సంఘాలు

మెదక్ జిల్లాలో దళితుల స్థితిగతులను పరిశీలిస్తే జిల్లా అంతటా పరిస్థితులు ఒకే విధంగా కన్పించవు. ఒక్కొక్క డివిజన్లో ఒక్కొక్క తీరుగా ఉంటుంది. సిద్ధిపేట డివిజన్

విద్యాపరంగా మిగతా డివిజన్‌ల కంటే కొంత ముందున్నందున ఈ ప్రాంత ప్రజల్లో సామాజికంగా కొంతమార్పు కన్పిస్తుంది. దళితులు విద్యాపరంగా కొంత ముందున్నారు. దీనికి తోడు సిద్దిపేట ప్రాంతం కరీంనగర్, వరంగల్ జిల్లాలకు సరిహద్దులో ఉన్నందున విప్లవ పోరాటాల వారసత్వాన్ని అందుకొంది. పోరాటాల్లో ముందంజలో ఉంది. మెదక్ డివిజన్‌ను పరిశీలిస్తే ఈ డివిజన్ పరిధిలోని కొన్ని మండలాలు సిద్ధిపేట డివిజన్‌కు ఆనుకొని ఉన్నందున దళితుల్లో కొంత ఉద్యమ స్ఫూర్తి కన్పిస్తుంది. విద్యావకాశాలను మాత్రం దళితులు అంతపెద్దగా అందుకోలేక పోయారని చెప్పవచ్చు. ఈ డివిజన్‌లోని నారాయణఖేడ్, జోగిపేట నియోజకవర్గాల్లో భూస్వామ్య పెత్తందారి వ్యవస్థలో దళితులు తీవ్ర అణచివేతకు గురయ్యారని చెప్పవచ్చు. ఆసక్తికర విషయమేమిటంటే అగ్రకుల అఘాయిత్యాలను తట్టుకోలేక మెదక్ డివిజన్ పరిధిలోని దళితులు జిల్లాలో అందరికంటే ముందుగా క్రైస్తవ మతాన్ని స్వీకరించడం గమనార్హం. ఆ తర్వాత సమాజంలో తమకు కొంత గౌరవం పెరగడంతో విద్యావకాశాల వైపు ఆకర్షితులై ప్రభుత్వ ఉద్యోగాలలో స్థిరపడ్డారు. అయితే మత మార్పిడి చేసుకున్న ఈ దళితులు క్రైస్తవులుగానే మెదులుతున్నారే తప్ప సాటి దళితుల సాధక బాధలపై మాత్రం దృష్టి సారించడం కన్పించలేదు. 1985 వరకు జిల్లాలో దళితసంఘాలు లేకపోవడంతో కమ్యూనిస్టులే వారికి అండగా నిలిచి పోరాటాలు చేసేవారు. ఆ తర్వాత దళితుల్లో వచ్చిన చైతన్యంతో అంబేద్కర్ సంఘం కార్యకలాపాలు మొదలై అగ్రకుల పోకడలకు వ్యతిరేకంగా పోరాటాలు మొదలయ్యాయని చెప్పవచ్చు. సంగారెడ్డి డివిజన్‌ను పరిశీలిస్తే సామాజిక చైతన్యం అంతంత మాత్రంగానే కన్పిస్తుంది. అయితే పారిశ్రామికంగా ఎదిగిన ఈ ప్రాంతంలో దళితులకు ఉపాధి అవకాశాలు లభించడంతో విద్యాపరంగా కొంత ప్రగతి సాధించుకోగలిగారు. కానీ సామాజిక చైతన్యం లేక అగ్రవర్ణ భూస్వామ్య భావజాలానికి అడ్డకట్ట వేయలేక పోతున్నారు.

జిల్లాలో కొన్ని ముఖ్యమైన సంఘటనలను పరిశీలిస్తే 2001 జులై 28న టేక్మాల్ మండలం సూరంపల్లి గ్రామంలో ఒకే ఇంట్లో ఐదుగురు దళిత కుటుంబ సభ్యులు హత్యకు గురవ్వడం రాష్ట్ర వ్యాప్తంగా సంచలనం సృష్టించింది. ఈ సంఘటనకు ముందే నారాయణఖేడ్‌లో హాస్టల్‌లో ఉంటున్న ఓ దళిత మైనర్ బాలికపై అగ్రకుల రాజకీయుడొకరు అత్యాచారానికి ప్రయత్నించిన సంఘటన దళితులను పోరాటానికి ఉసిగొల్పింది. ఇదే సమయంలో తూప్రాన్ మండలం మాచాపూర్ గ్రామంలో రామస్వామి అనే దళితుడిని కల్లులో విషయం కలిపి హత్య చేశారు. దుబ్బాక మండలం గోసాన్‌పల్లిలో దళితుల గ్రామబహిష్కరణసంఘటన కూడా జిల్లాలో సంచలనం సృష్టించింది. పాపన్నపేట మండలం కొత్తపల్లిలో అంగన్‌వాడీ కార్యకర్తగా పని చేస్తున్న దళిత యువతిపై అత్యాచారం ఘటన, ఝరాసంగం మండలం కుప్పానగర్ గ్రామంలో దళిత యువతిపై అత్యాచారం, గజ్వేల్ మండలం దిలాల్‌పూర్ గ్రామంలో నర్సింలు అనే దళితుడిపై దాడి, గ్రామ బహిష్కరణ, రాయికోడ్ మండలం మాటూర్ గ్రామంలో దళితులైన మైసమ్మ, శివయ్య, పేరమ్మలపై మంత్రగాళ్ళ నిందమోపి వారి ఇళ్ళను దహనం చేయడం, హత్నూర్ మండలంలో మంత్రగాళ్ళ నెపంతో దళితులకు మలమూత్రాలు త్రాగించడం, నారాయణఖేడ్ మండలం బెల్లాపూర్ గ్రామంలో దళితుల గ్రామ బహిష్కరణ, వెల్దుర్తి మండలం హస్తాల్‌పూర్ గ్రామంలో మన్నెకిషన్ మరియు అతని భార్యను చెప్పులతో కొట్టడం, దుబ్బాక మండలం ధర్మాజిపేటలో రాజు అనే దళితుడిపై సర్పంచ్ దాడి, అల్లాదుర్గం మండల కేంద్రంలోని ఎస్‌సి హాస్టల్‌లో విశ్వనాథ్ అనే విద్యార్థిని పోలీసులు కొట్టి చంపడం, రాయికోడ్ మండలం ఔరంగనగర్ గ్రామంలో వీరయ్య, నాగమణి, మారుతి, శంకర్ అనే దళితులపై గ్రామ సర్పంచ్ మరియు కొందరు అగ్రకులస్థుల దాడి, సంగారెడ్డి మండలం గంగారం గ్రామానికి చెందిన దళిత మహిళ సమ్మమ్మ విద్యుత్ చార్జీల పెంపుపై అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబును నిలదీసిన పాపానికి టిడిపి నాయకులు ఆమెను వేధించి గ్రామ బహిష్కరణ చేయడం, కొండాపూర్ మండలం తొరపల్లి గ్రామంలో సంజీవరావు అనే దళితుడు అగ్రవర్ణాల చేతిలో హత్యకు గురవ్వడం, వర్గల్ మండలం పాములపర్తిలో దళిత సర్పంచ్ మంజులను కొందరు అగ్రవర్ణస్తులు అహంకారంతో గద్దెదింపడం, ఆమెను వేధింపులకు గురిచేయడం, మునిపల్లి మండలం బొడిచెట్టిపల్లి గ్రామ దళిత మహిళాసర్పంచ్‌ను తమ అడుగుజాడల్లో నడుచుకోకుంటే చంపేస్తామని బెదిరించడం, సిద్ధిపేట మండలం కల్వకుంట గ్రామంలో ఓ దళిత మహిళపై అత్యాచారం, దౌల్తాబాద్ మండలం వడ్డెపల్లిలో రాజు అనే దళిత యువకుడు కరీంనగర్ పోలీసుల వేధింపులు భరించలేక ఆత్మహత్య, గజ్వేల్ మండలం కోమటిబండలో ఓ మైనర్ బాలికపై ఆత్యాచారం, దాడి ఇలా జిల్లాలో 1999 నుండి 2003 వరకు చోటు చేసుకున్న సంఘటనల్లో మచ్చుకు కొన్ని మాత్రమే. అంతకుముందు జిల్లాలో పలుచోట్ల అవమానాలు, అంటరానితనాల సంఘటనలు చోటుచేసుకున్నా అందులో కొన్ని మాత్రమే బయటకు వచ్చాయి. ముఖ్యంగా దళితుల్లో ఉన్న అజ్ఞానాన్ని ఆసరాగా చేసుకుంటూ వారిపై అఘాయిత్యాలకు పాల్పడడం కన్పిస్తుంది. జిల్లాలో నేటి వరకు చాలా ప్రాంతాల్లో రెండు గ్లాసుల పద్ధతి, దేవాలయాల్లోకి దళితులను అనుమతించక పోవడం లాంటి పాశవిక చర్యలు కొనసాగుతున్నాయి. మూఢనమ్మకాల ముసుగులో జరుగుతున్న దాడుల్లో అధికశాతం బలవుతుందిదళితులే. ప్రజాప్రతినిధులుగా దళితులకు అవకాశాలు దక్కుతున్నప్పటికీ వారిని అడ్డుపెట్టుకొని పెత్తనం చేయించేది

అగ్రకులాల రాజకీయులే. అయితే జిల్లాలో విప్లవోద్యమాల ప్రభావం తీవ్రంగా ఉన్న సమయంలో దళితులు కొంతమేరకు రక్షణ పొందారని చెప్పవచ్చు. ఆ తర్వాత ఉద్యమాల ప్రభావం తగ్గిపోవడంతో మళ్ళీ దళితులపై దాడులు, అవమానాలు, సంఘటనలు వెలుగు చూస్తున్నాయి.

జిల్లాలో దళితులు భిన్నరూపాలు కలిగిఉన్నప్పటికీ సమస్యల పరిష్కారానికి, దళిత ఉద్యమాలు నిర్మించడంలో 1990కి ముందు దళిత సంఘాలు గానీ, వ్యక్తులు గానీ కన్పించలేదు. రెండు దశాబ్దాల క్రితం 'దఫోడమ్' అనే సంఘం జిల్లాలో తెరమీదికి వచ్చి కొన్ని సంఘటనలపై స్పందించిన తీరు సంతృప్తిగానే ఉన్నప్పటికీ ఆ తర్వాత రెండేళ్ళకే అనివార్య కారణాలతో అది కనుమరుగైపోయింది. రాష్ట్రవ్యాప్తసంఘమైన అంబేద్కర్ సంఘం, అంబేద్కర్ యువజన సంఘం జిల్లాలో పని చేసినా అవి వ్యక్తుల మీద ఆధారపడి ఉండడంతో కొన్ని ఒడిదుడుకులతో ముందుకు సాగుతున్నాయి. 1996లో ఏబిసిడి వర్గీకరణ ప్రాతిపదికగా జిల్లాలో మాదిగహక్కులదండోరా ఏర్పడి దళితుల్లో చైతన్యం తేవడంతో పాటు అగ్రవర్ణ పోకడలకు కొంతమేరకు తెర దించగలిగింది. జిల్లాలో మాలమహానాడు పని చేస్తున్నప్పటికి చెప్పుకోదగ్గ స్థాయిలో దాని కార్యకలాపాలు లేవు. అదే సమయంలో జిల్లాలో ప్రవేశించిన షెడ్యూల్డు కులాల హక్కుల పరిరక్షణ సమితి (ఎస్.సి.ఆర్.పి.ఎస్.) దళితులను చైతన్య పర్చడంలో విశేష కృషి జరిపిందని చెప్పవచ్చు. 1997లో ఆవిర్భవించిన కులనిర్మూలనపోరాట సమితి (కే.ఎస్.పి.ఎస్) కొన్నాళ్ళ పాటు జిల్లాలో తన కార్యకలాపాలను కొనసాగించి విప్లవోద్యమం తగ్గుముఖం పట్టిన తర్వాత అది కనుమరుగైపోయింది. ఆ తర్వాత సిపిఎం పార్టీకి అనుబంధంగా వెలిసిన 'కుల వివక్షత పోరాట సమితి' అంటరానితనం, దళితులపై జరుగుతున్న దాడులకు వ్యతిరేకంగా జిల్లాలో పలుకార్యక్రమాలు కొనసాగిస్తుంది. ఇటీవల సిద్ధిపేట కేంద్రంగా ఆవిర్భవించిన మంజీర దళిత సేవాసమితి దళితులను చైతన్యపరిచే దిశలో కృషిని ప్రారంభించింది. ఇటీవల కాలంలో దళిత ఉద్యోగులు సంఘటితమై జిల్లాలో సంఘాలు ఏర్పాటు చేసుకొంటూ పోరాట స్ఫూర్తితో ముందుకుసాగడం కన్పిస్తుంది. అయితే జిల్లాలో పనిచేస్తున్న దళితసంఘాలు సమస్య ప్రాతిపదికనే స్పందిస్తుండడంతో ఆశించిన స్థాయిలో దళితుల్లో చైతన్యం తేలేకపోతున్నట్లు విమర్శలు వస్తున్నాయి.





# మెదక్ జిల్లా కార్మికోద్యమం

కె. అంజయ్య

మెదక్ జిల్లాలో అనేక భారీ పరిశ్రమలున్నా సంఘటిత రంగంలోకంటే అసంఘటిత రంగంలోనే కార్మికులు అధికం. సంఘటిత రంగానికి చెందిన భారీ పరిశ్రమలలో రాష్ట్ర రాజధానికి చెందిన కార్మికనాయకుల పాత్ర కీలకం. అసంఘటిత రంగంలో జిల్లాలోని కార్మిక సంఘాలు ప్రధాన భూమిక పోషిస్తున్నాయి. అత్యధికంగా కార్మికులుండే వ్యవసాయ రంగంపై ఇప్పటికే ఏ కార్మిక సంఘానికి పట్టులేదు. ఆ దిశగా కార్మిక సంఘాలు చేస్తున్న కృషి అంతంత మాత్రమే.

జిల్లాలోని పటంచెరు, రామచంద్రాపురం, జిన్నారం, బొల్లారం, బొంతపల్లి, నర్సాపూర్, తూప్రాన్, జహీరాబాద్, సదాశివపేట తదితర ప్రాంతాలలో భారీ, మధ్య తరహా పరిశ్రమలు అధికంగా ఉన్నాయి. అందులో బిహెచ్ఇఎల్, బిడిఎల్, ఒడియఫ్ మొదలైనవి ప్రభుత్వ రంగ పరిశ్రమలు. ఎంఆర్ఎఫ్, టాటా కాఫీ, డెనిసన్ హైడ్రాలిక్స్, శాంతి వైర్స్, పంచదార కర్మాగారాలు మొదలైనవెన్నో ప్రైవేటురంగంలో వర్ధిల్లుతున్నాయి. ఎపి స్కూటర్స్, ఆల్విన్ లాంటి ప్రభుత్వం రంగ సంస్థలు మూతపడి ప్రైవేటు పారిశ్రామికవేత్తల చేతుల్లోకి వెళ్లాయి. వివిధ కారణాల వల్ల అనేక ప్రైవేటు పరిశ్రమలకు తాళాలు పడ్డాయి.

నాలుగుదశాబ్దాల క్రితం రామచంద్రాపురం, పటంచెరులు పారిశ్రామిక ప్రాంతాలుగా గుర్తింపు పొందాయి. ఇవి రాష్ట్ర రాజధాని హైద్రాబాద్‌కు సమీపంలో ఉండటంతో అక్కడి కార్మికసంఘాలనేతలు, అధికారపార్టీలనాయకులు కార్మిక నాయకత్వాన్ని చేజిక్కించుకున్నారు. ఇప్పటికీ ఈ ప్రాంతంలోని ప్రధాన పరిశ్రమలలో

కార్మిక ఎన్నికలు జరిగితే మెదక్ జిల్లా నారు కాకుండా ఇతరులే కీలకపాత్ర పోషించి, పదవులు అలంకరిస్తున్నారు.

### ప్రారంభంలో...

1965 సంవత్సరానికి పూర్వం జిల్లాలోని ప్రధాన పరిశ్రమలలో ఐఎన్‌టియుసి, ఎఐటియుసి, హిందూమజ్దూర్ సంఘ్‌ల ఆధిపత్యం కొనసాగింది. సోషలిస్టు పార్టీ నాయకులు బద్రివిశాల్‌పిట్టి, నాయనినర్సింహారెడ్డిల నేతృత్వంలో హిందూమజ్దూర్ సంఘ్ కొన్ని పరిశ్రమలలో పై చేయి చాటుకున్నది. ఆంధ్రప్రదేశ్ ఏర్పాటయ్యాక మూడు దశాబ్దాలకు పైగా కాంగ్రెసు పాలన కొనసాగింది. దాంతో మొదట ప్రభుత్వ రంగంలోనే పరిశ్రమలు నెలకొన్నాయి. అప్పుడు పరిశ్రమల ఏర్పాటులో, కార్మిక సంఘాల నాయకత్వంలో ఆ పార్టీకి అనుబంధంగా ఉన్న ఐఎన్‌టియుసి ఆధిపత్యం చలామణీ అయింది. కమ్యూనిస్టు పార్టీకి అనుబంధంగా ఉన్న ఎఐటియుసి అప్పుడు బలంగా లేకపోవడంతో అది స్వల్ప సంఖ్యకే పరిమితమైంది. కార్మిక నాయకత్వం అధికార పార్టీనేతల చేతుల్లో ఉంటే ప్రభుత్వ రంగ యాజమాన్యాల నుంచి ఎదురయ్యే సమస్యలు సులభంగా పరిష్కరించుకోవచ్చన్నది కార్మిక వర్గాల భావన.

### చీలిన వామపక్ష యూనియన్

కమ్యూనిస్టు పార్టీ విభజనకు గురయ్యాక సిపిఐ నాయకత్వంలో ఎఐటియుసి, సిపిఎం నాయకత్వంలో సిఐటియు ఏర్పాటయ్యాయి. పార్టీకి పట్టుగొమ్మలు ప్రజాసంఘాలు. తల్లి వేరుకు పిల్లవేర్లు ఎంత బలమో పార్టీకి ప్రజాసంఘాలు అంతే. కమ్యూనిస్టులు మొదట ఈ విషయం విస్మరించారు. సిపిఐకి జిల్లాలో ప్రజాసంఘాలు బలంగాలేవని ఆ పార్టీ జిల్లా 19వ మహాసభల నివేదికలో (2005లో) పేర్కొనడం గమనార్హం. ఉన్న ప్రజాసంఘాలలో ఎఐటియుసి, వ్యవసాయకార్మికసంఘాలు మాత్రమే ఉన్నట్లు వెల్లడించింది.

### ఎఐటియుసి

జిల్లాలో పారిశ్రామిక వాడలున్న ప్రాంతాలలో కమ్యూనిస్టు పార్టీ బలంగా లేకపోవడంతో సంఘటిత కార్మిక రంగాలలో పట్టు కొన్నేళ్లకే పరిమితమైంది. ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, సరళీకరణ విధానాల వల్ల చాలా పరిశ్రమలు మూసివేతకు గురవడంతో ఎఐటియుసి యూనియన్లు క్రమంగా ఉనికి కోల్పోయాయి. సిద్ధిపేట డివిజన్‌లోని అసంఘటిత రంగంలోని కార్మికసంఘాలపై మొదటినుంచి ఎఐటియుసి పట్టు చాటుకుంటున్నది. జిల్లాలో సుమారు 80వేల మంది బీడీ కార్మికులుండగా అధికశాతం ఈ యూనియన్‌కు చెందిన మెదక్ జిల్లా బీడీ కార్మిక సంఘంలో సభ్యులుగా ఉన్నారు. హమాలి, రైస్‌మిల్, ఆయిల్‌మిల్, బార్‌దాన్, సినిమా తదితర రంగాల కార్మిక సంఘాలలో సుమారు 56వేల మంది సభ్యులుగా ఉన్నారు. కార్మికుల సమస్యలపై అనేక పోరాటాలు చేసి విజయం సాధించిన ఘనత ఈ యూనియన్‌కున్నది. వేతనాల పెరుగుదలకు కృషి చేసింది. 1982 ప్రాంతంలో సిద్ధిపేట ప్రాంతంలో మేడే, ఆదివారం లాంటి సెలవుదినాలు కూడా అమలయ్యేవి కావు. మేడేను సెలవు దినంగా పాటింపజేయడానికి చేసిన పోరాటంలో కొందరు కార్మిక నాయకులు జైలుకు వెళ్ళారు. వేతనాల కోసం, హక్కుల సాధన కోసం జరిగిన ఉద్యమాల సందర్భంగా వ్యాపారవర్గాలు, కార్మికుల మధ్య కొట్లాటలూ జరిగాయి. శాంతిభద్రతల సమస్యలు తలెత్తాయి. సిద్ధిపేటలోని శ్రామిక భవన్‌ను కేంద్రంగా చేసుకొని జరిగిన అనేక ఆందోళనలకు పార్టీనాయకులు ఎం.సిరాజొద్దీన్ నేతృత్వం వహించాడు. ఇప్పటికీ ఈ ప్రాంతంలో జరిగే కార్మిక పోరాటాలకు తానే నాయకత్వం వహిస్తున్నాడు. బీడీ కార్మికరంగం కోసం దశాబ్దాల నుంచి కృషి చేసిన ఆయన ప్రస్తుతం అఖిల భారత తంబాకో, బీడీ అండ్ సిగార్ వర్కర్స్ యూనియన్ జాతీయ అధ్యక్షులుగా పని చేస్తున్నాడు. బీడీ కార్మిక సంఘం నిర్వహించిన ఉద్యమాల ఫలితంగా బీడీ కార్మికులకు కనీస వేతనాలు, జాతీయ, వారాంతపు సెలవు దినాలు, బోనస్, గ్రాట్యుటీ, వైద్య సౌకర్యం మొదలైనవి దక్కాయి. బీడీ కార్మిక సంఘం తర్వాత బలంగా ఉన్నది హమాలీ యూనియన్. జిల్లాలోని ప్రభుత్వ రంగసంస్థ గిడ్డంగులలో పనిచేసే హమాలీలు ఎఐటియుసి నేతృత్వంలోనే పని చేస్తున్నారు. ఇటిక కిష్టయ్య తదితరులు ఈ సంఘానికి నాయకత్వం నెరపుతున్నారు. సిద్ధిపేట డివిజన్‌లో ఎఐటియుసికి పూర్తికాలం పని చేసే ఐదు మంది హోల్‌టైమర్లున్నారు. కార్మిక సంఘాల సభ్యుల సమస్యలతో పాటు కార్మిక హక్కుల పరిరక్షణకోసం ఉద్యమిస్తున్న ఎఐటియుసికి యువనేతగా మందపవన్ కృషి చేస్తున్నాడు. ప్రతి సంవత్సరం సిద్ధిపేటలో మేడే ఉత్సవాలను పెద్దఎత్తున నిర్వహించడంతో పాటు కార్మికులకు ఆటల పోటీలు నిర్వహించి బహుమతులిచ్చే సాంప్రదాయాన్ని ఎఐటియుసి నిర్వహిస్తున్నది. కార్మికుల పోరాటాలలో తుదిరూపమైన సమ్మెహక్కును తొలగిస్తూ సుప్రీంకోర్టు తీర్పు ఇవ్వడాన్ని వ్యతిరేకిస్తూ జిల్లాలో ఇతర యూనియన్లను కలుపుకొని ఐక్యపోరాటాలు నిర్వహించింది. బీడీ కట్టలపై పుర్రె, ఎముకలు, శవం గుర్తు ముద్రించాలన్న జీవోను వ్యతిరేకిస్తూ సమిష్టి పోరాటాలు చేసింది. ఈ సమస్యపై జరిగిన ఐక్యపోరాటంలో సిఐటియు, బియంయస్ యూనియన్లు కలిసి రావడం విశేషం. సిపిఐకి అనుబంధ 'వ్యవసాయ కార్మిక సంఘం' సంగారెడ్డి నియోజకవర్గం పరిధిలో కొంతమేరకు పని చేస్తున్నది. ఈ సంఘం జిల్లా మహాసభలు

జరుపుకుంటున్నా జిల్లా వ్యాప్తంగా విస్తరించడానికి జరిగిన కృషి అంతంత మాత్రమే. ఏఐటియుసి అనుబంధ సంఘం ఎంప్లాయిస్ యూనియన్ మెదక్ జిల్లా ఆర్టీసిలో ద్వితీయ స్థానంలో ఉన్నది. వైద్యశాఖ ఉద్యోగులలో బలంగా ఉన్నది.

### సిఐటియు

1970 ప్రాంతంలో రామచంద్రాపురం పరిసర పరిశ్రమలలో సిఐటియు నిర్వహించిన కార్యక్రమాలు స్వల్పకాలానికి పరిమితమయ్యాయి. పదేళ్లకు పైగా స్తబ్ధత అనంతరం 1985లో పునర్నిర్మాణమైంది. రామచంద్రాపురం, పటంచెరు మండలాల్లో కార్మిక సమస్యలపై ఆందోళనలు నిర్వహిస్తూ హోల్‌టైమర్స్‌తో క్రమంగా జిల్లాలో విస్తరించింది. కార్మికుల నుంచి విరాళాలు సేకరించి జిల్లా కేంద్రమైన సంగారెడ్డిలో శ్రామికభవన్ పేరిట కార్యాలయం నిర్మించుకుంది. 1993 ప్రాంతంలో నిజాం షుగర్స్ లిమిటెడ్ పరిశ్రమలో (ప్రస్తుతం ఈ పరిశ్రమ డెల్టా కంపెనీ నిర్వహిస్తోంది) ఆందోళనల ఫలితంగా 307 మంది కార్మికులపై కేసులు నమోదయ్యాయి. 1986లో బిహెచ్ఇఎల్ రక్షణ సదస్సులో తనవంతు పాత్ర పోషించింది. 1991-92లో ఆల్విన్ రక్షణకై జిల్లాలో ఐక్యపోరాటం చేసింది. అయినా ప్రభుత్వ నిర్ణయాల ఫలితంగా ఆ పరిశ్రమ ప్రైవేటుపరమైంది. 1993 నాటికి 25 పరిశ్రమలలో ఉన్న సిఐటియు 2003 నాటికి 46 పరిశ్రమలకు విస్తరించింది. 1987లో పార్లమెంటులో ప్రవేశపెట్టిన పారిశ్రామిక బిల్లుకు వ్యతిరేకంగా జిల్లాలో ఇతర కార్మిక సంఘాలతో కలిసి ఐక్యపోరాటాలు చేసింది. 1990 నాటికి జిల్లాలో పలు పరిశ్రమలు మూతపడ్డాయి. మూసివేతకు వ్యతిరేకంగా కార్మికులు ఉద్యమించినా ఫలితం దక్కలేదు. 2007లో గ్రామసేవకుల హక్కులసాధన కోసం జరిగిన ఉద్యమాలకు సిఐటియు నాయకత్వం నెరపింది.

### ఐఎన్‌టియుసి

జిల్లాలో కార్మికోద్యమం ప్రారంభమైన నాటి నుంచి నేటి వరకు సంఘటిత రంగంలోని అత్యధిక భారీ పరిశ్రమలలో ఐఎన్‌టియుసి తిరుగులేని ఆధిపత్యాన్ని కొనసాగిస్తున్నది. రాష్ట్రంలో మంత్రులుగా పనిచేసిన వారు, ఎమ్మెల్యేలు, ఐఎన్‌టియుసి జాతీయ, రాష్ట్ర నాయకులు అనేక కార్మికసంఘాలకు నాయకత్వం వహిస్తున్నారు. ఆ క్రమంలోనే సంజీవరెడ్డి జాతీయ నాయకునిగా ఎదిగారు. ఇప్పటికే విద్యుత్ శాఖ పరిధిలో ఐఎన్‌టియుసి ఆధిపత్యం చలామణీ అవుతోంది. రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థలో బలంగా ఉన్న నేషనల్ మజ్దూర్ యూనియన్‌కు పరోక్షంగా ఐఎన్‌టియుసి మద్దతిస్తోంది. వైద్యశాఖ ఉద్యోగులలో ఈ యూనియన్ విభాగమే పెత్తనం చలాయిస్తున్నది.



మాజీమంత్రి ఇంద్రారెడ్డి, మాజీమంత్రి, ఎమ్మెల్యే పి.జనార్ధనరెడ్డి, రామ్మోహనరావు, ఐఎన్‌టియుసి జాతీయనేత సంజీవరెడ్డి తదితరులు మెదక్‌జిల్లా పరిశ్రమలలో కార్మిక నేతలుగా గుర్తింపు పొందిన వారే. దేశంలో అత్యధిక కాలం కాంగ్రెసు పాలన ఉన్నందున ఐఎన్‌టియుసి ఆధ్వర్యంలో జరిగిన సుదీర్ఘ కార్మిక పోరాటాలు తక్కువే. భారీ పరిశ్రమలు అనేకం జిల్లా కేంద్రం సంగారెడ్డికి సమీపంలోనే ఉన్నా కార్మికోద్యమ చరిత్రలో ఆ ప్రాంతవాసుల నాయకత్వం అంతంత మాత్రమే.

### భారతీయ మజ్దూర్ సంఘ్

జిల్లాలో భారతీయమజ్దూర్‌సంఘ్ (బిఎంఎస్) 1977లో బిహెచ్ఇఎల్‌లో ప్రారంభమైంది. 1979 నుంచి సంఘటితరంగంలో కృషి చేసి వివిధ పరిశ్రమలలో ఆధిపత్యం సాధించింది. 1982 నుంచి అసంఘటిత రంగంలో పని చేస్తోంది. ఎ వన్ ఆర్గానిక్స్, గ్లోబల్ గ్రీన్ ప్రొడక్ట్ లిమిటెడ్, జిన్నారం మండలంలోని రెడ్డి ల్యాబొరేటరీ. కర్మాగారాలలో ఐఎన్‌టియుసి ఆధిపత్యాన్ని దెబ్బతీసి బిఎంఎస్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి మల్లేశం తదితరులు విజయం సాధించారు. తుప్రాన్‌లోని పెన్నార్ ప్రొఫైల్స్‌లో టిఎన్‌టియుసిపై, ప్రిమియర్ మస్రూమ్స్‌లో సిఐటియుపై బిఎంఎస్ ఆధిక్యత చాటుకొని కార్మిక నాయకత్వం వహిస్తున్నది. ఆర్చ్ ఫార్మా లిమిటెడ్‌లో కార్మిక వేతనాల పెంపుకోసం బిఎంఎస్ చేసుకున్న ఒప్పందంలో రూ.2500 వేతనం పెంచారు. సంగారెడ్డిలోని ఎంఎన్ఆర్‌లో ఇద్దరు మృతి చెందగా వారి కుటుంబాలకు నష్ట పరిహారం ఇప్పించింది. జిన్నారం మండలం ఐడిఎ బొల్లారంలో గల 26 కంపెనీలలో బిఎంఎస్ సింగిల్ యూనియన్‌గా కొనసాగుతున్నది. జిల్లాలోని పన్నెండు కంపెనీలతో ఇతర కార్మిక సంఘాలతో కలిసి బిఎంఎస్ పనిచేస్తున్నది. ఎపి బీడీ కార్మిక సంఘం, ముఠాజట్టు హమాలీ మజ్దూర్ సంఘ్, ప్రైవేటు మోటారు వెహికిల్స్ యూనియన్, ఆటో అండ్ టాక్సీ డ్రైవర్స్ యూనియన్ తదితర అసంఘటిత రంగ కార్మిక సంఘాలలో బిఎంఎస్ చురుకుగా పనిచేస్తున్నది.

టిఎన్‌టియుసి, తెలుగుదేశం పార్టీ రాష్ట్రంలో అధికారంలో ఉన్నపుడు ఎంఆర్ఎఫ్ పరిశ్రమ తెలుగునాడు ట్రేడ్ యూనియన్ ఆధిపత్యంలోకి వెళ్ళింది. జిల్లాలో ఈ యూనియన్ పాత్ర అంతంత మాత్రమే.

### ఇతర యూనియన్ల పాత్ర

అసంఘటిత రంగంలో వ్యవసాయ కార్మికుల సంఖ్య అత్యధికం. జిల్లాలో సుమారు 8 లక్షల మంది కార్మికులుంటే అందులో పాతిక శాతం వ్యవసాయ కార్మికులే. దశాబ్దం క్రితం రైతుకూలీల సమస్యల పరిష్కారం కోసం సిపిఐ (ఎంఎల్) జనశక్తి నక్సలైట్లు

రైతుసంఘాల పేరిట ఉద్యమాలు నిర్వహించారు. శ్రామికశక్తి బీడీ కార్మిక సంఘం పేరిట బీడీ కార్మిక రంగంలో పని చేశారు. పోలీసుల అణచివేత చర్యల ఫలితంగా ఆ సంఘాలు కనుమరుగయ్యాయి. రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థలో 'ఆకాస' (ఆర్టీసి కార్మిక సమాఖ్య) పేరిట పీపుల్స్‌వార్ సానుభూతిపరులు, కార్యకర్తలు ఉద్యమాలు నిర్వహించారు. పోలీసులతో జరిగిన ఎన్‌కౌంటర్ గజ్వేల్ - ప్రజ్ఞాపూర్ డిపోకు చెందిన ఆకాసనేత అమీరొద్దీన్ మృతి చెందడంతో ఆ సంస్థ కార్యకలాపాలు అంతరించాయి. ఆర్టీసిలో కార్మికులను చైతన్యవంతం చేసేందుకు 'కార్మిక చైతన్య వేదిక' పేరిట నరేందర్, శ్రీనివాస శర్మలు కొన్ని కార్యక్రమాలు నిర్వహించారు.

అసంఘటిత రంగం కార్మికుల హక్కుల పరిరక్షణ కోసం సమగ్ర చట్టం తేవాలని అన్ని కార్మిక యూనియన్లు డిమాండ్ చేస్తున్నాయి. ఆ దిశగా సమైక్య పోరాటాలు రూపుదిద్దుకోవాల్సిన అవసరమున్నది. కార్మిక సంఘాలు బలంగా ఉండి ఉద్యమాలు నిర్వహిస్తున్న ప్రాంతాలలోనే కార్మిక హక్కులు కొంతవరకు పరిరక్షింపబడుతున్నాయి. ఇతర ప్రాంతాలలో కనీస వేతనాలు కూడా అమలు కావడం లేదు.





# మెదక్ జిల్లా సాహిత్య చరిత్ర

నందిని సిధారెడ్డి

ప్రాచీన చరిత్ర ఎట్లా శిధిలమైందో ప్రాచీన సాహిత్య చరిత్ర కూడా శిధిలమైంది. లభిస్తున్న కొన్ని ఆధారాల ప్రకారంగానే చరిత్ర రచించుకోవాల్సి వస్తున్నది. కాలగర్భంలో కలిసిపోయిన అనేక ఆనవాళ్ళు కొంత చరిత్రను మాత్రమే గుర్తించటానికి వీలు కలిగిస్తున్నాయి. జిల్లా అనేక భాషల కూడలిగా ఉన్నది. మెదక్‌జిల్లా సాహిత్య చరిత్ర బహుప్రాచీనమైనదే. క్రీ.శ. 60-70 ప్రాంతానికిచెందిన గుణాఢ్యుడు మెదక్ జిల్లా కొండాపూర్‌లో నివసించినట్లు తెలుస్తున్నది. సంస్కృత ప్రాకృతాలను త్యజించిన గుణాఢ్యుడు పైశాచీ భాషలో 'బృహత్కధ' అనే గ్రంథం రాశాడని ప్రతీతి. పైశాచీ భాష ప్రత్యేకంగా లేదని ప్రాకృతంలోని ఒక యాసను అట్లా భావించేవారని కొందరి అభిప్రాయం. భారతీయ కథా ప్రపంచానికి మూలమైన గ్రంథమిది. అనేక నాటకాలపై, కావ్యాలపై దీని ప్రభావం వుంది. తర్వాత గ్రంథాల ఆధారంగానే గుణాఢ్యుడు 'బృహత్కధ' రచించినట్లు నిర్ధారిస్తున్నారు.

**పూర్వకవులు :**

పటాన్ చెరువులో దొరికిన కన్నడ శాసనం ప్రకారం 12వ శతాబ్దంలో 'బ్రహ్మశివ కవి' ఈ ప్రాంతం వాడని, త్రైలోక్య చూడామణి స్తోత్రం 'సమనుకాంత' అనే గ్రంథాలు కన్నడంలో రచించినట్లు తెలుస్తున్నది.

తర్వాత ప్రాముఖ్యత పొందిన కవి కోలాచల మల్లినాధసూరి 14వ శతాబ్ది ప్రాంతంలో ఇప్పటి కొల్చారంలో నివసించేవాడు. విద్యానాధుని సమకాలికుడు. సంస్కృత పండితుడు. మృతస్థితిలో ఉన్న కాళిదాసు "రఘువంశం, మేఘసందేశం" కావ్యాలకు సంజీవనీవ్యాఖ్య రాసి ప్రాచుర్యం తెచ్చాడు.

భారవి 'కిరతార్జునీయా'నికి ఘంటాపథవ్యాఖ్య, మాఘుని 'శిశుపాల వధ'కు సర్వంకష వ్యాఖ్య, హర్ష నైషధా'నికి జీవాతు వ్యాఖ్య రాశాడు. జిల్లా ఖ్యాతిని దేశమంతా చాటాడు. మల్లినాథసూరి కొడుకు సోమనాథపీఠి. 15 శతాబ్ది వాడు. ప్రతాపరుద్రీయానికి 'రత్నాపణం' అనే వ్యాఖ్య రాశాడు. దోమకొండ, బిక్కనవోలు సంస్థానాలు మెదక్‌లో ఉండేవి. దోమకొండను పాలించిన కామినేని మల్లారెడ్డి స్వయంగా కవి. 'షట్చక్రవర్తి చరిత్రము' 'శివధర్మోత్తరము' 'పద్మ పురాణము' కావ్యాలు రచించాడు.

15-16వ శతాబ్దికి చెందిన పొన్నగంటి తెలగన పొట్లచెరువుకు ఇప్పటి పటంచెరుకు చెందినవాడు. తెలుగు సాహిత్యంలో మొట్టమొదటి అచ్చతెనుగు కావ్యం 'యయాతి చరిత్రము' తెలగన రచనే.

## సంప్రదాయక కవులు

శ్లేషయమక చక్రవర్తిగా పేరుపొందిన కుకునూరు యామవరం రామశాస్త్రి జిల్లావాడే. గురుస్తుతి, భవానీస్తవం, శంకరస్తవం ఇతని రచనలు. గోలకొండ కవుల సంచికలో ఈ కవి పద్యాలున్నాయి.

ముత్యంపేట సాంబయారాధ్యులు సిద్దిపేట నివాసి. శివస్తవసుధ, రామామణి శతకం, శాంకరీస్తవం ఇతని రచనలు, గోలకొండ కవుల సంచికలో ఇతని పద్యాలున్నాయి.

విఠాల చంద్రమౌళిశాస్త్రి, గజ్వేలు నివాసి. అనంతరం చుంచనకోటలో స్థిరపడినాడు. శ్రీలీల, మాతృప్రేమ రచించాడు. వీరి కవితలు గోలకొండ కవుల సంచికలో ఉన్నాయి.

గడ్డం రామదాసు మిరుదొడ్డి వాస్తవ్యుడు. కుచేలోపాఖ్యానము, కాళింగమర్దన, విప్రనారాయణ ప్రభావతి మొ॥న కావ్యాలు రచించారు. గోలకొండ కవుల సంచికలో ఇతని పద్యాలు ప్రచురించింది.

రుక్మాభట్ల విధుమౌళిశాస్త్రి గజ్వేల్‌వాసి, రామాజిపేటలో స్థిరపడ్డాడు. వీరురచించిన 'తందనాన రామాయణము' విశేష ప్రాచుర్యం పొందింది.

మెదక్‌కు చెందిన భాగవతం సీతారామశర్మ 'దేవకీనందన తారావళి' రచించగా. రిమ్మనగోడు రఘురామ శాస్త్రి 'రాజేశ్వర శతకం' రచించాడు. లచ్చపేట వాస్తవ్యుడైన మూలంపల్లి రాజశేఖరశాస్త్రి 'శ్రీనాథ విజయము' రచించాడు. ముదిగొండ ఆంగీరస శర్మ 'వ్యాస భారతి' రచించాడు.



సిరిసినగండ్ల శ్రీనివాసాచార్యులు 'కూచాద్రి మహాత్మ్యము' అనే ప్రబంధము రచించి కూచనపల్లి వేంకటేశ్వరస్వామికి అంకితమిచ్చాడు. 'మెతుకు సీమ' కావ్యంలో మెదక్ జీవనాన్ని వర్ణించాడు.

పాపన్నపేట సంస్థాన పాలకులైన రాణి శ్రీ సర్దేశాయి వేంకట లక్ష్మాయమ్మ స్వయంగా కవయిత్రి. 'మానసబోధ' పద్యాలు రచించింది.

వేముగంటి నరసింహాచార్యులు తెలుగు సాహిత్యంలో విద్యత్కవి కోకిలగా లబ్ద ప్రతిష్ఠుడు సిద్దిపేట వాసి. సుమారు 40 కావ్యాలు సృజించాడు. ప్రబోధము ఆయన మొదటి రచన. తిక్కన, వీరపూజ, ఆంధ్రవిష్ణువు, వివేక విజయం, భావతరంగిణి పేర్కొన దగిన రచనలు.

ముదిగొండఈశ్వర్‌చరణ్ సిద్ధిపేట నివాసి. 'వ్యాస నవమి', 'వ్యాస పీఠం' రచించిన విమర్శకుడు. ముడుంబైరంగకృష్ణమాచార్యులు ఆందోలు వాస్తవ్యుడు. విరించి కలం పేరు. గురుభక్తి, జోగినాధస్తవం, విరించి సూక్తులు రచించాడు. సాహిత్య సభల నిర్వహకుడుగా సుప్రసిద్ధుడు.

దోర్బల విశ్వనాధ శర్మ రామాయంపేటకు చెందినవాడు. అనేక సంస్కృత గ్రంథాలకు వ్యాఖ్యానాలు రాసిన పండితుడు. శ్రీలాలిత్యం, శివ సప్తతి, పద్య రచనలు చేశాడు. గౌరీభట్ల రామకృష్ణ శర్మ వేంకటరావుపేట వాస్తవ్యుడు. 'ఏకవీర కుమారీయం' అనే శ్లేష కావ్యం రచించాడు. ఏకవీర చరిత్రకూ కుమార స్వామి కథకూ ప్రతి పద్యంలో శ్లేషను పాటిస్తూ రచించాడు.

ఉమాపతి పద్మనాభశర్మ సిద్దిపేట వాస్తవ్యుడు. తేజోవల్లరి, దేవీ మానసపూజ కావ్యాలు రచించాడు. సంగీతజ్ఞుడు, పండితుడు. ఎల్.ఆనందరావు దేశపాండే నార్సింగ్ నివాసి. బహుభాషావేత్త పరమేశ్వరశతకము రాజీవ చరిత్ర, యాదవ చరిత్ర యక్షగానాలు రచించాడు. దేశపతిగోపాలకృష్ణ సిద్దిపేట వాస్తవ్యుడు. మధుశ్రీ, వాసర సరస్వతీ సుప్రభాతం రచించాడు. పండుగల మీద పద్యాలు రచించి వివిధ పత్రికల్లో ప్రచురించాడు. శిలేనారాయణ కవి పాలమాకులవాసి. రామభద్ర స్తుతి, శారదాస్తవం రచించాడు.

## యక్షగాన కవులు

బెల్లోజు రమణాచారి రామేశునిపేటకు చెందిన కవి. వందకుపైగా యక్షగానాలు రాశాడు. సుభద్రా కల్యాణం, గంగాదేవి పరిణయం, గౌరీ కల్యాణం, దక్షయజ్ఞం, వనమాలీ పరిణయం వంటివి ప్రదర్శింపబడి, ప్రచురింపబడి ప్రజాదరణ పొందాయి.

బూరుగుపల్లి సోదరకవులు యక్షగాన రచనలో ప్రసిద్ధులు. సుగ్రీవ విజయం, కుశలవ నాటకాలు ప్రాచుర్యం పొందాయి.

గాజుల స్వామిదాసు మిట్టపల్లి నివాసి. 'స్వరుచోపాఖ్యానం', 'ఖల్వాన చరిత్ర' యక్షగానాలు రచించాడు. సబ్బని వాసుదేవ్ వందలాది యక్షగానాలు రచించి పేరొందిన కవి. వెర్పిరాల భాగయ్య యక్షగాన రచనలో సుప్రసిద్ధుడు. వర్ష లక్ష్మయ్య రంగంపేట వాస్తవ్యుడు. యక్షగానాలు రచించి ప్రదర్శింప చేశాడు. కాల్వ బాలయ్య సిద్దిపేట నివాసి. శూర్పణఖ, భీష్మ ప్రతిజ్ఞ యక్షగానాలు రచించాడు. శునక వానరీయం ఆయన మరో ప్రసిద్ధి చెందిన రచన.

## అవధాన కవులు

రాళ్ళబండి రాఘవశాస్త్రి క్షీరసాగరం గ్రామవాసి. అవధానాలు చేయటంలో దిట్ట. భావానందము, ఋణవిముక్తి కావ్యాలు రచించాడు. గుమ్మన్నగారి లక్ష్మీనరసింహ శర్మ పోతారెడ్డిపేట వాస్తవ్యుడు. అనేక అవధానాలు చేసిన పండితుడు. వాగీశ్వరిస్తుతి, అద్వైమాత్మక కావ్యాలు రచించాడు. అష్టకాల నరసింహరామశర్మ రాజగోపాల్‌పేట వాస్తవ్యుడు. రాష్ట్ర మంతటా అవధానాలు నిర్వహించిన కవి. శిధిల విపంచి, శ్రీరామచంద్రిక, పురుషోత్తముడు కావ్యాలు రచించాడు. సరస్వతీ యజ్ఞాలు నిర్వహించి అనంతసాగర్‌లో సరస్వతీ దేవాలయం నెలకొల్పాడు. ప్యారక శేషాచార్యులు గుమ్మడిదల గ్రామవాసి. అవధాన ప్రక్రియ ప్రదర్శించిన కవి. పత్తి రైతుల దీనస్థితిని 'ప్రపత్తి నిర్వేదం'గా, కాకి హీనగాథను "కాకతాళీయం'గా కావ్యరచన చేశాడు. తిగుళ్ళ రాధా కృష్ణశర్మ మెదక్ వాసి. అవధానాలు చేశాడు. 'అద్వైతం' రచించాడు. సిద్ధిపేటకు చెందిన గౌరీభట్ల మెట్రామశర్మ అవధానాలు చేశాడు.

## సమన్వయ కవులు

ధర్మారెడ్డి బాలరెడ్డి ధర్మాజీపేట నివాసి. ఈయన 'బాలరెడ్డి మాట', 'అరుణరేఖలు' రచించాడు. దాశరథుల బాలయ్య మిట్టపల్లి గ్రామం. శ్రీరామ చంద్రోదాహరణం, జ్ఞాన సరస్వతీ మధ్యాక్కరలు, శివసాక్షాత్కారం పేర్కొనదగిన కావ్యాలు. సంస్కృతంలో 'ఆర్యాశతి' రచించాడు. జహీరాబాద్ ప్రాంతానికి చెందిన నలుగోటి సుదర్శనరెడ్డి, పన్నగశయన శతకం, సుదర్శన సూక్తి సుధ రచించాడు. పడిగె నారాయణ కవి సదాశివపేట వాస్తవ్యుడు. శ్రీరామ నక్షత్రమాల, సాయిబాబా పంచవింశతి రచించాడు. కెటి రమణాచార్యులు మెదక్ వాసి. గోదాచరితం రచించాడు. కనపర్తి రామచంద్రాచార్యులు వచన కవిత్వానికే పరిమితమై మంచి కవిత్వం రాస్తున్నాడు. గీతంసంకేతం, అక్షరశిల్పాలు, వెలుతురుపూలు, రాళ్ళు, ముళ్ళు వంటి సుమారు 40 దాకా సంపుటాలు ప్రచురించి ముందున్నాడు.



అమ్మన చంద్రారెడ్డి చెల్లాపురం నివాసి. చంద్రవేదం, చంద్ర వీక్షణం, చంద్రాలోకనం సోమేశ్వర శతకం రచించాడు. సిద్దిపేటకు చెందిన నాయకం వేంకటేశం 'మణికంఠీయం' రచించగా, నారాయణ ఖేడ్‌కు చెందిన అద్దంకి తిరుమల కృష్ణమాచార్యులు 'అద్దంకి సుద్దులు' రచించాడు.

## ప్రగతిశీల కవులు

ప్రగతిశీల భావాలు కలిగి ప్రజల గురించి ఆలోచించి ఆధునిక కవితా పద్ధతులలో కవిత్వమల్లిన కవులెందరో జిల్లాలో ఆవిర్భవించారు. ప్రజాస్వామిక ఆలోచనా విధానంతో ఉద్యమాలు నిర్మించి, దానికనుగుణమైన కవిత్వాన్ని సృజించిన మహాకవి మగ్దుం మొహియుద్దీన్ ఈ జిల్లా గర్వించదగిన కవి. అభ్యుదయ కవిత్వంతో జాతీయస్థాయి నందుకున్న మహనీయుడు. ఉర్దూ కవిత్వంతో ఉన్నత శిక్షరాలు సాధించిన మగ్దుం ఉద్యమకవి. అటు ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసే ఉద్యమంలో పాల్గొంటూనే ఇటు సాంస్కృతిక రంగంలో తీవ్రమైన కృషి చేశాడు. ఆయన గేయాలు ప్రజల్ని ఉర్రూత లూగించాయి. అతీష్ కథా, తెలంగాణా, ఇంతేజార్, అంధేరా మొ॥న గేయాలు ఎంతో ఖ్యాతినార్జించి పెట్టాయి. మానుకోట జైలు నుండి తప్పించుకొని వచ్చిన మహాకవి దాశరధి మంజీర మీద చెప్పిన పద్యాలు చరిత్రాత్మకమైనవి. వెల్దుర్తి మాణ్యీరావు తెలంగాణ విముక్తి వస్తువుతో కొన్ని కవితలు రాశారు. భూస్వాముల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా బుర్రకథలు, ఉద్యమగీతాలు రచింపబడినాయి. అవి రికార్డు కాకుండా జానపదుల నోళ్లలో ఉండిపోయాయి.

నక్సల్బరీ ఉద్యమాల ప్రభావంతో మొదలైన శ్రీకాకుళ పోరాటాల తర్వాత కరీంనగర్ సిరిసిల్లా పోరాటాలు ఉవ్వెత్తున లేచాయి. నైసర్గికంగా కరీంనగర్, వరంగల్ జిల్లాల్ని ఆనుకొని మెదక్ జిల్లా ఉండటంవల్ల సమీపప్రాంతాల్లో ఈ ఉద్యమాలప్రభావం తీవ్రంగా పడింది. ఆ క్రమంలో రాష్ట్ర సాహిత్య వాతావరణాన్ని ఉడుకెత్తించి పరుగెత్తించిన విప్లవసాహిత్య, ప్రగతిశీల సాహిత్య ప్రభావం మెదక్ జిల్లా కవుల్ని ఉత్తేజితుల్ని చేసింది.

ఆధునిక ప్రగతిశీల భావనతో నలుగురు కవులు ఉమాపతి పద్మనాభశర్మ, జాలపల్లి చంద్రారెడ్డి, విఠాల శ్రీకాంత శర్మ, రుక్మాభట్ల కృష్ణమూర్తిలు 'ఋతచేతన' ప్రచురించారు. 'అగ్నిజ్వాల' కలంపేరుతో భగవంతరెడ్డి ఆవేశభరితమైన కవితలు రాశాడు. సిధారెడ్డి, మహమూద్ పాషా కొత్త గొంతుల్తో విప్లవాన్ని నినదించారు. సరిపల్లి కృష్ణారెడ్డి, గులాబీల మల్లారెడ్డి ప్రేరణ ఒక వాతావరణ కల్పనకు దారితీసింది. కందుకూరి శ్రీరాములు, కర్నాల బాలరాజు, నందిని సిధారెడ్డి ముగ్గురి మినీ కవితలతో 1974 నవంబర్‌లో 'దివిటి' ప్రచురితమైంది. తెలుగు సాహిత్యంలో మొదటి మినీ కవితా సంపుటి ఇది.

ఆ తరువాత కె.అంజయ్య 'చైతన్య సాహితి' ఏర్పాటు చేసి 1982లో 'గీతాయుధం' ప్రచురించాడు.

మందకొడిగా సాగుతున్న సాహిత్య రచన తీవ్రతరం చెయ్యాలని 1986లో 'మంజీరా రచయితల సంఘం' స్థాపన జరిగింది. ఉత్సాహవంతులైన యువకులు మరసంతో క్రియాశీలంగా పనిచేస్తూనే కవితారచనలో బాధ్యతాయుత పాత్ర నిర్వర్తిస్తున్నారు. మహమూద్‌పాషా 'ఉనికి' సంపుటిని జులై 20, 1986న డా. సి.నారాయణరెడ్డి ఆవిష్కరించాడు. నందిని సిధారెడ్డి 1987లో 'భూమి స్వప్నం' కవితాసంపుటి వెలువరించాడు. ఇది ఫ్రీవర్స్ ఫ్రంట్ అవార్డు, దాశరథి అవార్డులను గెల్చుకున్నది. కవిత్వాన్ని గాయాలగొంతుకగా మలచిన సిధారెడ్డి 1991లో 'సంభాషణ', 1995లో 'ప్రాణహిత', 2001లో 'ఒక బాధగాదు' కవితా సంపుటాలు ప్రచురించాడు. కందుకూరి శ్రీరాములు మరో ప్రగతిశీల స్వరం. 'వయొలిన్ రాగమో వసంతమేఘమో' కవితా సంపుటి ప్రచురించగా దానికి ఉమ్మిడిశెట్టి అవార్డు లభించింది. కవ్వం, దహన కావ్యం, సందర్భం, పీఠభూమి శ్రీరాములు ఇతర రచనలు.

పద్య రచనలో సిద్ధహస్తుడైన ఏలేశ్వర నాగభూషణాచార్య ఆధునిక ఉద్యమ కవిత్వ ప్రేరణతో రచనలు చేస్తున్నాడు. 1991లో ఆయన ప్రచురించిన 'నేలతడవని వాన' జీవన దర్శనంలో, భాషలో జిల్లా ముద్రను సంతరించుకున్నది. సునిశితమైన చూపు, పనితనం, ఉన్న కవి మోతుకూరి అశోక్‌కుమార్. ఆయన 'సంతకం' 'కొల్బులోల్లం' 'పిట్టగూడు' కవితా సంపుటాలు ప్రకటించాడు.

అత్యంత నిరసన ప్రదర్శించే బలమైన గొంతుక అలాజ్‌పూర్ కిషన్. తన కలం పేరు ఆవాజ్. ఉద్యమం పట్ల ఉన్న మమేకం కిషన్ గొంతులో పదునెక్కింది. 1996లో 'వడిసెల' కవితా సంపుటి ప్రచురించి ఉద్వేగపర్చాడు. గ్రామీణ నేపథ్యంలో స్వచ్ఛ హృదయ స్పందనలతో 'పప్పుల రాజిరెడ్డి' కవిత్వం రాస్తున్నాడు. ప్రజల స్థితి, రైతాంగ ఉద్యమ చైతన్యాన్ని వర్ణిస్తూ 'వరదగూడు' 1996లో ప్రచురించాడు. బాల్యంలోని ఆరాటం లాగే మానవ సంబంధాల కోసం వెతుకుతున్న కవి ఐలేని గిరి. కరిగిన కలలు, పెరిగిన సంక్షోభాలను ప్రతిబింబించే కవితలతో 1996లోనే 'నెమలికన్ను' ప్రచురించాడు. విప్లవభావాలతో నారాయణ స్వామి 'కల్లోలకలల మేఘం' ప్రచురించాడు. పురాజ్ఞాపకాలతో 'సందుక' చిత్రించాడు.

ఛిద్రమవుతున్న పల్లె జీవితాన్ని కవిత్వంలోకి తెచ్చిన కవి రామగిరి శివకుమార శర్మ. ఆయన 'సముద్రదాహం' 'సింగిడి' సంపుటాలు ప్రాచుర్యంలోకి వచ్చాయి. తెలంగాణ గ్రామీణ జీవితాన్ని గ్రామీణ భాషలో బలమైన శిల్పంతో 'సింగిడి' అందర్నీ



ఆకర్షించింది. దాసరాజు రామారావు 2001లో 'గోరుకొయ్యలు' ప్రచురించాడు. తెలంగాణ అస్తిత్వ చైతన్యాన్ని చాటే కవిత్వంతో పాటు ప్రపంచీకరణ దుష్ఫలితాల్ని నిరసించే భావనలు ఇందులో ఉన్నాయి. ఇది ఉమ్మడి శెట్టి అవార్డు గెల్చుకున్నది. పల్లెటూరి మీద, అమ్మమీద, అనుబంధాల మీద కవికున్న ఆత్మీయ మమకారం కవిత్వానికి వన్నె తెచ్చింది. 2003లో 'బతుకువాసన' చిక్కటికవిత్వాన్ని చిలికించిన డి.చంద్రశేఖర్ ప్రమాదవశాత్తు మరణించటం విషాదం.

చొప్పదండి సుధాకర్ 'శబ్దరుతువు' సమకాలీన జీవితాన్ని చిత్రించింది. దళిత చైతన్యాన్ని ప్రతిభావంతంగా వ్యక్తీకరించిన కవి తైదల అంజయ్య. 'పునాస' 2006లో వెలువడి రంగినేని అవార్డు గెల్చుకున్నది. వర్తమాన చైతన్యాన్ని కవితలు పుక్కిట పడుతున్నాయి. తెలంగాణ అస్తిత్వాన్ని, దళితవాడల దయనీయతను, ప్రపంచీకరణ పరిణామాల్ని ఒడిసి పట్టుకొని ముప్పిరిగా కవితలు పేనాడు అంజయ్య. ప్రగతి భావాలతో పదునైన కవిత్వం రచించి అకాల మృత్యువుకు గురయిన పోగుల రాజన్న కవిత్వం 'సెలవింక' 2006లో 'మరసం' ప్రచురించింది. యండి అహ్మద్ 2006లో 'పానాది' ప్రచురించాడు. ముస్లింలు ఎదుర్కొంటున్న సంకట పరిస్థితిని, గ్రామీణ రైతుల దైన్యాన్ని సంవేదనా భరితంగా చిత్రించాడు. మంజీరా రచయితల సంఘం వివిధ కవుల సంకలనం 'కదలిక' 1986లో ప్రచురించింది. అప్పటికి కొత్త గొంతులు విప్పిన కవులు 1996లో ప్రతిభా స్వరాలుగా మారి 'మొగులైంది' ప్రచురించారు. తెలుగులో ప్రపంచీకరణను నిరసిస్తూ వచ్చిన మొదటి సంకలనమిది. తిరిగి 2001లో 16 గురు కవులతో 'ఎడపాయలు' ప్రచురించి రాష్ట్ర సాహిత్య చరిత్రలో జిల్లా తన స్థానాన్ని సుస్థిరం చేసుకున్నది. ఉద్యమాలకు ఊపిరిపోస్తున్న తెలంగాణ భావన సంకలనం నిండా విస్తరించింది. ప్రముఖ గాయని బెల్లి లలితను రాజపోషకులు హత్య చేసినప్పుడు గాయకురాలు యాదిలో 'పాట సంతకం' మరసం ప్రచురించింది. మరసం నిర్వహించిన మహిళా కవి సమ్మేళనంలో 30 మంది మహిళలే పాల్గొనటం వెనుకబడిన జిల్లాకు విశేషమే.

పుస్తకం వేయకపోయినా తమ రచనలతో ప్రతిభను చాటుకున్న కవులెందరో ఉన్నారు. 1984 నుండి ఉద్యమం పొందుతున్న విస్తృత దశను మంచికట్ల రాజయ్య 'మైదానం మేల్కొంటున్న వేళ'గా చిత్రించి జనావేశాన్ని వ్యక్తం చేశాడు. ప్రజా ఉద్యమాలతో మమేకం చెందుతూ ఖైదీల హక్కుల పరిరక్షణోద్యమంతో ప్రేరితుడై దేశపతి శ్రీనివాస్ 'బందీకాని గొంతుక' కవిత రచించాడు. ఇది చాలా ప్రాచుర్యం పొంది ఆంగ్లంలోకి అనువాదమైంది.

సంగారెడ్డి నుండి 'విశాల్' సరైన ప్రాపంచిక అవగాహనతో మంచి కవితలు రాశాడు. నేముగంటి మురళి తెలంగాణ ప్రాంతీయ ముద్రతో కవిత్వం రాస్తున్నాడు. కె.రంగాచారి ప్రపంచీకరణ మీద రాసిన కవిత ప్రాచుర్యం పొందింది. వందలాది విప్లవ గీతాలు రచించి లక్షలాది మందిని ఉర్రూతలూగించే గద్దర్ 'గద్దర్ పాటలు' ప్రచురించాడు. సుప్రసిద్ధ దర్శకుడు బి.నరసింగరావు కవితలు, పాటలు రచించాడు. గాయకుడు 'భీమసేన' 'తాలెల్లే' పాటలు ప్రచురించాడు.

**అజ్ఞాత కవులు :**

జిల్లాలో రాజకీయ సాయుధపోరాటాన్ని నిర్మిస్తూనే మరోవైపు కవితాస్త్రాలు సంధించిన అజ్ఞాత కవులు కవిత్వ చరిత్రను విప్లవోన్ముఖం చేశారు. పెన్నూగన్నూ పట్టే ప్రతిభావంతమైన కవిత్వం వెలువరించిన కవుల్ని విస్మరించలేం. సముద్రుని 'భూమి నాతల వెల నిర్ణయించు' 'మృత్యువే మరణిస్తుంది' కవితా సంపుటాలు ప్రచురితమైనాయి. కౌముది కవిత్వంతో రాష్ట్ర సాహిత్యాభిమానుల్ని ఆకర్షించాడు. అమ్మ జ్ఞాపకాల్తో తన అడవి జీవితానుభవాలతో 'చనుబాల ధార' ప్రచురితమైంది. 'కౌముది' కవిత 2006లో వెలువడింది. 'మంజీర' మెదక్ జిల్లా ఉద్యమం చేస్తూ ఉత్తమ కవితలు రచించాడు. ఈ ముగ్గురూ అమరులైన కవులే.

**కథాసాహిత్యం**

ఆర్థికంగా జిల్లా తగినంత అభివృద్ధి చెందనందున జిల్లాలో వచన సాహిత్యం అంతగా వికసించలేదు. అక్షరాస్యుల సంఖ్య పెరిగి కొంత మార్కెట్ అభివృద్ధి చెందుతున్న ప్రాంతాల నుంచే వచనం ఎక్కువగా వచ్చే వీలున్నది. ఆ అవకాశాలు జిల్లాకు కొరవడినాయి. రచనకు సంబంధించి కవిత్వవాతావరణం ఉన్నంతగా కథా వాతావరణం లేకపోవడం కథకులు రాకపోవటానికి కారణం అయివుండవచ్చు. కథా రచనలో స్వల్ప స్థాయిలోనే కృషి జరిగింది. తీవ్రకృషి జరగకపోవడంలోటే.

వెల్దుర్తికి చెందిన వెల్దుర్తిమాణిక్యరావు మెదక్‌జిల్లా కథానికా చరిత్రకు ఆద్యుడుగా కనిపిస్తున్నాడు. మాణిక్యరావు 'భారం' కథ అణాకథలలో 1945లో ప్రచురించబడింది. బహుశా జిల్లాలో ఇదే మొదటి కథ. తర్వాత 1951లో 'ఊరబాయి' 'శోభ'లో ప్రచురితమైంది. 1956లో సంకలితం చేయబడిన 'పరిసరాలు'లో మాణిక్యరావు 'ఏయిర్‌మేల్' చోటుచేసుకున్నది. 1956 నాటికి వెల్దుర్తి మాణిక్యరావు కథాసంపుటి ప్రచురణ కావల్సి ఉన్నది. కానీ – ఆ పుస్తకం అచ్చుకాలేదు.

1956లో సిద్దిపేటకు చెందిన సాలగ్రామ్ రాసిన కథ ప్రచురించబడింది. ముదిగొండ ఈశ్వర్‌చరణ్ రచించిన 'జలజ నేర్పిన పాఠం' 1957లో 'తెలుగు



విద్యార్థి"లో ప్రచురించబడింది. కథారచనలో 60లలో విశేషమైన కృషి జరిపి ప్రతిభ ప్రదర్శించిన రచయిత ఉమాపతి పద్మనాభశర్మ. శర్మ రచించిన 'బతకనేర్చిన మృత్యువు' ఆంధ్రప్రభలో ప్రచురింపబడి ప్రాచుర్యం పొందింది. కృష్ణాపత్రిక, తెలుగువిద్యార్థి పత్రికలతో సహా అప్పట్లో కొన్ని కథాసంకలనాలు శర్మ కథలు ప్రచురించాయి. 1962లో సిద్ధిపేటకు చెందిన నలుగురు యువకథకులు కలిసి 'చతురంగం' అనే కథా సంకలనం ప్రచురించారు. ఉమాపతి పద్మనాభశర్మ, డింగరినరసింహాచార్య, వరిగొండరామచంద్ర రావు, గొల్లపల్లిపట్టాభిరామశర్మ ఈ నలుగురి కృషితో సిద్ధిపేటలో కథా వాతావరణం వికసించసాగింది. ఆంజనేయులు, దారం మల్లారెడ్డిలు ఇద్దరు జంటగా 'ఆమ' పేరుతో కొన్ని కథలు రాశారు. 'బాబూ పావలా దానం చెయ్యండి' కథ 67, 68ల్లో ఆంధ్రజ్యోతి లో అచ్చయి మంచి గుర్తింపు పొందింది.

మెదక్‌కు చెందిన పడాల రాములు మంచి కథా రచయిత. 72లో రాములు రాసిన 'బలి' కథ ఆంధ్రజ్యోతి వారపత్రిక కథల పోటీలో బహుమతి పొందింది. గ్రామీణ స్త్రీని భూస్వాములు ఎట్లా దోపిడి చేస్తారనేది ఇందులో ఇతివృత్తం. తర్వాత 'వెలి' కథ ఆంధ్రప్రభ ప్రచురించింది. ఎగుమామిడి అయోధ్యారెడ్డి మరో మంచి కథా రచయిత. 1974లో కథాంజలిలో చాలా కథలు వచ్చాయి. ఆంధ్రభూమిలో ప్రచురించబడిన 'హత్య' 'కసి' కథలు పాఠకుల్ని ప్రభావితం చేశాయి. అయోధ్యారెడ్డి 'చీమల పుట్టలు' ఆంధ్రజ్యోతి ప్రచురించింది. 'ఆహారయాత్ర' ఆహారం కోసం చీమల తిరుగుబాటును చిత్రించి బాగా ప్రాచుర్యం పొందింది. 'యువ' కథల పోటీలో 'పందెం' కథ బహుమతి గెల్చుకున్నది. అయోధ్యారెడ్డి, పడాలరాములు తర్వాత కథా రచనను కొనసాగించకపోవటం జిల్లాకు సంబంధించినంత వరకు లోటే. నందిని సిధారెడ్డి 1975 నుండి కథలు రాశాడు. ఆంధ్రభూమి 'ఎలర్జీ', ఆంధ్రప్రభ 'గుండె' ప్రచురించింది. పసివాడికి జంతువుల పట్ల ఉండే మమకారాన్ని ఇతివృత్తంగా చేసి రాసిన 'హృదయం'కు ఆంధ్రపత్రిక ప్రత్యేక బహుమతి ఇచ్చింది. జ్యోతి (మాస) దీపావళికథలపోటీలో 'ఆట' ప్రత్యేక బహుమతికి ఎన్నికైంది. బారాత్‌లలో గ్యాస్‌లైట్లు మోసే స్త్రీల అవస్థల్ని చిత్రించిన 'ఖైదీ' స్వాతి వారపత్రిక ప్రచురించగా కేంద్ర సాహిత్య అకాడమీ వారి 'ఒక తరం తెలుగు కథ' సంకలనం తిరిగి ప్రచురించింది. ప్రపంచీకరణ తెస్తున్న మార్పుల్ని 'కులకశ్పి' 'నాదాని' కథలు చిత్రించాయి.

కాట్రగడ్డ దయానంద్ ఉద్యోగ రీత్యా జిల్లాలో ఉన్నప్పుడే కథా రచన ప్రారంభించి మంచి కథలు రాశాడు. సిద్ధిపేటకు చెందిన నక్షత్రం వేణుగోపాల్ 'పర్యవసానం' ఉద్యమ నేపథ్యంలో వచ్చిన కథ. ఉద్యమానికి సహాయం చేయలేకపోయిన

ఉపాధ్యాయుని మనస్సంఘర్షణ ఇతివృత్తం. పోగులరాజన్న వరకట్న హత్యలకు స్పందించి రాసిన కథ ఆంధ్రప్రభలో వచ్చింది.

సిద్ధిపేటకుచెందిన ఐతాచంద్రయ్య కథారచనలో విశేష కృషి చేస్తున్నారు. 'కుంకుమ రేఖలు' కథాసంపుటి వెలువరించాడు. సామాన్యుల కడగండ్లు ఇతివృత్తంగా గ్రహించి రాసిన కథలు బాగా గుర్తింపు తెచ్చుకున్నాయి. విశేషంగా కథారచన సాగిస్తున్న మరో రచయిత చొప్పదండిసుధాకర్. గ్రామీణ, పట్టణ మధ్య తరగతి నేపథ్యంతో సుధాకర్ రాసిన కథలకు ప్రాచుర్యం లభిస్తున్నది. పోలవరం ముంపు నేపథ్యంలో రాసిన కథకు మైత్రేయ కళా సమితి బహుమతి ప్రకటించింది. రావురూకులకు చెందిన కందుకూరి శ్రీరాములు కొన్ని కథలు రాశాడు. సామల సువర్ణాదేవి ఇటీవల కథలు రాస్తున్నది.

జీవితం ఎన్నో కొత్త మలుపులు తిరుగుతున్నది. ప్రపంచీకరణ పల్లెల్ని, వృత్తుల్ని, మానవ సంబంధాలు మార్చివేస్తున్నది. సమస్త విలువల్లో తీవ్రమైన మార్పు చోటు చేసుకుంటున్నది. వీటన్నింటిని చిత్రిస్తూ కథలు రావాల్సి ఉంది. జిల్లాలో కొత్త కథకులు తయారు కావల్సిన అవసరం ఎంతో ఉన్నది.





# మెతుకు కళ

**దేశపతి శ్రీనివాస్**

ఒక ప్రాంతం సామాజిక ఆర్థిక పరిణామాలు ఆ ప్రాంత సాంస్కృతిక జీవనాన్ని ప్రభావితం చేస్తాయి. మంజీరానది పరవళ్ళతో పరవశించే మెదుకుసీమలో సహజవనరులకు లోటు లేదు. సామాజిక దోపిడీ, పీడన, పాలనలో అమలైన వివక్ష, దగాకోరు రాజకీయ నాయకత్వాల విషవలయం ఈ జిల్లాను వరుస కరువుకు, వలస బ్రతకుకు గురిచేసింది. అయితే ఈ ప్రతికూలతలనీ అధిగమిస్తూనే ఈ నేల తన సాంస్కృతిక చైతన్యాన్ని ప్రదర్శించింది. ప్రపంచాన్ని ఆకర్షించిన కళామూర్తులను కన్నది. వ్యావసాయిక జీవన సౌందర్యాన్ని, సంక్షోభాన్ని వర్ణచిత్రాలుగా మలిచింది, మంజీరా జలధారల ఉద్వేగ ధ్వనితో కవిత్వాన్ని, మృణ్మయ శిల్పాలను మలిచింది. గుండెల కంజీరల మీద దరువేసి జననాట్యమాడింది.

మెదక్ జిల్లా మంజీరా జలధారలకే కాక జానపద సంగీత సజీవ ధారలకు పుట్టినిల్లు. జిల్లాలో కనిపించే వృత్తి (జానపద) కళాకారుల్ని పరిశీలిద్దాం.

1. **చిందుమాదిగలు :** పగటిపూట ప్రదర్శన లిచ్చే కళాకారులు వీళ్ళు. రామాయణ, భారత కథలను పగటిపూట బయదిలాటలాడే మాదిగలు. వీళ్ళ ఆహార్యం వీళ్ళ ప్రాచీనతని తెలియజేస్తుంది.
2. **దేవినోళ్ళు :** దేవినోల్ల బాగోతం ప్రజలకు ప్రీతిపాత్రమైంది. మెదక్, గజ్వేల్, నాచారం, సిద్ధిపేట పరిసర ప్రాంతాలలో కొన్ని కుటుంబాలు కనిపిస్తున్నాయి.
3. **రొంజోళ్ళు :** రొంజ అనే మనిషెత్తు వాయిద్యాన్ని వాయిస్తూ కథలు చెప్పుతారు. విశ్వబ్రాహ్మణుల పోషణలో యాచించి బతుకుతారు.

**4. వీరముష్టివాళ్ళు** : శైవులు, కన్యకమ్మ మీద పాడుతరు.

**5. శారదకాళ్ళు** : ఎడమచేతి బొటనవేలికి అందె ధరించి కుడిచేత్తో శారద వీణను మీటుతూ వంతలు బుర్రలు వాయిస్తుండగా కథలు చెప్పుతరు.

**6. బైండ్లోళ్ళు** : బవనికలను వాయించడం వల్ల బవనీలని, బైండ్లోల్లనీ వ్యవహారం ఏర్పడ్డది. ఎల్లమ్మ పరశురాముల కథలు చెప్తారు.

**7. ఒగ్గుకథ** : బీరప్పలుగా పిలువబడే ఒగ్గు కథకులు ఇక్కడ కనిపిస్తారు. ఒగ్గుకథ తెలంగాణ ప్రజలకు ప్రాణప్రదమైన కళ. ఈనాటికీ ఆకర్షణ కోల్పోని కళ.

ఇంకా జడకొప్పులు, కోలాటాలు, బాలసంతులు పెద్దమ్మలోళ్ళు పాడే పాటలు, ఆడే ఆటలేకాక శ్రామిక జనం వివిధ పనుల సమయంలో పాడేపాటలు. పీరీల పండుగ, హోలీ, దసరా వంటి ఉత్సవ సమయాల్లో పాడే పాటలు ప్రజల నోట్లో నడయాడుతుంటయి.

**చిత్రకళ**

అంతర్జాతీయ ప్రఖ్యాతి గాంచిన ఇద్దరు అగ్రశ్రేణి చిత్రకారులు మెతుకుసీమ మట్టిబిడ్డలే. తెలుగు చిత్రకళా వికాసాన్ని ఈ ఇద్దరి కృషిని వివరించకుండా అర్థం చేసుకోలేము. ఒకరు గ్రామీణ జీవన సహజ సౌందర్యాన్ని చిత్రాలుగా అనువదించిన కాపు రాజయ్య కాగా మరొకరు 'మురల్' మొదలైన ఆధునిక చిత్ర కళారీతులకు తెలుగు చిత్రకారులలో ఆద్యులుగా నిలిచిన లక్ష్మాగౌడ్.

కాపు రాజయ్య తన తొలిపాఠాలు నేర్చుకున్నది బతుకు బడిలోనే. సాంప్రదాయిక జానపద చిత్రశైలి నకాశీ కళ నుండి రాజయ్య కుంచె సృష్టించే నవీన రేఖ ఆవిర్భవించింది. ఇవాళ రాజయ్య సృష్టించిన చిత్రాలు యూనివర్సిటీల సిలబస్‌లలో పాఠాలుగా చోటుచేసుకున్నాయి. రాజయ్య చిత్రకళలలో కనిపించే వర్ణ సాంకేతిక ప్రమాణాలన్నీ ఆయన స్వయంకృషితో సాధించుకున్నవే. ముదురు రంగులలో తెలంగాణా శ్రామిక కులాల శరీరాకృతుల్ని ప్రదర్శించడంలో రాజయ్యది అద్భుతమైన ముద్ర. రంగురూపుల్నే కాక తెలంగాణ స్త్రీల కట్టూబొట్టూ ముఖ కవళికలు సహజ సుందరంగా బతుకు వాసన వేస్తూ పరిమళిస్తాయి. రాజయ్య చిత్రాలు జాతీయ పురస్కారాల్ని గెలుచుకున్నాయి. అంతర్జాతీయ చిత్రకళా ప్రదర్శన లెన్నింటిలోనో చూపరులను కట్టిపడేసినయి. అన్ని ఆర్ట్‌గ్యాలరీల, మ్యూజియంల, కళా సంస్థల సేకరణలో రాజయ్య చిత్రాలు చోటు చేసుకున్నాయి. కళాప్రపూర్ణ వంటి బిరుదులూ అనేక అవార్డులూ ఆయన అందుకున్నారు. ప్రతిభావంతుడైన చిత్రకారుడిగా నిగ్గుతేలిన



రాజయ్యలో నిరాడంబరత్వం కూడా ఒక ఆకర్షణే. నిత్యం చిత్రరచనా పరిశ్రమలో మునిగితేలే రాజయ్య తల్లివేరుని మరువకుండా సిద్ధిపేటలో లలితకళాసమితిని స్థాపించి ఔత్సాహిక చిత్రకారుల్ని తీర్చిదిద్దుతున్నారు.

ఆధునాతన జీవితంలో మనిషి కోల్పోతున్న సాంస్కృతిక మూల్యాలను దర్శింప చేసే చిత్రకారుడు లక్ష్మాగౌడ్. గ్రామీణ జీవన, సంబంధాల మీద అపారమైన గౌరవమున్న చిత్రకారుడు. ఆయన 70వ దశకంలో సాహిత్యాన్ని విప్లవాత్మకమైన మలుపు తిప్పిన దిగంబర కవులతో ఏర్పడ్డ సాన్నిహిత్యంతో కొత్త దృక్పథంతో జీవితాన్ని దర్శించే ప్రయత్నం ప్రారంభించారు. సదాశివపేటకు ఏడు కిలోమీటర్ల దూరంలో వుండే నిజాంపూర్ గ్రామంలో 1940వ సంవత్సరం లో జన్మించిన లక్ష్మాగౌడ్ చిత్రకళా రచనలలో అత్యున్నత ప్రమాణాలను ప్రదర్శించారు. హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం లలిత కళల విభాగం అధిపతిగా బాధ్యతలను నిర్వహించారు.

సమాజం పట్ల బాధ్యత, ఆరాటం కలిగిన లక్ష్మాగౌడ్ మతోన్మాదానికి వ్యతిరేకంగా హైదరాబాద్ నగరంలో ప్రత్యేక ప్రదర్శన నిర్వహించారు. స్త్రీల మీద జరుగుతున్న హింస, అకృత్యాల మీద గివ్ మి మై డే (Give me my day) అనే పుస్తకాన్ని వెలువరించారు. గ్రాఫిక్ డిజైన్‌లలో నూతనత్వాన్ని అన్వేషిస్తూ హంబర్గ్‌లోని డిజైన్స్ ఇనిస్టిట్యూట్‌లో తామ్ర కళారూపాలను రూపొందించారు. మ్యూనిచ్ అకాడమీ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్‌తోనూ పీటర్ క్లియన్‌లతోనూ వర్క్‌షాపులు నిర్వహించి కళారూపాల సృష్టిలో కొత్తపుంతలు తొక్కారు. వర్ణ ప్రపంచ రహస్యాలు, సామాజిక తాత్త్విక ధోరణులు కలగలిసిన చైతన్యవంతమైన చిత్రకళతో లక్ష్మాగౌడ్ చిత్రలేఖనంలో విలక్షణమైన ముద్రవేసి, జన్మభూమి అయిన మెదక్ జిల్లాకు ఎనలేని ఖ్యాతిని ఆర్జించి పెట్టారు.

పగిలిన మైనంలో జీవన రేఖల్ని ఆవిష్కరించే కళ బాతిక్. బాతిక్ ఇంటిపేరుగా మారిన చిత్రకారుడు బాలయ్య. బాతిక్ బాలయ్యగా పేరు పొందిన యాసాల బాలయ్యది సిద్ధిపేట మండలం ఇబ్రాహీంపూర్. బాలయ్య చిత్రాలు సిద్ధిపేట చిత్రశైలిగా పేరుపడటం ఒక విశేషం. మైనంలో ముంచిన బట్టమీద మెచ్యూర్డ్‌స్ట్రోక్‌తో చిత్రించే అపురూప నైపుణ్యం బాలయ్య గొప్పతనం. అనేకమంది ప్రముఖులు, ఆర్ట్‌గ్యాలరీలు బాలయ్య చిత్రాలను సేకరించినయి. బాలయ్య బాతిక్ చిత్రకల్పన మీద దూరదర్శన్ డాక్యుమెంటరీని ప్రసారం చేసింది. విదేశీ కళాభిమానులు కూడా ప్రత్యేక అభిమానంతో బాలయ్య చిత్రాలను సేకరించటం విశేషం.

కాపు రాజయ్య లక్ష్మాగౌడ్‌ల తర్వాత యువతరంలో ప్రపంచం దృష్టిని ఆకర్షించగలిగిన చిత్రకారుడు శిల్పి రమణారెడ్డి. కొండపాక మండలం లకుడారం

రమణారెడ్డి పుట్టినూరు. లోతైన దృష్టి, నిశిత పరిశీలన, సృజనాత్మక నైపుణ్యం వున్న రమణారెడ్డి పికాసో, సాల్వడార్ డాలీ, వాంగోల చిత్రరీతుల్ని అధ్యయనం చేసి, తనదైన రేఖను రూపుదిద్దుకున్నాడు. ప్రయోగశీలి అయిన రమణారెడ్డి 1999లో జర్మనీలో బ్లైబరయన్ వంతెనకింద నీటిలో కేన్వాస్‌పై వర్ణచిత్రం గీసి, అలల కదలికలతో చిత్రంలో కదలికలు ఆవిష్కృతమయ్యే అరుదైన ప్రయోగం చేసిండు. 'శిరస్సు' ఒక అంశంగా స్పెషలైజేషన్ చేసిన రమణారెడ్డి గొప్పశిల్పి కూడా.

విభిన్న స్థితులలో వుండే మహిళల హావభావాలని బొమ్మకట్టిన చిత్రకారిణి డా. అంజనీరెడ్డి. వేయికిపైగా చిత్రాలు రచించిన అంజనీరెడ్డి జె.ఎన్.టి.యు. కళాశాలలో ఆచార్యులుగా పని చేస్తున్నారు. హైదరాబాద్ ఆర్ట్ సొసైటీ అవార్డు ఎఫ్.ఎఫ్.సి. అర్ధశతాబ్ది అవార్డు 1998లో స్త్రీ మేళా అవార్డును ఆమె అందుకున్నారు. సదాశివపేట దగ్గర నందికంది అంజనీరెడ్డిగారి సొంతవూరు. ఒక మహిళా చిత్రకారిణిని సైతం అందించిన ఘనత అంజనీరెడ్డి గారి ద్వారా మెదక్ జిల్లాకు దక్కింది.

లబ్ద ప్రతిష్టులకే కాక అనేకమంది ఔత్సాహిక చిత్రకారులకూ మెదక్ జిల్లాలో కొదువలేదు. ప్రభుత్వ పాఠ్యపుస్తకాలలో బొమ్మలతో పలుకరించే కడార్ల శేషయ్య, బుక్‌ఇలస్ట్రేషన్‌లో శిక్షణ పొందిన కె. గౌరీశంకర్, కె.నర్సారెడ్డి లాంటి సీనియర్లతోపాటు జిల్లాకు చెందిన మరో చెప్పుకోతగిన చిత్రకారుడు దాశరథి రంగాచార్య వేదాల అనువాదాలకు ముఖచిత్రం గీసిన నారాయణ్‌ఖేడ్‌కు చెందిన అద్దంకి నరసింహాచారి. చారి చిత్రకళ మీద వ్యాసాలను కూడా రాసిండు. గజ్వేల్‌కు చెందిన లోకేందర్‌కు సంజీవదేవ్ వంటి చిత్రకారుల సాన్నిహిత్యం లభించింది. ఆధునిక చిత్రకళావాదాలతో పరిచయం వుంది. ఇంకా రుస్తుం, ఎ.ప్రభాకర్ తదితరులలో వికసించడానికి అవసరమైన మౌలిక ప్రతిభ వుంది.

### శిల్ప కళ

మెదక్ జిల్లా నుండి పేరుమోసిన శిల్పకారులలో ఒకరు కొంపర్తి బాల్‌రత్నం. బాల్ రత్నం చేతిలో పడితే మట్టి, గాజు, మైనం, చెక్క ఇత్తడి పదార్థమేదైనా సరే ఆకర్షణీయ శిల్పాకృతిని పొందుతుంది. ఆధునిక శిల్పకళను కూడా అవగాహన చేసుకున్న బాల్‌రత్నం రాష్ట్ర లలిత కళా అకాడమి ప్రోత్సాహంతో భారత భాగవత గాథలతో 12 దారుశిల్పాలు చెక్కారు. వందకుపైగా విభిన్న దారుశిల్పాల్ని మలిచారు. జాతీయస్థాయిలో బాల్‌రత్నం గారి శిల్పాలు ప్రదర్శితమయ్యాయి. రాష్ట్ర పురావస్తుశాఖ బాల్‌రత్నంగారి శిల్పాలను సేకరించింది. వివిధ పోటీలలో ఆయన అనేక బహుమతుల్ని అందుకున్నారు. బాల్‌రత్నం కూడా సిద్ధిపేట నివాసే.



శిల్పాల తయారీకి పనికిరాని వస్తువేదీ లేదని నిరూపించిన శిల్పి జి.రాజేశం. ఎండిపోయిన ఆనిగెపు కాయతో మలిచిన 'మూడు ముఖాలు' అనే శిల్పం లలితకళా సమితి జిల్లాలో నిర్వహించిన పోటీలో బహుమతి పొందింది. చెట్ల వేర్లతోనే రాజేశం మలిచిన 'ఒలింపిక్ టార్చ్' శిల్పం 29వ ఆల్ ఇండియా ఎగ్జిబిషన్‌లో అవార్డును గెలుచుకుంది. సీతాఫలం కొమ్మతోటి, రైసుమిల్లులో చెడిపోయిన తర్వాత పడేసే ఇనుపముక్కలు జాలీలతో శిల్పాల్ని మలిచారు. ఇనుపజాలీతో తయారుచేసిన 'గుడ్లగూబ' శిల్పాన్ని కేంద్ర లలితకళా అకాడమి కొనుగోలు చేసింది.

1983లో అకాల మరణం పాలైన వెంగళవీరబ్రహ్మాచారి మంచి శిల్పి. హైదరాబాద్ ఆర్ట్‌సొసైటీ, హైదరాబాద్ లలితకళా అకాడమిల ప్రదర్శనలో వీరబ్రహ్మాచారి శిల్పాలు బహుమతులు గెలుచుకున్నాయి. జాతీయస్థాయి ప్రదర్శనలలో చారి మలిచిన శిల్పాలు చోటు చేసుకున్నాయి. విఠలాపురం గ్రామానికి చెందిన వీరబ్రహ్మాచారి అర్ధాంతరంగా మరణించడం విషాదం.

### సంగీతం సంగతులు

మెదక్‌జిల్లాలో సంగీతం శ్రామిక కులాలు ప్రదర్శించే జానపద కళారూపాలలో, మధ్యతరగతి అభిరుచి ప్రదర్శించిన శాస్త్రీయ లలిత సంగీత ధోరణులలో, సామాజిక విప్లవం కోసం ఉవ్వెత్తున ఎగిసిన ఉద్యమగానాలలో మూడు పాయలుగా ప్రవహించింది.

సాహిత్యంలో విఠాలచంద్రమౌళి శాస్త్రి ఎంత ఘనుడో సంగీతంలో ఉమాపతి నారాయణ శాస్త్రి అంతటి వాడు. 1920 ప్రాంతంలో సిద్ధిపేట ప్రాంతంలో కళాభిమానుల అభిప్రాయమిది. స్వతఃసిద్ధమైన గాత్రశుద్ధి, మంచి అభ్యాసంతో అలవడ్డ సుస్వరం గాఢమైన సాహిత్యాభినివేశం నారాయణశాస్త్రిని మంచి కళాకారుడిగా తీర్చిదిద్దినాయి. 1933లో మతిచలించి తన ముప్పై సంవత్సరాల వయసులోనే నారాయణ శాస్త్రి అకాలమరణానికి గురికావడం విషాదం.

హార్మోనియం మెట్లమీద అలవోకగా కదులుతున్న తిగుళ్ళ వరదాచారి చేతివేళ్ళను ఆనందంగా ముద్దుపెట్టుకున్నారట ప్రముఖ సంగీత కళాకారుడు చిత్తూరు నాగయ్య. అంతటి నాగయ్యను అబ్బురపరిచిన ఉన్నతశ్రేణి వాయిద్యకారుడు వరదాచారి. సిద్దిపేట ప్రాంతంలో ఆనాటి కళాకారులకు ఆయనే ప్రేరణ. 1963లో తన తమ్ముడు మంచి గాయకుడు అయిన శ్రీనివాసా చారితో ప్రయాణిస్తూ ఆక్సిడెంట్‌లో 50వ ఏట దుర్మరణం పాలైనారు వరదాచారి.

1960 ప్రాంతంలో విఠాలచంద్రమౌళి శాస్త్రిగారి పద్యాలతో లంకా సుబ్రహ్మణ్యశాస్త్రి చెప్పే సుందరకాండ హరికథ వినడానికి సంగీతాభిమానులు ఏ ప్రాంతానికైనా తరలి

వచ్చేవారు. లయబ్రహ్మగా పేరుగాంచిన లంకా సుబ్రహ్మణ్యశాస్త్రి ఆంధ్ర ప్రాంతం నుంచి తన యవ్వన కాలంలో వలసవచ్చి గజ్వేల్‌లో స్థిరపడి పోయారు. శాస్త్రీయ సంగీతంలో ఎవరికీ తీసిపోని దిట్ట ఆయన. ఈ ప్రాంతంలో చాలామందికి ఆయన గొప్ప ప్రేరణ నిచ్చారు.

1955లో ఔత్సాహితులైన గాయకులు శారదా సంగీత నాట్యమండలి అనే సంగీత సంస్థను స్థాపించారు. హరిపురం వెంకట్రామయ్య పంతులు, చలంగారి సదాశివరావు, కొమురవెల్లి చంద్రమౌళి, దేశపతి సీతారామశర్మ, మెట్టు రామశర్మ, ఉమాపతి పద్మనాథ శర్మల పూనికతో ఈ సంస్థ ఏర్పాటైంది.

హరికథాగానం కొత్తపుంతలు తొక్కించి పండితుల దగ్గర్నుంచి పల్లెజనుల మధ్యకు నడిపింప జేసిన ప్రత్యేకత రుక్మాభట్ల విధుమౌళి శాస్త్రిగారిది. జిల్లాలో సాంప్రదాయ సంగీతకారుల చరిత్రలో ఎక్కువ పుటలు సొంతం చేసుకోగలిగిన ప్రాధాన్యత విధుమౌళిశాస్త్రిది. గజవెల్లి మట్టిలో గాన సౌరభాన్ని అద్దుకున్న విధుమౌళిశాస్త్రికి రామాయణం అంటే ప్రాణం. ఒక సందర్భంలో జానపద వృత్తిగాయకులు చెప్పిన ఎరుకల నాంచారి కథ ఆయన మనసులో కొత్త మెరుపులు మెరిపించింది. ఆ ప్రేరణలోంచి ఉద్భవించింది 'తందనాన రామాయణం' అనే కొత్త ప్రక్రియ. జానపద బాణీలో ఆధ్యాత్మిక ఆవేశంతో విధుమౌళి శాస్త్రి చేసిన తందనాన రామాయణ గానానికి పరవశించని తెలంగాణ పల్లెలేదు. స్వయంగా విధుమౌళి రచించి స్వరాలు కూర్చుకున్న తందనాన రామాయణం గొల్లపూడి వీరాస్వామి సన్స్ పుస్తకంగా ప్రచురించి లక్షల కాపీలు అమ్మారు. ఇప్పటికీ గ్రామీణ ప్రాంతాల అంగడులలో ఈ పుస్తకం దర్శనమిస్తది. విధుమౌళిశాస్త్రి గాన ప్రదర్శన ఒక ధోరణిగా (Trend) మారింది. అనేకమంది అనుయాయులు కథలు చెప్పడం ప్రారంభించారు. వీరిలో ఎక్కువమంది కింది కులాలవాళ్ళే. ఇప్పటికీ బిక్షం అడుక్కునే వాళ్ళ నోళ్ళల్లో సైతం తందనాన రామాయణం కీర్తనలు వినిపిస్తుంటాయి.

శివ భాగవతార్‌గా ప్రసిద్ధిగాంచిన యాయవరం రామదత్తశర్మ కర్ణాటక, హిందూస్థానీ సాంప్రదాయ సంగీతాలలో పట్టువున్న హరిదాసు. మహారాష్ట్ర ప్రాంతంలో జరిగే సంగీత 'దర్బారు'ల్లో కచేరీలను చేసిన ఘనత వీరి సొంతం. ఒక రాగం నుంచి మరో రాగంలోకి అలవోకగా మారిపోతూ వీరు పాడే 'పంచదశీ' అనే రాగమాలిక వినడం గొప్ప అనుభవం. అవధూత సాంప్రదాయంలో అలవడిన నిరాడంబరత్వం, వైరాగ్యం కారణంగా వీరి ప్రతిభకు రావాల్సినంత ప్రచారం రాలేదు. ఇటీవల 2006లో 80కి పైబడిన వయసులో తమ స్వగ్రామమైన మంగళపర్తిలో ఆయన కన్నుమూసారు.



మంగళహారతులు రచించి పాడే సాంప్రదాయం మెదక్ జిల్లాలో విరివిగా కనిపిస్తుంది. రుక్మాభట్ల విధుమౌళిశాస్త్రి గౌరీభట్ల రఘురామశర్మ (రిమ్మనగోడు) అప్పాల విశ్వనాథశర్మ (మరుకూకు) ఈ ప్రక్రియలో ప్రసిద్ధులు.

తిగుళ్ళ వరదాచారి గారి దగ్గర స, పా, సా లు నేర్చుకున్న దేశపతి సోదరులలో ఒకరు సాహిత్యంలో, మరొకరు సంగీతంలో ఎక్కువ ప్రాచుర్యం పొందారు. దేశపతి సీతారామ శర్మ హార్మోనియం వాయిస్తూ హిందూస్థానీ ఫక్కీలో రాధేశ్యాం రామాయణం చెవులకింపుగా గానం చేసి ఆకట్టుకున్నారు. 1980 వరకూ హరికథా గానం చేసిన వీరు 1993లో మరణించారు. సిద్ధిపేట ప్రాంతంలో ప్రతి సాహిత్య సభ దేశపతి గోపాలకృష్ణ శ్రావ్యంగాపాడే ప్రార్థనాగీతంతో మొదలయ్యేది. చక్కగా కీర్తనలు పాడగలిగిన గోపాలకృష్ణ చక్కటి పద్యం రాసిన కవి కూడా.

గేయవాల్మీకిగా ప్రసిద్ధి చెందిన హరికథకులు శ్రీ రుక్మాభట్ల నరసింహస్వామి. తందనాన రామాయణం సృష్టికర్త విధుమౌళి శాస్త్రి వీరి తండ్రి. తండ్రి పాడినంత కాలం ఆయనతో సహగానం చేసిన నరసింహస్వామి తండ్రి మరణం తర్వాత హరికథాగానంలో తమదైన కొత్త పంథా ఏర్పరుచుకున్నారు. తండ్రి పూర్తిగా జానపద బాణీలలో తందనాన రామాయణం రచించగా నరసింహ స్వామి గారు కొద్దిగా లలిత సంగీతానికి చేరువగా ఉండే గేయ రామాయణాన్ని స్వయంగా కూర్చుకున్నారు. హార్మోనియం వాయిస్తూ గంభీరమైన గొంతుతో ఆకర్షణీయంగా ఆలాపించే గేయరామాయణం పల్లెలు, పట్టణాలు అనే తేడా లేకుండా ప్రజలను ఆకట్టుకుంది. క్యాసెట్ల ద్వారా కూడా విరివిగా ప్రచారమయింది. నరసింహస్వామి కుమారుడు కోదండ రామశర్మ కూడా అందంగా పాడగలిగిన గాయకుడు.

ప్రస్తుతం సిద్ధిపేటలో నివాసముంటున్న నరసింహస్వామి గారు అనేక ఘన సత్కారాలను అందుకున్నారు. అరవయ్యవ వడిలోనూ అవిశ్రాంతంగా పాడుతున్నారు.

సిద్ధిపేటలో చివురించిన మరో సుమధుర గాత్రం ఉమాపతి పద్మనాభ శర్మ. శాస్త్రీయ లలిత సంగీత గానంలో మంచి అవగాహన ఉన్న గాయకుడీయన. వయొలిన్, వేణు వాదనంలోనూ వీరికి ప్రవేశం వుంది. ఎనభయ్యవ వడిలో వున్న పద్మనాభశర్మ ప్రస్తుతం విశ్రాంత జీవనం గడుపుతున్నారు.

జహీరాబాద్‌కు చెందిన రాంభట్ జోషిగారు హిందూస్తానీ సంగీతంలో మంచి ప్రవేశం వున్న గాయకులు. జిల్లాలోని పాఠశాలలో సంగీత అధ్యాపకులుగా చాలామందికి సంగీత శిక్షణనిచ్చారు. ప్రస్తుతం జహీరాబాద్‌లో విశ్రాంత జీవితం గడుపుతున్నారు. వీరి కుమార్తె మంగళజోషి మెదక్ బాలికల ఉన్నత పాఠశాలలో సంగీత అధ్యాపకురాలుగా పని చేస్తున్నారు.

శాస్త్రీయ లలిత సంగీతంలో జిల్లా నుండి ఎక్కువగా ప్రచారం పొందిన గాయకుడు శివ్వంపేట మండలం గొట్టిముక్కలకు చెందిన రామాచారి. హైదరాబాద్‌లో నివాసముంటున్న రామాచారి శాస్త్రీయ సంగీతంలో అనేకమందికి శిక్షణ నిస్తున్నారు. అనేక క్యాసెట్లు వెలువ రించారు. దూరదర్శన్ ద్వారా ఎన్నో భక్తి, లలిత గీతాలు ప్రసారమైనాయి. ప్రస్తుతం హైదరాబాద్‌లో పేరెన్నికగన్న సంగీత శిక్షణా సంస్థను నడుపుతున్నారు.

జానపద గీతాలు పాడడంలో రాష్ట్ర వ్యాప్తంగా గుర్తింపును పొంది ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ అందించే కళారత్న పురస్కారం పొందిన ఎస్.ప్రభాకర్ సిద్దిపేట దగ్గరున్న ఎన్సాన్ పల్లి నివాసి. వీరి పాటలు రేడియో ద్వారా జాతీయ స్థాయి కార్యక్రమాల్లో కూడా ప్రసారమైనాయి. దూరదర్శన్ ద్వారా కూడా వీరి పాటలు అనేకసార్లు ప్రసారమైనాయి.

శాస్త్రీయ సంగీత కచేరీలను జిల్లాలో ఏర్పాటు చేసిన పల్లవీ ఆర్ట్ 1986లో ఏర్పాటయింది. త్యాగరాయ సంగీతోత్సవాలను నిర్వహించింది. వితల శ్రీకాంతశర్మ, దేశపతి శ్రీనివాసశర్మ అష్టకల రామ్మోహనశర్మ, రామగిరి శివకుమార్ శర్మ నేతృత్వంలో ఈ కచేరీలు ఏర్పాటైనాయి. తర్వాతి కాలంలో దేశపతి శ్రీనివాస శర్మ పూనికతో స్వరసాధన సంగీత శిక్షణాలయం 2001లో ఏర్పాటయి శాస్త్రీయ సంగీత శిక్షణని ఔత్సాహికులకు ఏర్పాటు చేసింది. ఈ సంస్థ 2002 నుండి ఘనంగా సంగీతోత్సవాలను నిర్వహిస్తున్నది. శాస్త్రీయ, లలిత, జానపద సంగీత కార్యక్రమాలను ఏర్పాటు చేస్తున్నది. ఎల్లా వేంకటేశ్వరరావు వంటి ప్రముఖుల వాద్య కచేరీలు ఏర్పాటు చేసింది. సంస్థ నిర్వాహకుడైన దేశపతి శ్రీనివాస శర్మకు కీబోర్డు, తబలా వాదనలో మెప్పించ గలిగిన ప్రతిభ వుంది. రాష్ట్ర వ్యాప్తంగా పలు కచేరీలకు సహవాద్య నిర్వహణ చేయటమే కాక మాటీవీలోని 'పాడాలనివుంది' కార్యక్రమంలో న్యాయనిర్ణేతగా కూడా వ్యవహరించి ప్రముఖుల గుర్తింపును పొంద గలిగాడు.

దోపిడీ వ్యవస్థ మీద పాటల ఫిరంగుల్ని పేల్చిన ప్రజా యుద్ధనౌక గద్దర్ మెదక్ జిల్లా బిడ్డ కావటం గర్వకారణం. తెలుగు సాంస్కృతిక చరిత్రలో మహోన్నత శిఖరంగా నిలబడ్డ గద్దర్ పుట్టింది తుప్రాన్‌ల. గద్దర్ ఒక చరిత్ర. లక్షలాది మంది ప్రజల్ని కదిలించిన గానశక్తి. ప్రజలను సాయుధుల్ని చేసిన విప్లవం. ఆకాశాన్ని అందుకున్న అమరత్వాన్ని పాడుకుంటున్న పల్లెల సామూహిక గానం. ఆయన పాటలు ప్రపంచ భాషలలోకి అనువదితమయ్యాయి. ప్రపంచస్థాయి ప్రజాగాయకుల వరుసలో ఆయన ఉన్నతంగా నిలబడ్డారు. ఆయన పాటవినని చెవి లేదు. పాడుకోని గొంతులేదు. సినిమా, టి.వి.ల సహకారం లేకుండా ప్రజల మధ్య నుంచి ఎగిసిన ఆయన గొప్ప



ప్రజాకర్షణ కలిగిన గాయకుడిగా చరిత్ర సృష్టించారు. ఆయన మీద, ఆయన పాటల మీద వందల పేజీల కొద్దీ సాహిత్యం వచ్చింది. డాక్యుమెంటరీ సినిమాలు తయారైనాయి. గద్దర్ గొంతులో బాణీలలో రచనలో వున్న సమ్మోహన శక్తి, అనితర సాధ్యం. తూటాలు శరీరాన్ని చీల్చినా పాటమానని గద్దర్ మనోస్థైర్యం ఒక చరిత్రనే. సాహిత్యంలో నిర్లక్ష్యంగా చూడబడ్డ పాట రచనను అత్యున్నత స్థాయికి చేర్చిన గద్దర్ తెలుగు వాడు కావడం అండ్ల తెలంగాణావాడు అవడం, మెదక్‌జిల్లా ముద్దుబిడ్డడు కావడం వల్ల ఈనేల కీర్తి అజరామరం అయింది.

గాయకుడు రసమయి బాలకిషన్ పేరు తెలియని వారుండరు. సిద్దిపేట మండలం రావురూకులలో పుట్టిన బాలకిషన్‌కు జానపద పాటలు పాడే గాయకుడిగా తొలుత గుర్తింపు. 'రసమయి' బాలకిషన్ స్థాపించిన సాంస్కృతిక సంస్థ. ఆ సంస్థ నుండి బాలకిషన్ అనేక ప్రదర్శనలు విరివిగా ఇవ్వటంతో సంస్థపేరు ఇంటిపేరుగా మారింది. పల్లెపాటలెన్నో బాలకిషన్ గొంతులో మ్రోగి పదులకొద్దీ క్యాసెట్లుగా వెలువరించ బడ్డాయి. పౌరసంబంధాల శాఖ, యువజన సర్వీసులశాఖ నిర్వహించిన రాష్ట్రస్థాయి, జాతీయ స్థాయి సాంస్కృతిక పోటీలలో బాలకిషన్ తన బృందం ప్రదర్శనల ద్వారా బహుమతులు గెలుచుకున్నాడు. తెలంగాణా ఉద్యమం తీవ్రమవుతున్న దశలో ఏర్పడ్డ తెలంగాణా రాష్ట్ర సమితితో మొదట్నుంచి అనుబంధమున్న బాలకిషన్ పార్టీకి అవసరంగా రూపొందించిన క్యాసెట్లు బహుళ ప్రచారాన్ని పొందాయి. కళాకారుడిగా బాలకిషన్ జీవితంలో మేలిమలుపు 'తెలంగాణా ధూంధాం' కార్యక్రమానికి రూపకల్పన చేయటం. బాలకిషన్ నేతృత్వంలో ప్రారంభమైన ధూంధాం హైదరాబాద్ ప్రదర్శన చారిత్రాత్మకమైనది. ఇవాళ తెలంగాణ పది జిల్లాల్లో 'ధూంధాం సి.డి.' లేని ఇల్లు లేదు అంటే ఆ కార్యక్రమానికి నిర్వాహకుడిగా బాలకిషన్‌కు వచ్చిన ప్రాచుర్యాన్ని ఊహించుకోవచ్చు.

పాటనీ మాటనీ కలిపిన దేశపతి శ్రీనివాస్ గాయకుడు మాత్రమే కాదు. ప్రజాఉద్యమాలకు గాన వాహకుడు కూడా. మంజీరా రచయితల సంఘం వెలుగులో వికసించిన దేశపతి శ్రీనివాస్ మంచి నటుడు, కవి, గాయకుడు, వక్త. మంజీరా రచయితల సంఘం సభలలో పాడే పాటలతో సాహిత్య సాంస్కృతిక ప్రపంచానికి పరిచయమైన దేశపతి మద్యపాన వ్యతిరేక ఉద్యమంలో ఊరూరా పాటలతో హోరెత్తించాడు. జిల్లాలోనూ రాష్ట్రంలోనూ జరిగే ఉపాధ్యాయ ఉద్యోగ వర్గ ఉద్యమాలకు పాటల బాసట నిచ్చిండు. తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమంతో మమేకమైన దేశపతి ఉద్యమం ప్రతి సందర్భాన్ని పాటలతో మండిస్తున్నాడు. ఉపన్యాసాన్ని పాటని ఏక కాలంలో సంధించే శ్రీనివాస్ తెలంగాణాలో ప్రజాసంఘాల సభలలో ప్రధాన ఆకర్షణ

అయిండు. తెలంగాణ ధూంధాం సభల్లో బాలకిషన్ దేశపతి శ్రీనివాస్ లిద్దరూ ప్రధాన ఆకర్షణ. సిద్దిపేటలో పుట్టి పెరిగిన దేశపతి శ్రీనివాస్ ప్రస్తుతం చిన్నకోడూరు జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో భాషాపండితుడిగా ఉద్యోగబాధ్యతల్ని నిర్వహిస్తున్నాడు. శ్రీనివాస్ పాడిన 'నాగేటి చాళ్లల్ల' ఆడియో క్యాసెట్ చాలా ప్రాచుర్యం పొందింది.

బహుజన గీతాలు రచించిన కవిగా, గాయకుడిగా భీమసేనకు మంచి గుర్తింపువుంది. 'తాలెలెల్లో' అనే పాటల సంపుటిని కూడా ప్రచురించాడు. దుబ్బాక మండలం రామక్కపేటకు చెందిన భీమసేన పాటలు ఆడియో క్యాసెట్‌ల ద్వారా ప్రచారాన్ని పొందినాయి.

ప్రజాకళా మండలి, తెలంగాణా కళాసమితి ద్వారా ప్రచారం పొందిన కళాకారులు బందరు నర్సింలు, సత్తెయ్య జహంగీర్‌లు. జహీరాబాద్‌కు చెందిన భీంవంశీ, చీకోడు నర్సింలు సిద్దిపేటకి చెందిన రాజేశ్ గాయకులుగా జిల్లా నుంచి గుర్తింపు పొందిన కళాకారులు.

లలిత సంగీతంలో కృషి చేస్తున్న మారుమాముల శశిధర్ శర్మ ప్రముఖ టి.వి.ఛానళ్లలో పాటల పోటీలకు ఎంపికయ్యాడు. సిద్దిపేటలో సంగీత శిక్షణాలయం నడుపుతున్నాడు.

**సినిమా కళ**

వ్యాపారమయమైన సినిమా రంగంలోకి మట్టివాసనలు మోసుకొచ్చిన దర్శకుడు బి.నరసింగరావు. తెలుగు సినిమా చరిత్రలో చెప్పుకోతగ్గ చిత్రమైన మాభూమి సినిమాను నిర్మించిన నరసింగరావు సినిమాకళలో మెదక్ కీర్తిని అంతర్జాతీయంగా వ్యాపింప చేసిండు. రంగులకల, దాసి, ఊరు, మట్టిమనుషులు, దిసిటీ, హరివిల్లు వంటి ప్రత్యామ్నాయ సినిమాలెన్నో నిర్మించిన నరసింగరావు జాతీయ, అంతర్జాతీయ చిత్రోత్సవాలలో అపూరూపమైన సత్కారాలు అందుకున్నారు.

సిద్దిపేటలో కొంతమంది ఔత్సాహిక కళాకారులు 'కాశీయాత్ర' అనే సినిమాను నిర్మించారు. సిద్దిపేటకు చెందిన ముద్దసాని రఘుపతి రెడ్డి పసుపుకుంకుమ, నక్సలైట్ అనే చిత్రాల్ని నిర్మించారు.

**నాట్యకళ**

అగ్రవర్ణాలకు, ఉన్నత కులాలకు చెందినదిగా కనిపించే శాస్త్రీయ నృత్యంలో దళిత కులానికి, వెనుకబడిన కులానికి చెందిన కళాకారులు కీర్తిని పొందగలగడం మెదక్ జిల్లాలో గుర్తించదగిన విశేషం.



ఆంధ్రనాట్యానికి ప్రాచుర్యం కల్పించిన ప్రముఖ నాట్యాచార్యులు నటరాజ రామకృష్ణ 1971 ప్రాంతంలో వివిధ సందర్భాలలో సిద్ధిపేటలో చేసిన ప్రసంగాలు ఎంతోమందిని ఆకట్టు కున్నాయి. నాట్యం మీద ఆకర్షణని పెంచాయి. ఆరెకటిక కులానికి చెందిన గజభీంకార్ రమేష్‌లాల్ మనసులో నట్టువాంగం నిరంతరం ప్రతిధ్వనించింది. యవ్వన ప్రాయంలో ఇల్లు విడిచి హైదరాబాద్ చేరుకొని నటరాజ రామకృష్ణను ఆశ్రయించిండు. 1974లో సిద్ధిపేటలో అరంగేట్రం చేసిన రమేష్‌లాల్ తర్వాత వెనుతిరిగి చూడలేదు. కర్ణాటక, తమిళనాడు, గుజరాత్, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, పశ్చిమబెంగాల్ మొదలుకొని మారిషస్, జర్మనీ, ఇంగ్లాండు దాకా కళాప్రియులు ఆయన గజ్జెలరవళికి జేజేలు పలికారు. హైదరాబాద్ త్యాగరాయ గానసభలో 48 గంటల పాటు ఏకబిగిన చేసిన నాట్యప్రదర్శన ఒక రికార్డు. 1993లో అమెరికా తానా సభలలో రమేష్‌లాల్ ప్రదర్శన ఆదరణ పొందింది. ప్రస్తుతం తను పుట్టిన సిద్ధిపేటలో ఒక నృత్య శిక్షణా సంస్థను ఏర్పాటు చేయాలని రమేష్‌లాల్ ఆరాటపడుతున్నారు.

నటరాజ రామకృష్ణ ప్రోద్బలంతో ఇరవై సంవత్సరాల క్రితం నటరాజ నృత్య కళానికేతన్ అనే ఆంధ్రనాట్య శిక్షణా సంస్థ సిద్ధిపేటలో ఏర్పాటయింది.

ఈ సంస్థలో శిక్షణ పొందిన కళాకారులు శ్రీమతి పి.వి.సుమన, పేరిణి శ్రీనివాస్‌లు. నవజనార్దన పారిజాతం, భామాకలాపం వంటి నృత్య విశేషాలను శాస్త్రీయంగా ప్రదర్శించే శ్రీమతి సుమన తెలుగు యూనివర్సిటీ నుండి ఆంధ్రనాట్యంలో ఎంపి పట్టాను పొందారు. కుకునూరు పల్లెకు చెందిన శ్రీమతి సుమన ప్రస్తుతం బెంగుళూరులో నివసిస్తున్నారు.

దేవాలయాల ప్రవేశం నిషేధించబడ్డ దళితకులంలో పుట్టిన పేరిణి శ్రీనివాస్ నృత్య ప్రదర్శన చేయని దేవాలయం లేదంటే అతిశయోక్తి కాదు. 36 సం॥ల శ్రీనివాస్ రాష్ట్ర వ్యాప్తంగా నాట్య ప్రదర్శనలిచ్చాడు. పేరిణిని ప్రముఖంగా ప్రదర్శించటంతో పేరిణి శ్రీనివాస్‌గా పేరు పొందారు. ప్రస్తుతం సిద్ధిపేటలో పేరిణి నాట్య శిక్షణా సంస్థను కూడా శ్రీనివాస్ నిర్వహిస్తున్నాడు.

మీడియా మాయలో వెర్రితలలు వేస్తున్న ఇవాల్టి సాంస్కృతిక సందర్భంలో రేపటితరంలో జిల్లా నుండి శాస్త్రీయ నాట్యకాళాకారులు పుట్టుకొస్తారనే ఆశ కనిపించటం లేదు.

## నాటక కళ

కొన్ని తరాల హృదయాలను పట్టి ఊపిన నాటక సంస్థ సురభి నాటక సంస్థ. ఈ సంస్థ ప్రదర్శనలు జిల్లాలోని మధ్యతరగతి ఔత్సాహిక కళాకారులలో పౌరాణిక నాటకాలు ప్రదర్శించాలనే కోరిక పుట్టించినాయి. చరిత్రకు అందినంత వరకు ఈ శతాబ్ది ప్రారంభంలో ఘట్టిపల్లి నాగమల్లయ్యారాధ్యులు గౌరీభట్ల మెట్టురామజోషి, ఉమాపతి నారాయణ శాస్త్రి, అష్టకాల నరసింహయ్యలు సిద్ధిపేటలో మంగమ్మ ధర్మశాలలో ఒక తాత్కాలిక నాటకశాల నిర్మించిన్రు. వృత్తి కళాకారుల సాటిగా జనరంజకంగా నాటకాలు ప్రదర్శించారు.

తరువాత తరంలో డా॥ ఎం. కృష్ణారావు, వెంకటస్వామి, టైపిస్టు నాగభూషణం మొదలగు వారు బొబ్బిలియుద్ధం నాటక ప్రదర్శన లిచ్చారు.

కె.వి.రమణ, రామగిరి గణేశ్వరశర్మ, ఉమాపతి పద్మనాభ శర్మ, గౌరీభట్ల మెట్టురామ శర్మ, వేముగంటి నరసింహాచార్యులు తదితరులు ప్రదర్శించిన భువన విజయం నాటక ప్రదర్శన గురించి ఇప్పటికీ ఆ తరం వారు ముచ్చటగా చెప్పుకుంటారు.

సిద్దిపేట నుంచి ఎదిగిన ఉమాపతి బాలాంజనేయశర్మ స్వయంగా నాటకాలు రచించి ప్రదర్శించిన కళాకారులు. ఆలిండియా రేడియోలో వ్యాఖ్యాతగా ఉద్యోగ బాధ్యతల్ని నిర్వహించారు. వీరి భువన విజయం, హంపీ సుందరి, బుద్ధం శరణం గచ్ఛామి నాటికలు రేడియో ద్వారా ప్రసారమైనాయి. వీరు రచించిది కృష్ణ దేవరాయలుగా నటించిన 'భువనవిజయం' జాతీయ స్థాయిలో దూరదర్శన్ ద్వారా (డిడి1) ప్రసారమయింది.

1978 ప్రాంతంలో సిద్దిపేట యువకళాకారులు ఏర్పాటు చేసుకున్న 'నవ్యకళానికేతన్' అనే సంస్థ అలాజ్‌పూర్ కిషన్ రచించిన 'గ్రామ పిశాచాలు' నాటికను విరివిగా ప్రదర్శించింది. ఇదే సంస్థ 1989లో తనికెళ్ళ భరణి రాసిన గార్ధభాండం నాటికని ప్రదర్శించి పరిషత్తు పోటీలలో బహుమతుల్ని గెలుచుకుంది.

సంగారెడ్డికి చెందిన మైత్రేయ కళాసమితి నాటకరంగంలో గుర్తించదగిన కృషి చేసింది. మెదక్‌జిల్లాలో నాటక పరిషత్తు పోటీలను నిర్వహించిన ఏకైక సంస్థ. సాంఘిక నాటకాల్లో ఈ సంస్థకు చెందిన నెమ్మాని మోహనమూర్తికి నటుడిగా గుర్తింపు వుంది. 1990లలో ఈ సంస్థ మంచి కృషి చేసింది. వర్తమానంలో పటన్‌చెర్వు ప్రాంతంలో ప్రాంతేతరుల నిర్వహణలో నాటక సంస్థలు ఉన్నాయి. అడపాదడపా నాటక పోటీలు జరుగుతున్నాయి.



సాహిత్యరంగంలో బలమైన ప్రభావం వేసిన మంజీరా రచయితల సంఘం ఉద్యమ అవసరంగా విరివిగా నాటక ప్రదర్శన లిచ్చింది. 1993 ప్రాంతంలో చెలరేగిన మధ్యపాన వ్యతిరేకోద్యమంలో మ.ర.సం. అమోఘమైన పాత్ర నిర్వహించింది. 'గెలిసేటీరాలి' మనం అనే నాటికని సుమారు 50 ప్రదర్శనలిచ్చింది.

ప్రస్తుత పరిస్థితులలో మాత్రం జిల్లాలో నాటకరంగం పరిస్థితి నిరాశనే మిగులుస్తున్నది.

ఒకవైపు చేదువిషం లాంటి సామాజిక పీడనను అనుభవిస్తూ మెదక్ జిల్లా సాంస్కృతిక సాఫల్యతను సాధిస్తున్నది. ప్రపంచాన్ని తనవైపు మలుపుకునే కొత్త మలుపులు తిరుగుతున్నది.



# సాహితీ సంస్థలు

నందిని సిధారెడ్డి

సాహితీ సాంస్కృతిక విశేషాలు ప్రజల్లో ప్రచారం చేయటానికి, సాహితీ సృజన వైపు కొత్త తరాల్ని ఆకర్షించటానికి జిల్లాలో అనేక సాహితీ సంస్థలు కృషి చేశాయి. కాలానుగుణంగా వస్తున్న అన్ని పరిణామాల్ని అందుకొని రచనా రంగాన్ని సంపన్నం చేయటానికి రచయితలు, సాహిత్యాభిమానులు సంస్థల్ని నిర్వహించారు.

**తెలంగాణ రచయితల సంఘం**

తెలంగాణ చరిత్ర, సాహిత్య వారసత్వాన్ని మెదక్ జిల్లాలో ప్రచారం చేయటానికి 1953-56ల మధ్య విశేషమైన కృషి జరిగింది. హైదరాబాద్ రాష్ట్రంలో తెలంగాణ వాతావరణాన్ని నెలకొల్పటానికి ఏర్పడిన తెలంగాణ రచయితల సంఘానికి జిల్లా శాఖ ఉండేది. ఇది సంగారెడ్డి ప్రాంతంలో, సిద్ధిపేట ప్రాంతంలో సాహితీ సేవలందించింది. కాపు రాజయ్య, వేముగంటి నరసింహాచార్యులు సంస్థ వికాసానికి తెలంగాణ చైతన్యానికి తోడ్పడ్డారు.

**సాహితీ వికాస మండలి**

సిద్ధిపేట కేంద్రంగా ఈ సంస్థ పని చేసింది. 1960లో అక్టోబర్ 2వ తేదీ గాంధీ జయంతి రోజున వేముగంటి నరసింహాచార్యులు అధ్యక్షుడుగా హరిపురం వెంకటరామయ్య కార్యదర్శిగా సాహితీ వికాస మండలి ఏర్పడింది. పుస్తక ప్రచురణలలో భాగంగా నలుగురు కథా రచయితల 'చతురంగం' కథల సంకలనం ప్రచురించింది. సభా నిర్వహణల్లో భాగంగా మల్లినాథ సూరి జయంతి, పానుగంటి వారి జయంతి, పోతన పంచశతి, తిరుపతి వేంకట కవుల జయంతి మొ॥న ఉత్సవాలు నిర్వహించింది.



యువకవుల 'చైతన్యకేతనం', ప్రముఖుల 'కవితామాల'లతో సహా వేముగంటి 'వీరపూజ' 'ఆంధ్ర విష్ణువు', 'వ్యాసకలాపం', కాంతి వైజయంతి' మొదలైన 30 గ్రంథాలు ప్రచురించింది. ఈ సంస్థ నిర్వహించిన సభల్లో పి.వి. నరసింహారావు, డా.సి.నారాయణరెడ్డి, దాశరథి, దివాకర్ల, కాళోజి, గుంటూరు శేషేంద్ర శర్మ లాంటి ప్రముఖులెందరో పాల్గొన్నారు.

**భారతీయ రచయితల సమితి**

పరాశరం గోపాలకృష్ణమూర్తి 1956లో సిద్ధిపేట డిగ్రీ కళాశాల ఆంధ్రోపన్యాసకులుగా చేరి ఈ ప్రాంతంలో సాహిత్య కృషికి దోహదం చేశాడు. 1960లో భారతీయ రచయితల సమితి సిద్ధిపేట శాఖ ఏర్పాటు చేసి 1968లో సిద్ధిపేటలో మహాసభలు నిర్వహించాడు. 'సాధన' పత్రిక సంపాదక బాధ్యతను ఆయన నిర్వహించేవాడు. జాతీయ భావజాల నేపథ్యంతో సంస్థ కార్యక్రమాలు జరిగేవి.

**మెదక్ జిల్లా రచయితల సంఘం**

జిల్లాలో అక్కడక్కడా జరుగుతున్న కృషి తప్ప జిల్లా వ్యాప్తంగా పని చేసే సంస్థలు లేకపోవడం లోటుగా గుర్తించి 1964 డిసెంబర్ 12న మెదక్ జిల్లా రచయితల సంఘం ఏర్పాటైంది. ఆందోలు రంగనాథ సరస్వతీసదన ప్రాంగణంలో ఏర్పాటైన ఈ సంఘానికి వేముగంటి నరసింహాచార్యులు అధ్యక్షులుగా, ఎం.రంగకృష్ణమాచార్యులు ప్రధాన కార్యదర్శిగా ఉన్నారు. ఈ సంఘం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి అనుబంధంగా పనిచేసి వార్షికోత్సవాలు ఘనంగా జరుపుకున్నది. 15 పుస్తకాలు ప్రచురించింది. ఈ సంస్థ స్ఫూర్తితో ఎందరో సాహిత్యాభి మానులుగా, రచయితలుగా రూపొందినారు.

**మెదక్ మండల సాహిత్య పరిషత్తు**

1976లో మెదక్ మండల సాహిత్య పరిషత్తు ఏర్పడి జిల్లాలో సాహిత్య కార్యక్రమాల విస్తృతికి కృషి చేసింది. టేకుమాల్, నర్సాపూర్, గజ్వేల్, జోగిపేటలలో అది నిర్వహించిన వార్షికోత్సవ సభలు మరపురానివి. శాస్త్రుల విశ్వనాథశర్మ అధ్యక్షులుగా ముదిగొండ ఆంగీరసశర్మ ప్రధాన కార్యదర్శిగా సుమారు ఐదేళ్ళు సాహిత్య కార్యక్రమాలు నిర్వహించింది. రసతరంగాలు, ప్రగతి పథాలు మొ॥న పుస్తకాలు ప్రచురించింది. సాహిత్యంతో పాటు 'భువనవిజయం' 'శివతాండవం' వంటి కళా ప్రదర్శనలు, లలిత సంగీత విభావరులు నిర్వహించింది.

## నవచైతన్య భారతి

1970లో నవచైతన్య భారతి స్థాపించబడింది. ఉమాపతి పద్మనాభ శర్మ గుమ్మనగారి లక్ష్మీ నరసింహశర్మల సారథ్యంలో ఈ సంస్థ పని చేసింది. 'అరవిందుని దర్శనం'పై పుస్తకం ప్రచురించి గుర్తింపు పొందింది.

## చైతన్య సాహితి

1980లో కె.అంజయ్య నేతృత్వంలో చైతన్యసాహితి రూపొందింది. అంజయ్య రచించిన 'గీతాయుధం' కవితా సంపుటి ప్రచురించింది. 'ఊపిరి' అనే బులెటిన్ వెలువరించింది.

## ప్రేరణ సాహితి

ఎస్.పెంటయ్య సారథ్యంలో ప్రగతిశీల భావాలతో 'ప్రేరణ సాగింది'. 1982లో ఏర్పాటై కార్యక్రమాలు నిర్వహించింది. నవ యువకవులకు ఇది మార్గదర్శనం చేసే విధంగా కవి సమ్మేళనాలు నిర్వహించింది.

## పల్లవి ఆర్ట్స్ సంస్థ

1984లో సిద్ధిపేటలో 'పల్లవి' ఆర్ట్స్ సాహితీ, సాంస్కృతిక సంస్థ ఏర్పాటైంది. ఈ సంస్థ అధ్వర్యంలో 'రోజులు మారాయి' హాస్యనాటిక ప్రదర్శించబడింది. 'గీతం నా సంకేతం' 'ఆత్మవేదం' కవితల సంపుటులు వెలువడ్డాయి. 'బాలగీతాంజలి' పేరుతో పిల్లల పాటల క్యాసెట్ రూపొందించి విశేష ఆదరణ పొందింది.

తరువాత మెదక్‌లో 'మంజీర కళాసమితి' 1982-83లలో, రామాయంపేటలో 1984లో 'రమ్య భారతి' సాహితీ కృషి సాగించాయి. సంగారెడ్డిలో 1997 నుండి 'సాహిత్యరంజని' ముళ్ళపూడి సచ్చిదానందమూర్తి అధ్యక్షుడిగా సాహిత్య సభలు నిర్వహిస్తున్నది.

## మెదక్ స్టడీ సర్కిల్

1984 ఏప్రిల్‌లో మెదక్‌లో ప్రారంభమైన ఈ సంస్థ అనేకసభలు నిర్వహించింది. ఆధునికసాహిత్యచైతన్యాన్ని విస్తరింపజేయటంలో భాగంగా కె.శివారెడ్డి, దేవిప్రియ, రంగనాథాచారి, ఓల్గా లాంటి ప్రముఖుల ఉపన్యాసాలు ఏర్పర్చింది. 'మంజీర' బులెటిన్ ప్రచురించి నవ రచయితలకు అండగా నిలిచింది.



## అభిలేఖిని రచయితల సంఘం

గన్నుకృష్ణమూర్తి సారథ్యంలో దాశరథుల బాలయ్య అధ్యక్షుడుగా 1996-97 ప్రాంతంలో ఏర్పాటైన ఈ సంస్థ సభలు నిర్వహించింది. 'అభిలేఖిని' కవితా సంకలనం ప్రచురించింది.

## మంజీరా రచయితల సంఘం

జిల్లాలోని రచయితలందర్నీ ఏకత్రితం చెయ్యాలని, ఆధునిక సాహిత్య వాతావరణం నెలకొల్పాలని 1986 జులై 20వ తేదీన సిద్ధిపేటలో సి.నారాయణరెడ్డి చేతుల మీదుగా ఈ సంస్థ ప్రారంభమైంది. తెలుగు సాహిత్యాన్ని ప్రభావితం చేస్తున్న అస్తిత్వవాదాల, విప్లవ ఉద్యమాల మీద విశ్లేషణాత్మకమైన ప్రసంగాలు ఏర్పాటు చేసింది. పదేళ్ల సభలు, పదిహేనేళ్ళ సభలు, ఇరవై ఏళ్ళ సభలు అత్యంత ఘనంగా నిర్వహించింది. 13 కవితా సంపుటాలు 3 కవితా సంకలనాలు, 2 పాటల సంకలనాలు, సాహిత్య వ్యాస సంకలనం ప్రచురించింది. మూడు ఆడియో క్యాసెట్లు వెలువరించి తెలుగు సాహిత్య విమర్శకుల దృష్టినాకర్షించింది. 'గెలిసేతీరాలి మనం' వీథి నాటికను 40 గ్రామాల్లో ప్రదర్శించి గ్రామీణులకు దగ్గరైంది. కవుల్ని, గాయకుల్ని, వక్తల్ని రూపొందించి సాహిత్యాన్ని విస్తృత ప్రచారంలోకి తెచ్చింది. 'మంజీర' పత్రిక ఎనిమిది సంచికలు నడిపింది.

## జాతీయ సాహిత్య పరిషత్తు

రాష్ట్ర వ్యాప్త సంస్థ అయినప్పటికీ మెదక్ జిల్లాలో విశేషంగా పని చేసింది. 1987లో మెదక్ శాఖ పొద్దుటూరిఎల్లారెడ్డి నేతృత్వంలో ఏర్పడింది. సిద్ధిపేట, దుబ్బాక, మెదక్, గజ్వేల్, రామాయంపేటలలో శాఖలు ఏర్పాటు చేసుకున్నది. భారతీయ సంస్కృతి, దేశభక్తి, జాతీయతా భావాలు మార్గదర్శకాలుగా పరిషత్తు పని చేస్తున్నది. ఈ సంస్థ 42 పుస్తకాలు ప్రచురించింది. ఐతాచంద్రయ్య కథలు, నవలలు, కనపర్తి రామచంద్రాచార్యులు కవితలు ప్రచురించింది. ప్రతియేటా ఉగాదికి 'సాహిత్యవసంతోత్సవం', వార్షికోత్సవం సందర్భంగా 'ఉత్తమకవిపురస్కారం' నిర్వహిస్తారు.

## జనసాహితి

1996 తర్వాత జనసాహితి మెదక్ జిల్లా శాఖ ఏర్పాటైంది. గోపాలరావు, సంపత్‌లు కార్యక్రమాలు నిర్వహించేవారు. 'సంఘర్షణ' రచనల సంకలనం ప్రచురించారు.



# చారిత్రక స్థలాలు

నందిని సిధారెడ్డి

ప్రతి ప్రదేశానికొక చరిత్ర ఉంటుంది. విశేషముంటుంది. స్థలపురాణముంటుంది. చరిత్ర తెలుసుకోవటం ద్వారా మనిషి కొత్తఉత్సాహం పొందుతాడు. చారిత్రక స్థలాలు సందర్శించటం, స్పర్శించటం, సంచరించటం ప్రత్యేక అనుభూతిని కలిగిస్తుంది. పురావస్తువులు, పురాతనస్థలాలు చారిత్రక సంఘటనలు లోలోపలి పురాస్మృతుల్ని తవ్వితీసి ఉత్తేజాన్ని నూరిపోస్తాయి. చరిత్ర తెలుసుకోవటమంటే మనల్ని మనం తెలుసుకోవటమే. చారిత్రకస్థలాలు సందర్శించటమంటే మనల్నిమనం ముట్టుకోవటమే. జిల్లాలో అటువంటి అపురూప చారిత్రక స్థలాలున్నాయి. వాటిలో ఉజ్జ్వలఘట్టాల్ని దర్శించవచ్చు. ఉత్సాహం పొందవచ్చు.

**కొండాపూర్**

మెదక్ జిల్లా చారిత్రక స్థలాల్లో మొదట పేర్కొనవలసిన ప్రాంతం కొండాపూర్. శాతవాహనుల తొలికాలపు చరిత్రకు సాక్ష్యం కొండాపూర్. దక్షిణ తక్షశిల అనే పేరున్నది. లభిస్తున్న చారిత్రకాధారం మేరకు తొలి తెలుగు రాజు ముఖ్యపట్టణం. మెగస్తనీస్ పేర్కొన్న 30 తెలుగు నగరాల్లో ఇదొకటి. నలమహారాజు భార్య దమయంతి, శ్రీకృష్ణుని భార్య రుక్మిణీలు జన్మించిన కుందినీ నగరమే 'కొండాపూర్'అని ప్రతీతి. ఆనాటి నగర జీవనానికి అవసరమైన సదుపాయాలుఎన్నో కొండాపూర్ శిధిలాల్లో దొరికాయి. ఇది గొప్ప వర్తక కేంద్రం. రోమ్‌తో వర్తక సంబంధాలున్నట్లు ఇక్కడ దొరికిన నాణాలు తెలుపుతున్నాయి. కొండాపూర్ శాతవాహనులటంకశాల.



ఆనాటి విలువైన లోహవస్తువులు, మట్టివస్తువులు, దంతపు, గాజువస్తువులు, వ్యవసాయ పనిముట్లు, గృహోపకరణాలు, ఆభరణాలు, నాణాలు అప్పటి క్రీ.పూ. 200 - క్రీ.శ. 200 మధ్యకాలానికి సంబంధించిన వస్తువులు, అపూర్వ చారిత్రక సంపద మ్యూజియం లో భద్రపరిచారు.

క్రీ.శ. 1900లో హెన్రీ కౌజెన్స్ అనే పురావస్తు శాస్త్రవేత్త మొదటిసారి ఈ ప్రాంతాన్ని కనిపెట్టారు. నూతనశిలాయుగపు మానవుడు ఉపయోగించిన రాతి పనిముట్లు 5000 సం.రాలకు పూర్వమే ఇక్కడ జనజీవనమున్నట్లు తెలిపే ఆధారాలు కొండాపూర్‌లో లభించాయి. నాలుగు దశాబ్దాల శాతవాహనుల పాలనను ప్రతిబింబించే ఆధారాలు ఇక్కడున్నాయి.

**ఎడపాయల**

మంజీరానది ఉపనదులు ఏడు పాయలు సంగమం చెందే ప్రాంతం దుర్గాదేవి పుణ్యక్షేత్రం కలిగి ఉన్న గుహ. ఇక్కడ జనమేజయుడు మానవాళికి సర్పాలతో ఏర్పడుతున్న ముప్పులను పరిహరించటానికి సర్పయాగం చేశాడని స్థలపురాణం. దీనికి గరుడగంగ అనే పేరుంది. గరుత్మంతుడు గంగాదేవి అనుగ్రహంతో ఆమెకాలి అందెను గ్రహించి తీసుకెళ్లుతున్నపుడు జారిపోయి ఇక్కడపడి నది పారిందని కథ కూడా వున్నది. దేవాలయ సమీపంలో ఘనపురం ప్రాజెక్టు నీటి ప్రాంతం కనువిందు చేస్తుంది. గుట్టలమధ్య నుంచి పారే మంజీరపాయలు ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. మహాశివరాత్రి సందర్భంగా జరిగే జాతరలో 15 లక్షల మంది వరకు పాల్గొంటారు.

**మెదక్ ఖిల్లా**

పురాతన చరిత్రకు మెదక్ ఖిలా సాక్ష్యం. 300 అడుగుల ఎత్తున్న గుట్ట. విశాలమైన ప్రాంతం. కాకతీయ రాజులు నిర్మించారని భావిస్తారు. దక్కనులో నిర్మించిన కోటలలో ఇది ముఖ్యమైన కోట. కుతుబ్‌షాహీలు, ఆసఫ్‌జాహీలు దీన్ని మరమ్మత్తు చేసి ఉపయోగించుకున్నారు. గోనెరెడ్డిరాజులు తమ పాలనా కాలంలో దీనికి ప్రాధాన్యత చేకూర్చారు. కోటలో ఇత్తడితో తయారు చేసిన 10 అడుగుల పొడవైన ఫిరంగి, తుపాకి ఆయుధం వుంది. క్రీ.శ. 1620లో తయారు చేశారు. దుర్గానికి తూర్పున మెదక్ పట్టణమున్నది.

**కొల్చారం**

కొల్చారం మండల కేంద్రం. పూర్వపు కోలాచలం. రానురాను 'కొలిచెలిమె' 'కొల్చారం'గా పిలవబడింది. కాళిదాసు కావ్యాలకు పునర్జీవం పోసిన ప్రఖ్యాత

పండితుడు మల్లినాథసూరి స్వగ్రామం. జైనుల కేంద్రంగా విరాజిల్లింది. జైనమత గురువు 23వ తీర్థంకరుడైన పార్శ్వనాథుడి పేరు కన్నడభాషలో చెక్కి ఉన్న 9 అడుగుల ఎత్తైన పెద్ద విగ్రహం లభించింది. ఇది 10వ శతాబ్దిలోని కళ్యాణి చాళుక్యుల కాలం నాటిదని గుర్తించారు. జంట నగరాల జైన మతస్థులు ఈ విగ్రహాన్ని హైదరాబాద్‌కు తరలించటానికి ప్రయత్నిస్తే గ్రామస్థులు అడ్డుకున్నారు. 1997లో వారు కొల్చారంలోనే అందమైన జైన ఆలయం నిర్మించారు. జైనులు జరిపే ప్రత్యేక ఉత్సవంలో దిగంబర జైనులతో సహా అనేక మంది సందర్శకులు పాల్గొంటారు. కొల్చారంలో గ్రామ పంచాయితి ఆవరణలో ఒక శాసనమున్నది. 'కొల్చారం షరీఫ్ దర్గా' ఉన్నది. కొల్చారంలో మల్లినాథసూరి గృహం శిథిలమై ఉన్నది.

### పటం చెరు

జాతీయ రహదారి మీద హైదరాబాద్‌కు 32 కి.మీ. సమీపంలో ఉన్నది. గతంలో ఇది పొట్ల చెరువు. గుల్షనాబాద్, బీదర్లకు రెవిన్యూ డివిజన్ కేంద్రంగా ఉండేది. జైనుల ముఖ్య పట్టణాల్లో ఇదొకటి. జైనమతం బాగా విలసిల్లిన ప్రాంతం పొట్ల చెరువు. చాలా జైన విగ్రహాలు హైదరాబాద్‌కు తరలించారు. 15వ శతాబ్దిలో నిర్మించిన అనేక దేవాలయాలు ఇక్కడున్నాయి. కుతుబ్ షాహీలు నిర్మించిన చారిత్రక, స్మారక కట్టడాలు ఉన్నాయి. కులీకుతుబ్‌షా సైన్యాధిపతి అమీర్‌ఖానుకు సన్నిహితుడయిన పొన్నగంటి తెలగన ఇక్కడ ఆస్థాన కవిగా ఉన్నాడు.

### అందోలు కోట

1550 నుండి 1595 వరకు మెతుకు సీమ రాజధాని అందోలు. ముసలారెడ్డి అందోలు కోట నిర్మించాడు. దీన్ని అల్లమరెడ్డి పాలించినట్లు తెలుస్తున్నది. మరాఠీ పీష్వాల, దోపిడీ దొంగల నుండి కాపాడుకొనటానికి అందోలు చుట్టూ పటిష్టమైన కోటను నిర్మించాడు. కోట మూడు ముఖద్వారాలు 36 బురుజులు చుట్టూ 8000 అడుగుల ప్రహరీగోడ కళాత్మకంగా నిర్మించారు. గ్రామ మధ్య భాగాన మరో కోట ఉన్నది. ఇందులో రాజభవనం, సేనానాయకుని భవనం ఉన్నాయి. దీన్ని 'సిద్ధిమహల్' అని పిలిచేవారు. అందోలును 13 మంది రాజులు 8 మంది రాణులుఏలినట్లు చెప్తుతారు.

### పాపన్నపేట

పాపన్నపేట సంస్థానాధీశులు రెడ్డిరాజులు. వీరనారిగా పేరుపొందిన రాణి శంకరమ్మ పాపన్నపేట కోట నిర్మించి పరిపాలించింది. ఆమె నిజాం మెప్పు పొంది 'రాయ్‌బాగన్' బిరుదు పొందింది. కోట పక్కన చెరువు వుంది. మెదక్ కోటకు



పాపన్నపేట కోట రహస్య మార్గం ఉన్నట్లు భావిస్తారు. పాపన్నపేట పాలకుల్లో రాజనరసింహారెడ్డి, సదాశివరెడ్డి ముఖ్యులు.

### టేక్మాలు

పాత తాలుకా పట్టణం. కాకతీయ కాలంలో వేయించిన శాసనముంది. ప్రతాపరుద్ర చక్రవర్తి క్రీ.శ. 1308 సం॥ రంగనాథస్వామి దేవాలయం కట్టించి దాని పోషణ కోసం ఈ దానం చేస్తూ ఈ శాసనం వేయించాడు. శైవులయిన కాకతీయుల మత సామరస్యాన్ని ఇది చాటుతుంది.

### రాజగోపాల్‌పేట

సిద్ధిపేట సమీపంలోని అతి ప్రసిద్ధి చెందిన ప్రాంతమిది. గోలకొండ నవాబుల దగ్గర మంత్రులుగా పని చేసిన అక్కన్న, మాదన్నలు ఈ ప్రాంతాన్ని పరిపాలిస్తూ కోటను నిర్మించారు. నవాబుల కాలం నాటి చిత్ర, శిల్ప కళ కోట గోడల మీద చెక్కబడి ఉన్నది. పైకి వెళ్ళటానికి మెట్లు నిర్మించారు. కోట పక్కన చాలా గ్రామాల్ని సస్యశ్యామలం చేసే పెద్ద చెరువు ఉన్నది.

### శంకరంపేట

రాణి శంకరమ్మ పేరిట నిర్మించిన కోట. సైనిక రక్షణకు ఈ కోటను వినియోగించారు. గ్రామం నడిమధ్యలో ఉన్న కచీరు నిర్మాణం కూడా ఇక్కడ ప్రత్యేకంగా ఉన్నది.

### నాచగిరి

లక్ష్మీనరసింహస్వామి ఆలయం నిర్మాణమై వుంది. దీనికి నాచగిరి, శ్వేతగిరి అని పేర్లున్నాయి. పూర్వం గార్గేయ మహర్షి ఈ గిరిపై తపస్సు చేసి సిద్ధి పొందాడని ప్రతీతి వుంది. దీనికి గార్గేయ తపోవనమని కూడా పేరున్నది. కొండగుహ, గుహలో ఆలయం, పక్కన ఆనుకొని ప్రవహించే పసుపేరు కనువిందు కలిగిస్తుంది. పసుపేరు మంజీరానదిలో కలుస్తుంది.

### మెదక్ చర్చి

ఆసియా ఖండంలో రెండవ స్థానం పొందిన అతిపెద్ద చర్చి ఇది. 1914లో ప్రారంభమైన నిర్మాణ పనులు 1928లో పూర్తయినాయి. చార్లెస్ వాకర్ పాస్నెట్ చేతిలో రూపుదిద్దుకున్నది. ప్రఖ్యాత శిల్పి జె.సాలిస్ బరీ రూపకల్పన చేసిన కేథడ్రల్ చర్చి ఇది. సంప్రదాయ పద్ధతి కట్టడం కాకుండా ఇనుము, ఉక్కు, సిమెంటు, రాయి

కలిసిన ఆధునిక కాంక్రీట్ నిర్మాణమిది. 200 అడుగుల పొడవైన గోపురం వంద అడుగుల వెడల్పుతో నిర్మించారు. 360 ఎకరాల విస్తీర్ణం చుట్టూ ప్రహరీగోడ వుంది. తీవ్ర దుర్భిక్షకాలంలో పేదలకు పని కల్పించిన కట్టడమిది. క్రైస్తవ ప్రార్థనామందిరమే అయినప్పటికీ ఇతర మతస్థులు ఎక్కువగా సందర్శిస్తారు. 5000 మంది ఒకేసారి ప్రార్థన జరిపే విధంగా తీర్చిదిద్దిన ఈ చర్చిలో క్రిస్‌మస్ సందర్భంగా వేలమంది సందర్శకులతో, అలంకరణలతో ప్రత్యేక ఉత్సవాలు జరుగుతాయి. సాలిస్‌బరీ రూపొందించిన రంగు రంగుల అద్దాల అమరికతో ఉన్న క్రీస్తు జీవన వృత్తాంత చిత్రాలు ప్రత్యేక ఆకర్షణగా నిలుస్తాయి.

### తిప్పనగుళ్ళ

ఆ వూరికి ఈ పేరు స్థిరపడటానికి తిప్పడు నిర్మించిన గుడులు కారణం. ఆ గుడి నిర్మాణాలు శిథిలావస్థలో ఉన్నప్పటికీ అద్భుతమైన కళాత్మక శిల్ప సంపద ఉట్టిపడుతున్నది. శిల్పకళాఖండాలు పశువుల కొట్టాలకు వాడుతున్నా పట్టించుకోని పరిస్థితి వుంది. గుడికీ, గుడి శిథిలమవటానికీ చరిత్ర వుంది. తిప్పడు అనే దళితుడు సైనిక, పాలనాధికారిగా ఉంటూ ఈ దేవాలయ నిర్మాణం చేశాడని, పూర్తయిన తర్వాత గుడి పూజాదికార్యక్రమాల్ని అగ్రవర్ణస్థులు వెలివేసి ద్వారానికి చెప్పులు వేలాడదీశారని, అందువల్ల అది శిథిలమవుతూ వచ్చిందని అతని పేరు మీద 'తిప్పనగుల్ల' గ్రామనామం ఏర్పడిందని ప్రతీతి ఉన్నది.





# మెతుకు జాతరలు

నందిని సిధారెడ్డి

జానపదుల జీవితంలో జాతర స్థానం ఎంతో ఉన్నతమైంది. వాళ్ల బతుకుల్లో బాగా అల్లుకుపోయిన విడదీయరాని పాయ అది. రకరకాల గ్రామీణ సంస్కృతులను ప్రతిబింబించే నీటి అద్దాలు జాతరలు. వ్యక్తి నుంచి వ్యక్తికి, తెగ నుంచి తెగకు, ఊరి నుంచి ఊరికి ఒక్కొక్క ప్రాంతాన్ని పరస్పరం ప్రభావితం చేసుకుంటూ దట్టంగ పాకే విస్తారగుణం జాతరకున్నది. వివిధవృత్తుల్లో నిరంతర శ్రమతోని అలిసి సొలిసి అలమటించే వాళ్లకు విశ్రాంతి, విరామ కేంద్రాలివి. అలసట మరపించుడే కాకుండా ఏడాదికి సరిపడా ఉత్సాహాన్ని, ఉల్లాసాన్ని ఇవి నింపుతాయి. పలు సంప్రదాయా లను, ఆచారాలను, ఆనందాలను, ఆచరణలను, వ్యాపారాలను కలుపుకొని కొనసాగే ఒక సంకీర్ణ వ్యవస్థ. పసిపిల్లలు, పోరలు, పడుచులు, ముసలోల్లు, స్త్రీ, పురుషులు, వృత్తులు, కులాలు, మతాలు అంతా సందడి సందడిగా ఉండే సామూహిక వేడుక ఇంతకు మించి ఇంకొకటిలేదు. విశ్రాంతికి, విహారానికి, వినోదానికి ఇంత మంచి మందిసందర్భం ఇంకొకటేదీ లేదు.

జాతర మీద జానపదులు వందల పాటలల్లుకున్నారు. కథలు చెప్పుకున్నారు. సామెతలు సృష్టించుకున్నారు. విశ్వాసాలు కూడగట్టుకున్నారు. జాతర చుట్టూరా సజీవ వాతావరణమున్నది.

'జాతర' అనేది ద్రావిగ భాషాపదం. అందరూ కలుసుకునే కోలాహలం. జానపదుల సామూహిక ఆచరణ. జాతర అంటే ఉత్సవం, జాతా, మేలా అనే పదాలు వాడుకలో ఉన్నాయి. గుంపుకు, సంబరాలకు పర్యాయపదాలివి. జాతర అనే పదం 'యాత్రా' శబ్ద భవమనే అభిప్రాయం కూడా ఉంది. "యానేన త్రాయత ఇతి యాత్ర". రక్షణ

కొరకు సాగే ప్రయాణం యాత్ర. యాత్ర నుంచి జాతర వచ్చి ఉంటుందంటారు. కాగా – వాడుకలో జాతర, యాత్ర వేరువేరుగా ప్రయోగిస్తున్నారు. దూర ప్రాంతాలకు వెళ్లితేనే యాత్రలకు వెళ్లారని అంటారు. దైవ, తీర్థ దర్శనం పుణ్యం, మోక్షం కోసం వెళ్లుతుంటారు. ఇవి కొందరికే పరిమితం. జాతర అనేది వేడుక ప్రధానంగా ఉంటుంది. మంది సంప్రదాయంగా ఉంటుంది. ఆంగ్ల భాషలో FAIR (పండుగ) జర్మనీలో MESSE (ప్రార్థనసభ) అనే పదాలు జాతరకు దగ్గర అర్థంలో వాడతారు. యాత్రకు 'ప్రయాణం' Journey అనే అర్థమే ప్రధానం. ఎలమోర్ అనే జానపద పరిశోధకుని అభిప్రాయం ప్రకారం JATARA is a Dravidian Word. Meaning originally a termult or noisy disturbance అంతేకాక – కోస్తా ప్రాంతంలో వాడుకలో ఉన్న 'తిరునాల'కు తెలంగాణలో వాడుకలో ఉన్న 'జాతర'కు వ్యత్యాసాన్ని కూడా ఎలమోర్ వివరించాడు. Tirunala is often used by the worship of the Hindu Gods, but JATARA never is. 'తిరునాల' హిందూదేవతల ఆరాధనలను సూచించే పదం. కానీ – 'జాతర' అట్లా కాదు. విస్తృతార్థం వుంది. ప్రతి ఏటా నిర్దిష్ట కాలంలో ఒక ప్రత్యేక స్థలంలో వేడుక నిమిత్తంగా, మానవ సంబంధంగా వ్యాపార కేంద్రంగా, సాంస్కృతిక సమ్మేళనంగా జరిగే సాంఘికాచరణ జాతర. 'జాతర సేయగావలయు సర్వజనంబుల అంబురాశికిన్' అని మౌసలపర్వంలో తిక్కన గుర్తించాడంటే 'సర్వజనుల' సందర్భానికి జాతర ఎంత అనువైనదో అర్థం చేసుకోవచ్చు.

చాలా ఉత్సవాలు, వేడుకలు రాజుల కోసమే, సంపన్నుల కోసమే ఏర్పాటయితే 'జాతర'లు జనసామాన్యం కోసం అవతరించినయి. జానపదుల జాతరకు శిష్టులాచరించే యజ్ఞయాగాలకు కొన్ని పోలికలున్నాయి. రెండుచోట్ల బలిదానాలుంటాయి. సమూహ సందర్భాలుంటాయి. యజ్ఞయాగాల్లో ఒక స్థాయివాళ్లే ఎక్కువగా పాల్గొంటే జాతర్లలో అన్ని స్థాయిలవాళ్లు ఎక్కువగా సామాన్యులు పాల్గొంటారు.

తెలంగాణాలో బండమీద, గుట్టలమీద, కొండలమీన, నదుల ఒడ్డున, వాగుల ఒడ్డున మాత్రమే జాతరలు జరుగుతాయి. కొన్ని ప్రత్యేక ప్రాంతాల్లో అవసరాలు పెరిగి రానురాను చాలా కేంద్రాలు వెలసినాయి. చాలా ఊళ్ల వాళ్ళు తమ దగ్గర అందుబాటులో వీటిని జరుపు కొంటున్నారు. కుటుంబ రక్షణ, పాడిపంటల రక్షణ, గ్రామాల రక్షణ, సంపదలు, సుఖజీవనం కోసం తమ కోరికల కోసం మొక్కుకుంటారు. ముడుపులు కడుతారు. తమ కోర్కెలు నెరవేరితే మొక్కులు చెల్లించుకుంటారు. కొబ్బరికాయలు కడుతారు. కనుములు కడతారు. సంతానం కోసం తొట్టెలు కడుతారు. బోనం చేస్తారు. కట్నం చెల్లిస్తారు. బండ్లు తింపుతారు. శివసత్తులు శిగమూగుతరు. జోటబాటలు పట్టుకొని, కొరడాలు పట్టుకొని ప్రత్యేకంగా కుట్టిన జెట్టీ బట్టలు కట్టుకొని



అడుగులు వేసుకుంటూ ఆడుతరు. పిల్లలు చూసి ఆనందిస్తుంటరు. జడుసుకుంటరు. జానపద వాయిద్యాలు చప్పుడు మోత మోగుతది. యువకులు యువతులు సైట్లు కొడుతుంటరు. పరస్పర ఆకర్షణ కోసం పాకులాడుతుంటరు. కుటుంబం, ఇల్లు చట్రంలోంచి కొద్ది తెరిపి దొరికి విలాసాలు, జల్సాలు చేస్తరు. మగవాళ్లు తినుబండారాల కోసం హోటళ్లలో చొర్రుతరు. ఆడవాళ్ళు, గాజులు, బొట్లు, అలంకరణ సామాగ్రి కొంటరు. బొమ్మలమ్మేవాళ్లు బుగ్గల్తో పీకల్తో సెండ్లతో ఆకర్షిస్తారు. అవికొనియ్యమని పిల్లలు తల్లుల ప్రాణం తోడుతుంటరు. కొనుక్కున్న వాళ్లు పీకలూదుకుంట హుషారు చేస్తరు. దుమ్ము, దుమ్ము. భక్తులు పోతుంటరు. వస్తుంటరు. ఎగురుతుంటరు. అటు ఇటు మిఠాయి దుకాణాలుంటయి. పెద్దలు మిఠాయి పొట్లాలు కట్టిస్తుంటరు. ఊరికి పోయిన తర్వాత అవి పంచుతుంటరు. బత్తీసలు, చిలుకలు, బెండ్లు, ప్యాలాల ముద్దలు ఇక్కడి జాతర్లలో కన్పించే మిఠాయిలు. లేనోళ్లు ప్యాలాలు పుట్నాలు కొంటరు. చిన్న చిన్న వ్యాపారులకు పెద్ద ఆదాయాలివి. సంచార దుఖానాలు, మిఠాయి బండ్లు, సామాన్ల బండ్లు కదులుతుంటాయి. గృహిణులు ఇంటికి అవసరమైన పాత్రలు, సామాన్లు ఇక్కడే కొంటరు. బట్టల దుకాండ్లుంటాయి. ఒక రకమైన వ్యాపార కేంద్రంగా కూడా జాతర పని చేస్తుంది. చిన్నపాటి సర్కస్, టూరింగ్ టాకీస్, రంగులరాట్నం ఉంటుంది. పిల్లలు యువకులు రంగులరాట్నాలు ఎక్కి గిరిగిరా తిరుగుతరు.

జాతర్లలో నీటికోసం కటకట ఉంటుంది. దూరం నుంచి తెస్తరు కుండలమ్మే వాళ్లుంటరు. బోనమొండుతరు ఏ చాటూలేనిచోట గాలికి వంటచెయ్యటం పెద్దఫీట్. జానపదుల అలంకరణలో సున్నం, జాజు, పసుపు, కుంకుమ ప్రధానమైనవి. బండికి, బోనానికి పుదిస్తరు. పట్నమేపిస్తరు. నైవేద్యం పెడతరు. కథ చెప్పిస్తరు. ఒక్క పొద్దు ఇడుస్తరు. దైవ దర్శనానికి చాంతాడంత క్యూలుంటయి. తోసుకునుడు. కొబ్బరి కాయలు, ఊదు బత్తులు గుగ్గిలం మైసాక్షి పొగలు గుమ్మెక్కిస్తయి. రాత్రంతా భక్తులసందడి. కోలాటాలు, ఒగ్గుకథలు, కాలక్షేపాలు. తెల్లారి కోడికూర, కల్లుసాక ఆనందమే ఆనందం.

మొక్కులు మొక్కుకున్న కొత్త విశ్వాసాల్తో, సరుకులు, సామాన్లు కొనుక్కున్న కొత్త సౌకర్యాల్తో, తిని తాగి, ఆడినకొత్త ఉల్లాసంతో, బంధుమిత్రుల ముచ్చటల్లో తేటకట్టిన కొత్త ఉత్సాహంతో, ఎన్ని రకాల సంబురాలతోనో జీవితాన్ని కుదిపేసే జానపద అనుభూతి జాతర.

## ఏడుపాయల జాతర

మెదక్ పట్టణానికి 10 కి.మీ. దూరంలో మంజీరానది ఒడ్డున ఈ జాతర జరుగుతుంది. గుట్టల మధ్య వెలసిన దుర్గ గుడి ఉంది. మంజీరానది ఏడుపాయలుగా

నీటి ప్రవహిస్తుంది. గనక ఏడుపాయలంటారు. పాయలు ఎడబాసిన ప్రదేశం గనక 'ఎడపాయల'గా ప్రసిద్ధి చెందింది. మహాశివరాత్రి నుండి ఏడు రోజులు ఈ జాతర జరుగుతుంది. మేకలు, కోళ్లు బలి ఇస్తరు. భక్తులు మంజీర నదిలో స్నానం చేసి దుర్గాదేవిని దర్శించుకుంటరు. హైదరాబాద్ లాంటి పట్టణాలతో సహా వివిధ ప్రాంతాల ఇతర రాష్ట్రాల భక్తులు పదిహేను లక్షలకుపైగా జాతరలో పాల్గొనడం విశేషం. అట్లాగే - మరో పర్వదినం మాఘ అమావాస్య రోజు కూడా వేల సంఖ్యలోభక్తులు స్నానాలాచరిస్తరు.

### కూడెల్లి జాతర

దుబ్బాక మండలం కూడవెల్లి. కూడెల్లి వాగొడ్డున ఈ జాతర జరుగుతుంది. రామలింగేశ్వరుడు ఇక్కడి దైవం. రామరావణ యుద్ధానంతరం సీతాలక్ష్మణ సమేతుడై శ్రీరాముడు అయోధ్యకు వస్తున్నప్పుడు జీవనది ఒడ్డున అగస్త్యముని సూచన మేరకు శివలింగాన్ని నిర్మించి పూజలు జరిపాడని ఐతిహ్యం. అట్లా రాముడు నిర్మించిన లింగం కనక 'రామలింగేశ్వర స్వామి'గా ప్రాచుర్యంలోకి వచ్చాడు. ప్రతి ఏటా పుష్యబహుళ అమావాస్య నుంచి మాఘ శుద్ధ తదియ వరకు నాలుగు రోజులు జాతర జరుగుతుంది. రామలింగని మహిమల మీద జానపదులకు ఎంతో భక్తి విశ్వాస ముంది. ఈ ప్రాంతం ఊళ్లల్లో ఇది పెద్ద జాతర.

### సంగమేశ్వర జాతర

జహీరాబాద్ పట్టణానికి 16 కి.మీ. దూరంలో కేతకీ సంగమేశ్వరాలయం ఉంది. పూర్వం ఈ స్థలంలో శౌనకాది మహామునులు యజ్ఞం చేసినట్లు ఐతిహ్యం ఉంది. కృతయుగంలో సూర్యవంశం రాజు శ్రీ కృపేంద్ర భూపాలుడు భయంకరమైన చర్మవ్యాధితో దేశంలోని అన్ని పుణ్యక్షేత్రాలను దర్శించినా లాభం లేకపోయింది. ఒకనాడు కేతకీవనంలో లేడిని తరుముతూ వచ్చిన ఆ రాజు దాహం వేసి మంచినీటి కోసం వెదికినాడట. గుండంలో నీరు కనబడితే దాహం తీర్చుకొని విశ్రాంతి తీసుకొని ఇంటికి వెళ్లేటప్పటికి చర్మ రోగం నయమైందట. అదంతా దాహం తీర్చుకొన్న నీటి మహాత్మ్యమేనని భావించి ఆ గుండం వద్ద గుడి కట్టించినాడు. కాశి నుంచి ఒక ఝర ఆ గుండంలకు ప్రవహిస్తున్నందువల్ల అది "ఝరానంగం"గా ప్రసిద్ధి పొందిందని స్థల పురాణం. శివరాత్రి నాడు మూడు రాష్ట్రాల భక్తులు ఉత్సాహంతో పాల్గొంటారు.

### కొండపోచమ్మ జాతర

తిగుల్ నర్సాపూర్ గ్రామంలో పోచమ్మ గుడి దగ్గర ఈ జాతర జరుగుతది.



"కొమిరెల్లి మల్లన్నకు కోటి దండాలు కొండపోచమ్మకు ముక్కోటి దండాలు" పాటలు పాడుకుంటరు. ఆటలాడతరు. నల్లటి రాళ్లతో నిండిన కొండమొదలులోనే దట్టమైన పచ్చని చెట్ల మధ్యన పోచమ్మ గుడి వున్నది. తెలంగాణ జిల్లాల్లో ప్రఖ్యాతి చెందిన ఎడపాయల తర్వాత కొండ పోచమ్మ జాతరకు అంత ప్రాధాన్యత వున్నది. కొమిరెల్లి వరంగల్ జిల్లా సరిహద్దులో కొండపోచమ్మ మెదక్‌జిల్లా సరిహద్దులో ఉన్నప్పటికీ రెండు జాతరలను రెండు జిల్లాల ప్రజలు తమ ఇష్టంగా జరుపుకుంటరు. మల్లన్నకూ పోచమ్మకూ అన్నా చెల్లెళ్ల బంధం వుందని ప్రచారం ఉంది. కొండపోచమ్మ జాతర ప్రతి సంవత్సరం (జనవరి) సంక్రాంతి నుండి (ఏప్రిల్) ఉగాది వరకు కొమిరెల్లి జాతరతో పాటు జరుగుతది. లక్షల సంఖ్యలో భక్తులు జాతరకు వస్తరు. బోనాల ఊరేగింపు ఆకర్షణీయంగా జరుగుతది. జంతుబలి, కల్లుసాక అధికం. ముడుపులు కట్టడం, చెల్లించడం జానపదుల పద్ధతిలో సాగుతది. బంగారు కండ్లను, ముక్కుపోగు లను పెడతరు. అడబిడ్డగా భావించి ఒడిబియ్యం పోస్తరు. పచ్చి బట్టలతో అమ్మవారిని కొలుస్తరు.

### పుల్లూరు జాతర

సిద్ధిపేటకు 4 కి.మీ. దూరంలో ఉంటది పుల్లూరు. ఒకప్పుడు 70 గ్రామాల కూడలి పుల్లనూరు అనే పుల్లూరు. 94 ఎకరాల విశాలమైన బండమీన కాకతీయుల కాలంలో త్రికూటేశ్వరాలయం నిర్మాణమైంది. ప్రస్తుతం అది జీర్ణావస్థకు చేరి బోగందానిగుళ్లు, తమ్మలిదాని గుళ్లుగా పిలవబడుతుంది. శివుడు ఇక్కడ విగ్రహ రూపంలో కన్పిస్తడు. తర్వాత కాలంలో బండపై నర్సింహస్వామి, వేంకటేశ్వరాలయాలు నిర్మించబడినాయి. ఇక్కడ ప్రతి సంవత్సరం జాతర జరుగుతుంది. 'పుల్లూరు బండ జాతర' అంటారు. ఈ ఊరి దగ్గర జీడిగుండం, జైనదేవుని గుడి కూడా ఉన్నాయి. చారిత్రకంగా ప్రసిద్ధమైన పుల్లూరు జాతర జానపదుల్లో బలంగా ముద్రవేసి సంబురాలు పంచుతున్నది.

### చౌదరిపల్లి జాతర

దుబ్బాక మండలం చౌదరిపల్లిలో దుబ్బరాజేశ్వరస్వామి ఆలయం వున్నది. ప్రతి ఏటా వైశాఖ శుద్ధ త్రయోదశి నుంచి పౌర్ణమి వరకు ఉత్సవాలు జరుగుతయి. మిగతా జాతరలకు భిన్నంగా ఇది వర్షాకాలంలో జరుగుతది. ఒకరైతు పొలం అచ్చుకట్టేటప్పుడు దుబ్బలో రాజేశ్వరుని విగ్రహం దొరికింది. ఆ విగ్రహానికి గుడికట్టి పూజలు జరిపిస్తున్నరు. దుబ్బరాజేశ్వర స్వామి పేరు అట్ల స్థిరపడింది. వర్షాకాలం వ్యవసాయ పనుల సీజన్ అయినా ఈ జాతరకు భక్తులు విశేషంగా జరుపుకుంటరు.

### దుద్దెద జాతర

సిద్ధిపేటకు 12 కి.మీ. దూరంలో కొండపాక మండలంలోని దుద్దెడలో జాతర జరుగుతది. ఇక్కడి దైవం శంభుదేవుడు. కాకతీయుల కాలంలో నిర్మించిన స్వయంభూలింగ ఆలయమిది. బండ్లూ ఊరేగింపులూ భజన్లు మూడు రోజులు జరుగుతయి.

### భేతాళ జాతర

అల్లాదుర్గం మండల కేంద్రంలో భేతాళస్వామి జాతర జరుగుతది. ఈ జాతరకు జిల్లా ప్రజలే కాక సరిహద్దురాష్ట్రాల నుంచి, జిల్లాల నుంచి వేలసంఖ్యలో భక్తులు పాల్గొంటరు. భూతప్రేతాలకు అధిపతిగా భావించే భేతాళస్వామికి ఇక్కడ తప్ప మరెక్కడా ఆలయం లేదు. భూత, ప్రేతాల, పిశాచాల పీడలు రావని, చిన్న పిల్లలకు సోకిన భయంకర వ్యాధులు పోతాయని, కరువు కాటకాలు రావని విశ్వాసంతో కోళ్లు, మేకలు, గొర్రెలు బలిస్తరు. వారం రోజులు జరిగే ఈ జాతరలో భక్తులు సందడి ఎక్కువ. ఇక్కడ పోచమ్మ, దుర్గమ్మ గుళ్లు కూడా జాతరలో భాగం.

